సమయం పది దాటింది.

బారులో కెళ్ళి బీరు తాగాలన్పించింది.

కారులో కాకుండా కాలినడకన బయలుదేరాను.

నా చూపులు రోడ్డుమీద కాక పక్క చీకటివీధుల్లో వున్నాయి. అప్రయత్నంగా ఓ వీధిలోకి తిరిగి చకచక నడవసాగాను. ఇంతలో హఠాత్తుగా ఎక్కడినుంచో వూరకుక్క వచ్చి నా వెంటపడింది. భయంకొద్దీ వేగంగా వురికాను. కుక్క అరుస్తూ తరుముతోంది. దాని కంట కుండా కొంతదూరం పరిగెత్తాక, ఎదురుగా ఒక బీట్ కానిస్టేబిల్ కన్పించాడు. నేను సందేహించకుండా అతని లాఠీ లాక్కొని దవడమీద గుద్దాను. అతను కీచుమన్నాడు నేను పరుగు లంకించుకుని హోటల్ కొచ్చి పడ్డాను.

నాకు తృప్తికల్గింది. నేరం చేస్తున్నప్పుడు కలిగే భయాందోళనల్ని అనుభవించాను. సులభంగా నిద్ర పట్టింది.

మర్నాడు వుదయం లేచి వుషారుగా నర్సింగ్ హోమ్కి బయలుదేరాను.

మాధవి బెడ్ మీద పడుకుని వుంది. నన్ను చూసి కళ్ళు పెద్దవయ్యాయి. పెదవులు విచ్చుకున్నాయి. చిరునవ్వు వెలువడింది.

నేను సంతోషించాను. ఆమెపక్కన కుర్చీలో కూచుని విష్ చేశాను.

"కమల్, మీరొస్తారనుకోలేదు! మిమ్మల్ని తిట్టాను! దుర్భాషలాడాను! బాధపడి వెళ్ళిపోయారనుకున్నాను" గొణిగిందామె.

"తిట్లు నాకు కొత్తకాదు—నా బాస్ తిట్లు మీకు డిక్షనరీలో కూడ దొరకవు" అన్నాను.

నవ్వింది ఆమె.

"కాలెలా వుంది?" అడిగాను.

"ఫరవాలేదు. నా గురించి దిగులుపడకండి! వేరే విషయాలు మాట్లాడుకుందాం, జానీ ఏమయ్యాడు?"

ఆ విషయం అప్పటివరకు నాకు తట్టలేదు.

అయితే, ఇన్‌స్పెక్టర్ మళ్ళీ నన్ను కలవలేదు కాబట్టి వాడి పరిస్థితి మెరుగయి వుండవచ్చు అనుకున్నాను.

ఈ విషయం మాధవితో చెప్పాను.

ఆమె కళ్ళు మూసుకుని, "భగవాన్! రక్షించావు!" అంది.

నేనేమీ అన్లేదు.

"మీరిప్పుడేం చేస్తారు" అడిగిందామె.

ఆలోచించాను. తాళంచెవులు నా దగ్గరే వున్నాయి.

"మీ కభ్యంతరం లేకపోతే ఆఫీసులో కూచుంటాను" అన్నాను.

"చాలా సంతోషం. నన్ను అర్థంచేసుకున్నందుకు చాలా థాంక్స్."

"ఇక వెళ్ళనా?"

తలూపిందామె.

# 9

నేను ఆఫీసుకి తిరిగివచ్చాక ఇన్‌స్పెక్టర్ నుంచి ఫోను వచ్చింది. జానీ పరిస్థితి ఫరవాలేదని చెప్పాడతను. అతను మెట్లమీంచి జారాడని తనకి నమ్మకం కలగడం లేదన్నాడు. వాడి ముఖంమీద దేనితోనో కొట్టివుండాలనీ, రెండు పళ్ళు కన్పించడంలేదనీ చెప్పాడు. నేనేమీ అన్లేదు.

ఆ రోజంతా యెప్పుడు చీకటి పడుతుందా అని

ఆలోచించసాగాను. చీకటి పడ్డాక నా కార్యక్రమం ఏమిటో కూడ నిశ్చయించుకున్నాను.

రాత్రి పదిగంటలకి బయటికి వచ్చి రోడ్డుమీద చూశాను. గతిరాత్రి సంఘటన జ్ఞాపకం వచ్చి ఉత్సాహంగా అటూ ఇటూ చూసాను-ఎలక్ట్రిక్ పోల్ కింద, నిర్మానుష్యంగావున్న ప్రదేశంలో, ఒంటిరిగా కునికిపాట్లు పడుతున్నాడు సోడావాడు.

నన్నెవరూ గమనించడంలేదని తెలుసుకుని, అడుగుల చప్పుడు కాకుండా నెమ్మదిగా వెళ్ళి వాడి వెనక నిలబడ్డాను. గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. కాళ్ళు గజగజ వణికాయి. ఇదే!... ఈ అనుభవమే నాక్కావాలి!

విసురుగా చెయ్యెత్తి వాడి మెడమీద కొట్టి, బండిలోంచి రెండుబుడ్లు తీసుకుని వురుకుతూ-వాటిని రోడ్డుకేసి విసిరికొట్టాను. పెద్దగా శబ్దంచేస్తూ పేలాయి.

ఇంతలో ఎదురుగా ఓ వ్యక్తి కన్పించాడు. ఆలస్యం చెయ్యకుండా అతనిమీద మెరుపుదాడి చేసి, రిస్టువాచీ లాక్కున్నాను. నా భయం యిప్పుడు రెట్టింపయింది. శక్తినంతా కూడదీసుకుని పరిగెడుతూ, వాచీని మురికాల్వలోకి విసిరాను.

తిరిగి నేను హోటల్ కి వచ్చాకగానీ కుదుటపడ్లేదు. నాకిప్పుడు చాలా తృప్తిగావుంది! సోడాబుడ్లను పగలగొట్టాను—ఇద్దర్ని గాయపర్చాను—రిస్టువాచీ నాశనం చేశాను-ఇదంతా చేస్తున్నప్పుడు విపరీతమైన భయానికి లోనయ్యాను! నాకిప్పుడెంత తృప్తిగావుంది!

కానీ-ఆ తృప్తి ఎంతోసేపు నిలువలేదు! నేను చేసిన పనుల్ని విమర్శించుకుంటే అది చాలా తక్కువన్పించింది.

శంకర్ రైఫిల్ లాక్కుంటే నేను లాఠీ లాక్కు-

వ్వాను. శంకర్ సోడాబుడ్లు మనుషులమీద విసిరితే నేను కోడ్డుకేసి కొట్టాను.

నేనెందుకిలా తెలివితక్కువగా ప్రవర్తించాను?

నిజంగా నాలో ధైర్యం లేదా?

పిరికి!

జానీ అవహేళన నా చెవుల్లో మారోగ్రింది.

నా శరీరం అవమానంతో కంచించుకుపోయింది.

నేను పిరికివాడ్నా! అవును! జానీ సరిగానే చెప్పాడు!

మరుక్షణం నా ఆత్మాభిమానం మేల్కొంది. కాదు! నేను పిరికివాడ్ని కాదు! నాకూ శంకర్ ధైర్యసాహసాలున్నాయి! నిరూపించుకుంటాను! అందుకేదయినా చేయడానికి తెగిస్తాను!

ఆ తర్వాత రాత్రంతా రేపురాత్రి కార్యక్రమం గురించి ఆలోచించాను-పటిష్టమైన పథకం-శంకర్ కేమాత్రం తీసిపోకూడదు!

మర్నాడు వుదయం మాధవిని కలుసుకుని క్షేమ సమాచారాలు తెలుసుకున్నాను. ఆ తర్వాత తిరిగి హోటల్ కొచ్చి రిసెప్షనిస్టుతో మాట్లాడాను. కోదాడు కాక, ఖమ్మంకి దగ్గరలో 60 కి.మీ.ల దూరాన కొత్తగూడెం వుందని చెప్పాడతను. టౌన్ పెద్దదే. అన్ని సౌకర్యాలూ లభిస్తాయి. రెండుగంటల ప్రయాణం.

నేనొక నిశ్చయానికి వచ్చి ప్రయాణమవుతుండగా, ఇన్‌స్పెక్టర్‌నించి ఫోన్ వచ్చింది. అవతలినుంచి అతని మాటలు నన్ను కలవర పెట్టాయి.

ఊళ్ళో ఎవడో ఆగంతకుడు తిరుగుతున్నాడట. రాత్రి పూట చెడ్డపనులు అనలేని కొంటెపనులు చేస్తున్నాడట. మొన్నరాత్రి కానిస్టేబిల్‌నీ, నిన్నరాత్రి మరో యిద్దర్నీ

కొట్టి, వాచీ, సోడాబుడ్లు, నాశనం చేశాడట. అయితే వాడ్నెవరూ గుర్తించలేదట.

మరో అనుభవం యిది! భయమూ, ఆ భయంలోంచి తృప్తీ అనుభవించాను.

అయితే ఈ విషయం నా కెందుకు చెప్పాడని అడిగాను. నన్ను ఈ వూళ్లోనే వుండిపోయి, తుంటరివెధవలకి బుద్ధి చెప్పమన్నాడతను.

మరి నేనుచేసే పనులకి బుద్ధి చెప్పేదెవరు? - అని ఆలోచించాను.

అలాగే చేస్తానని అతని కోరికను మన్నించాను.

ఆ తర్వాత కొత్తగూడెం బయలుదేరాను.

మధ్యాహ్నం అవుతుండగా అక్కడికి చేరుకుని త్వర త్వరగా పన్లు ముగించుకున్నాను —

ముందుగా ఫ్యాన్సీ షాపులో ఒక ఏర్ బ్యాగు, నల్లటి కళ్ళజోడు రెడీమేడ్ షాపులో నల్లటి పొడుగుచేతుల బనియన్-చెప్పుల షాపులో కాన్వాస్ బూట్స్-ఆట వస్తువుల షాపులో ఒక బొమ్మపిస్తోలు మొదలైనవి ఖరీదు చేశాను.

ఆ తర్వాత భోజనంచేసి, మేకప్ వస్తువు లమ్మే షాపులో-గుబురు మీసాలు, గెడ్డం తీసుకున్నాను.

సాయంత్రానికల్లా తిరిగి ఖమ్మం చేరుకుని మాధవిని చూశాను. ఆమె వారంరోజులు నర్సింగ్ హోంలోనే వుండాలట. ఇది నా పనులకి ఎంతో అనువుగా తోచింది. మరికొన్ని పుస్తకాలా మెకందించి, రాత్రి హోటల్ కొచ్చాను. భోజనంచేసి నా పథకం మళ్లీ ఆలోచించాను. ఎక్కడా పొరపాటు లేదు!

తృప్తిగావుంది. ఏర్ బ్యాగులో ఖరీదుచేసిన వస్తువులే గాక, టార్చిలైట్, ముఖం చూసుకునే అద్దంకూడ వేసుకున్నాను. గంటసేపు అసహనంగా కాచుకుని, సరిగ్గా 11 గంటలకి బయలుదేరాను.

బ్యాగు పట్టుకుని రోడ్డుమీద చకచక నడిచాను. మైన్ రోడ్డుమీద వూరు చివరికి చేరుకోవాలి. పావుగంట నడిచి పూర్తిగా వూరు దాటేశాను. ఆ తర్వాత ఒక చెట్టు క్రింద నిలబడి చూశాను. ఎక్కడా ఎవ్వరూ లేరు. నిర్మానుష్యంగా వుంది. చంద్రుడు లేడు. చీకటిగావుంది ఈ చీకటి నాకు బాగా ఉపయోగపడుతుంది.

గబగబ షర్టువిప్పేసి బ్యాగులోంచి నల్లబనియన్ తీసి తొడుక్కున్నాను. ఆ తర్వాత బూట్స్ తొడుక్కుని, టార్చిలైటు-అద్దం సహాయంతో మీసాలూ, గెడ్డం అతికించుకున్నాను, కళ్ళజోడు పెట్టుకుని అద్దంలో ప్రతిరూపం చూసుకున్నాను—తృప్తి కలిగింది. నన్నెవరూ గుర్తించలేరు.

ఆ తర్వాత లేచి నిలబడి కుడివేపు చూశాను.

ట్యూబ్ లైట్స్ వెలుగులో స్పష్టంగా కన్పిస్తోంది—పెట్రోలు బంకు.

నవ్వుకుని బ్యాగులోంచి బొమ్మపిస్తోలు తీశాను.

చకచక నడిచి పెట్రోలు బంకు చేరుకున్నాను. ఏవేనా వాహనాలు వచ్చేలోపున పని ముగించుకోవాలి!

కేబిన్ లో, అద్దాల తలుపులోంచి, కునికిపాట్లు పడుతూ కన్పించాడు అటెండర్.

నేను తలుపుమీద చప్పుడు చేశాను. అతను తేరుకోలేదు. నెమ్మదిగా తలుపు నెట్టాను. కొద్దిగా తెరుచుకుంది.

పూర్తిగా పెట్టె లోనికి ప్రవేశించాను. అతనింకా తేరుకో లేదు.

పిస్టల్ గురిపెట్టి, "హాండ్సప్!" అరిచాను, కర్కశంగా.

అతను అదిరిపడి లేచాడు. నన్ను చూసి అరవ బోయాడు.

"అరవకు! నా చేతిలో పిస్టల్ వుంది - నీ పెట్టెలో డబ్బు వుంది-తీయ్!" అన్నాను.

అతని పెదవులు వణికాయి, "నువ్వు... నువ్వు... ఎవరు?"

"నక్సలైట్ ని. డబ్బు తీయ్!"

ఆలస్యమవుతున్న కొద్దీ నాకు ఆత్రుత యెక్కువవు తోంది.

"నన్ను చంపకు!" అరిచాడతను.

"డబ్బు తీయ్!" మళ్ళీ అరుస్తూ, అతని దగ్గరికి జరిగి. నా పిస్టల్ మీద అతని కనులు పడ్డాయ్.

"డబ్బు...డబ్బు లేదు!"

"పిచ్చిగా మాట్లాడకు! ప్రాణాలు పోతాయి!"

"నిజంగా డబ్బు లేదు—ప్రొప్రయిటర్ తీసికెళ్ళాడు" వణుకుతూ ఇనప్పెట్టె తెరిచి చూపించాడు. ఖాళీగా వుంది. నేను చెయ్యి పెట్టి కలికాను. మరో చేతిలో పిస్టల్ అత నికి గురిపెట్టాను.

అంతే!

క్షణంలో వెయ్యోవంతు కాలం కేబిన్ లో కనులు చెదిరే వెలుగు ఆక్రమించుకుంది!

నేను అదిరిపడి విసురుగా చేత్తో అతని ముఖంమీద కొట్టాను. అతనుతూలి కుర్చీలో పడ్డాడు. ‹ ్యస్యం

చెయ్యకుండా వెనక్కి తిరిగి బయటకు వురికాను. శక్తి కొద్దీ పరిగెత్తాను. పరిగెడుతూ మీసాలు, గడ్డమూ తీసి పారేశాను.

బ్యాగులోంచి షర్టుతీసుకుని, బ్యాగును దూరంగా విసిరాను. అలా వురుకుతూనే బనియన్ కూడా తీసిపారేసి షర్టు తొడుక్కున్నాను.

పదినిముషాలలో హోటల్‌కి తిరిగివచ్చి బెడ్ మీద కూలబడ్డాను.

శరీరం నిలువునా కంపించిపోతోంది. ఏం జరిగిందో అర్థంగావడంలేదు!

ఏమిటది?

కళ్లు చెదిరే మెరుపేమిటి? ఆకాశంలో మెరుపా? లేక ఎలక్ట్రిక్ తీగల లూజ్ కాంటాక్టా?

తల దిమ్మెక్కుతోంది!

నేనెందుకు పారిపోయి వచ్చాను? పటిష్టమైనపథకం వేసుకొని చివరి క్షణంలో పిరికివాడిలా యెందుకు ప్రవర్తించాను?

జానీ అవహేళన మరలా నా చెవుల్లో మార్మోగింది.

అబ్బా! వాడి హేళన సహిస్తూ నేనింకా యెందుకు బ్రతికి వున్నాను!?

అడుగడుగున నాపిరికితనం నిరూపించుకుంటూ ఎందుకు బ్రతుకుతున్నాను? ఇంతకంటే చావు మేలు!

ఆత్మాభిమానం వుంటే చచ్చిపో!

హఠాత్తుగా ఆత్మహత్య చేసుకోవాలన్న కోరిక కలిగింది.

అవును. నేనీ లోకంలో ఒంటరిగా బ్రతకలేను! నీరజ కావాలి! ఆమెను చేరుకోవాలి! ఆమెతో గడపాలి! ఐతే ఆమెనెలా చేరుకోవాలి?

హోటల్ మీంచి దూకెయ్యనా? కింద ఎవరైనా వుంటే అకారణంగా చస్తాడు.
లారీకింద తలపెట్టనా? డ్రైవర్ చిక్కుల్లో యిరుక్కుంటాడు.
ఉరిపోసుకు చావనా? గదిలో తాడెక్కడా లేదు.
గొంతు కోసుకుని ప్రాణం విడువనా? కత్తిలేదు, బ్లేడ్లుకూడా అయిపోయాయి.
విషం తిని చావనా? నా దగ్గర తలనెప్పిమాత్రలు తప్ప ఏమీ లేవు.
అప్పుడొచ్చిందొక ఆలోచన —
రైలుకింద తలపెట్టాలి! అవును! ఇది సరయిన ఆలోచన!
హఠాత్తుగా టెలిఫోన్ మ్రోగింది.
ఆశ్చర్యపోయి తేరుకున్నాను — మళ్లా యేం కొంప మునిగింది?
రిసీవర్ ఎత్తాను.
"కమల్! మైబాయ్!" అది నా బాస్ గొంతు, "ఎలా వున్నావు? నిన్ను చూడకుండా నేనుండలేక పోతున్నాను!"
నేను కలవరపడ్డాను. "బాస్! మీరా! నేను బాగనే వున్నాను."
"అదే నేను కోరుకునేది! వెల్, బాయ్! నన్ను మర్చిపోలేదు కదా?"
"లేదు బాస్."
"గుడ్ — అయితే వెంటనే వచ్చేయ్!"
"బాస్?"
అవతల పెద్దగా నవ్వు, "యూ లిటిల్ బాస్టర్డ్! వెంటనే బయలుదేరి వచ్చేయ్. ఉదయం నేను ఢిల్లీ వెళు

తున్నాను—రెండురోజుల వరకూ రాను. నువ్వు ఆఫీసు మేనేజ్ చెయ్యాలి! మోస్ట్ ఇంపార్టెంట్ మైబాయ్!"

ఏం చెప్పాలో తోచలేదు.

"మాట్లాడవేం? బాధపడుతున్నావా? నెవర్ మైండ్! నేను తిరిగివచ్చాక నువ్వు వెళ్ళిపోవచ్చు. ప్లీజ్ కం అండ్ హెల్ప్మీ!"

"అలాగే బాస్" అని పెట్టేశాను.

ఆ తర్వాత తలపట్టుకుని కూచున్నాను.

# 10

మర్నాడు మధ్యాహ్నం హైదరాబాదులో, నా బాస్ ఆఫీసులో వున్నాను.

నాకేమీ పాలుపోవడంలేదు. తను పిలిచినా నేను రాలేదని తెలిస్తే బాసు తలతిరిగి మూర్ఛపోతాడని వచ్చాను తప్ప, ఖమ్మం విడిచి రావడం నాకేమీ ఇష్టం లేదు.

వచ్చేముందు మాధవిని కలిశాను. ఆమెచాలా బెంగ పడింది. రెండు రోజుల్లో తప్పకుండా వచ్చెయ్యాలని పదే పదే చెప్పింది. వస్తానని ప్రమాణం చేశాను. ఆ తర్వాత అయిష్టంగా ప్రయాణమయ్యాను.

ఇప్పుడు—నా ఎదురుగా టేబిల్ పైన పడున్న ఫైళ్లూ లెడ్జర్లు, కాయితాలూ...నన్ను పిచ్చివాడ్ని చేస్తూ వున్నాయి. అంతకుముందు వచ్చిన బిజినెస్ మనుషుల్తో దురుసుగా మాట్లాడాను. వాళ్ళు కసురుకుని వెళ్ళి పోయారు—నేనేదీ పట్టించుకోకుండా తటస్థంగా కూచు న్నాను.

నా బాసు రెండురోజుల తర్వాత వస్తానని చెప్పాడు. అప్పటివరకు ఈ ఆఫీసు నాకు జైలుగది. హాఠాత్తుగా

నాకు ఖమ్మం వాతావరణం జ్ఞాపకం వచ్చింది. అక్కడ నేనెంతగా మారిపోయాను!

ఎలాగయితే నేం_అయిదుగంటల వరకు అసహనంగా గడిపి, ఆఫీసుమూసి బయటపడ్డాను.

ఇంటికెడుతున్నప్పుడు నాకు నీరజ జ్ఞాపకమొచ్చింది.

పూర్ లవర్! ఆమె కన్న కలలన్నీ నా కనులముందే నిర్దాక్షిణ్యంగా తుడిచిపెట్టుకుపోయాయి.

ఇంట్లో కారాపి దిగాను.

జేబులోంచి తాళంచెవులు తీసి మెట్లెక్కాను. నా కాశ్చర్యం వేసింది. తలుపుకి తాళంలేదు___గడియకూడా పెట్టలేదు.

పట్టపగలే దొంగతనమా!

గాభరా పడ్డాను. ఆతృతగా తలుపు నెట్టాను.

అప్పుడెదురుగా చూసిన దృశ్యం నాలో ఎంత కలవరపాటునీ, భయాన్నీ కలిగించాయో నేను చెప్పడంకంటే స్వయంగా మీరనుభవించడం మంచిది.

మీరు ఇంటికెళ్ళి తలుపుతెరిచి లోపల చిరుతపులిని చూస్తే ఎలా ఫీలవుతారు? ఏం చేస్తారు? నాకు తెలియదు.

కానీ___చిరుత పులికంటే అతి ప్రమాదకరమయిన శంకర్‌ని నా ఎదురుగా చూసి ప్రాణాలెగిరి పోయాయి.

“నాపేరు శంకర్. నీపేరు కమలాకర్ కదూ_కమల్ అని పిలిపించుకోడం నీకిష్టం_అవునా?”

నా వొంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకాయి...

కర్కశమైన కంఠం!

“కమాన్ మిస్టర్! ఇలా వచ్చి కూచో. మనం మిత్రులం అవునా?”

నాకు తెలియకుండానే నేను లోనికి నడిచి అతని కెదురుగా కూచున్నాను.

"నీకోసం ఆఫీసుకి రావాలనుకున్నాను—కానీ, ఇది టాప్ సీక్రెట్! యింట్లోనే మాట్లాడాలనుకుని యిలా వచ్చాను..."

అప్పుడు చూశాను అతన్ని తీక్షణంగా.

మాధవి ఆఫీసులో చూసిన ఫోటోకీ, ఇప్పుడు నా ఎదురుగా కూచున్న శంకర్‌కీ కొంత తేడావున్నా—అది పెరుగుతున్న కాలం, తరుగుతున్న ఆయువు ప్రభావం.

కాకీదుస్తుల్లో, కాళ్ళకి బూట్స్‌తో, ఠీవిగా కూచోని వున్నాడు. ఎడమ చేతిలో కొన్ని బటానీలు వేసుకుని ఒకొక్కగింజ తింటున్నాడు.

తేరుకుని పరిస్థితి గ్రహించాను.

నాకంతా అయోమయంగా వుంది!

ఇలాటి అనుభవాలు అందరి జీవితాల్లోనూ వుంటాయా?

విచిత్రం! నేను మనసులోనే వూహించుకుంటున్న శంకర్ నా కళ్ళముందు సాక్షాత్కరించడమేమిటి?

మా ఇద్దరి మధ్యా పూర్వపరిచయంలేదు మరి 'మిత్రులం' అంటాడేమిటి? నేనతనికి ఎలా తెలుసు?

శంకర్ నన్ను కలుసుకోడంలో వున్న మర్మం ఏమిటి?

"కమల్, నువ్వు చాలా ధైర్యవంతుడివి!" అన్నాడతను.

మరోసారి తేరుకున్నాను, "అవును...అవును..." అని గొణిగాను.

"అంతే కాదు, తెలివిగలవాడివి!"

"అలాగా?"

"అవును. అందుకే నువ్వు నాకవసరం. కమల్! నీ ధైర్యసాహసాలకి ప్రత్యక్ష్య నిదర్శనం నా జేబులో వుంది..."

తికమకపడ్డాను, "ఏమిటది?"

అతను జేబులోంచి చిన్నపొట్లం తీశాడు. దాన్ని విప్పి టీపాయ్‌పైన వుంచాడు.

నా గుండె ఝల్లుమంది! వెన్నులోంచి చలి పుట్టుకొచ్చింది!

టీపాయ్‌మీద గారపట్టిన రెండు జానీపళ్ళు!

"ఇవి-ఇవి నీకెక్కడివి!" అరిచాను.

"'విశ్వశక్తి' ఆఫీసుముందు దొరికాయి" తాపీగా అన్నాడతను.

నా గుండెలో న్యూట్రాన్ బాంబు పేలింది.

"నువ్వు ఖమ్మంకెలా వచ్చావు? — జైల్లో వున్నావు కదా?"

"జైల్లోనా! ఏమిటి కమల్! జీవితాంతం నన్ను జైల్లోనే వుండిపొమ్మంటావా?"

"అంటే? తప్పించుకుని వచ్చావా?"

"ఛ! అలాంటి పని చెయ్యను. చట్టాన్ని గౌరవిస్తాను. మూడు నెలల క్రితం విడుదలై వచ్చేశాను."

"అయితే ఖమ్మం ఎందుకు వెళ్ళావ్? ఇప్పుడిక్కడి కెందుకొచ్చావ్!"

శంకర్ నిట్టూర్చాడు, "అదో పెద్దకథ! నేననుకున్న కార్యం సాధించడానికి యింత పెద్ద ప్లాను కావలసి వచ్చింది."

నా రక్తం వురకలువేసింది, "శంకర్! ఏమిటి నీ వాగుడు?"

నాకేసి సూటిగా చూశాడతను, "గాభరాపడకు! శ్రద్ధగా విను. నా ప్లాను విని, న్యాయమైన నిర్ణయం తీసుకుని విజ్ఞతగలవాడివి అనిపించుకో! నువ్వు తీసుకోబోయే

నిర్ణయం మీద నీ భవిష్యత్ ఆధారపడి వుంది_నీ లైఫ్ని ఆటో యిటో తేల్చిపారేసే నిర్ణయం_నువ్వు తప్పకుండా నేనాశించే నిర్ణయమే తీసుకుంటావని నా నమ్మకం.''

నా ముఖం చెమటపట్టింది.

శంకర్ మళ్ళీ అన్నాడు, ''నా పథకం పారాలంటే నిన్ను ట్రాప్‌లో యిరికించి నా చెప్పుచేతల్లో వుంచుకోవాలి. కాబట్టి ఏ కాల్‌గర్ల్‌నైనా నీకు పరిచయం చేసి నా వలలో బిగించాలనుకున్నాను. కానీ, పరిస్థితి అందుకు అనుకూలంగా లేదు. డార్లింగ్‌ని పోగొట్టుకుని నువ్వు దుఃఖిస్తున్నావు. నువ్వు కాల్‌గర్ల్ వల్లోపడ్డం అసాధ్యం కాకపోయినా చాలాకాలం పట్టవచ్చు. అంతకాలం ఆగే పథకం నాదికాదు__నా బి. పి. రోజురోజుకీ పెరిగిపోతోంది.

''ఈ పథకం పదిహేను రోజుల క్రితమే నాకు తట్టింది. ఇది పారాలంటే నీ సహాయం కావాలి. నిన్నేదేనా ట్రాప్‌లో యిరికిస్తే సహాయం చేస్తావని తెలిసినా, ఎందులో యిరికించాలో తోచలేదు. ఆలోచనలతో తల బద్దలు చేసుకుంటుండగా, డాక్టర్ సలహామీద నువ్వు ఖమ్మం వెళుతున్నట్టు తెలిసింది. నేను వెంటనే నీ వెనుక మారువేషంలో బయలుదేరాను_గుడ్డిగా, ఒక నిర్దుష్టమైన లక్ష్యం లేకుండా.''

కాస్సేపాగి మళ్ళీ అన్నాడు శంకర్ :

''ఖమ్మంలోవున్న నాలుగురోజులు నీమీద జాగ్రత్తగా కన్నువేసి వుంచాను. మొదటి రెండురోజులు నువ్వు చాలా బుద్ధిమంతుడిలా, అమాయకుడిలా కన్పించావు. కానీ అకస్మాత్తుగా మొనగాడివై పోయావు!

''ఆ రోజు జానీతో సహా వాడి ముఠాని కూడా కలిపి యెలా కొట్టావో తలచుకుంటే నాకే భయం వేసింది!

అప్పుడు నేను ఆఫీసుముందు నిలబడివున్నాను. ఈ రెండు పళ్ళు నువ్వు విసిరేసినప్పుడు నా నెత్తిమీద పడ్డాయి.

"అంతవరకు బాగానే వుంది - కానీ-ఆ రాత్రి ఏమయిందో గానీ, అకారణంగా కానిస్టేబిల్ని కొట్టి పారిపోయావు. నాకింకా భయం వేసింది! బహుశ పిచ్చిపట్టిందనుకున్నాను.

"మర్నాడు రాత్రి కూడా మరో యిద్దర్ని కొట్టి, సోడా బుడ్లు పగలగొట్టావు. నీ ప్రవర్తన నాకేమీ అర్థంగాక తల బద్దలు చేసుకున్నాను. చివరికి నీ ప్రవర్తనకి కారణం నీ డార్లింగ్ చావు అని తేల్చుకున్నాను. ఆమె వియోగంలో నీకు లోకంమీద విరక్తి పుట్టిందనుకున్నాను. ఇక ఈ అవకాశాల్ని ఉపయోగించుకుంటే నా పథకం పారుతుందని గ్రహించాను."

మాటలాపేసి సూటిగా చూసి, మళ్ళీ అన్నాడు శంకర్:

"ఆ రోజు నువ్వు కొత్తగూడెం వెళ్ళి మారువేషం సామాగ్రి తెచ్చుకున్నప్పుడు నిన్ను ట్రాప్లో యెలా ఇరికించాలో తట్టింది."

"ఏం చేశావు?" ఆత్రుత అణుచుకోలేక అనేశాను.

"బొమ్మపిస్తోలు చేతబట్టి పెట్రోలుబంకులో ప్రవేశించి బెదిరించావు గుర్తుందా? నిన్నరాత్రి!" ఫకాలున నవ్వాడతను. "నీ వెంట నేను కెమెరా చేతబట్టి వచ్చాను. నువ్వతనికి పిస్తోలు గురిపెట్టి గల్లాపెట్టె కెలుకుతున్నప్పుడు కెమెరా క్లిక్మనిపించి చక్కటి ఫోటో తీశాను."

నేను సలసల మరుగుతున్న నూనెలో ఎత్తేసినట్టు కవ్వుమని అర్చాను.

"రిలాక్స్" అన్నాడు శంకర్.

నా కళ్ళముందు చీకటి తప్ప ఏమీ కన్పించడంలేదు.

రెండుచేతుల్లో తల పట్టుకుని గట్టిగా కళ్ళు మూసు కున్నాను.

అయితే ... ఆ కళ్ళు చెదిరే మెరుపు శంకర్ కమేరాదా!

నేను తేరుకుని తటాలున అతని మీదికి దూకాను.

"రాస్కెల్! నీకేం కావాలి? బ్లాక్ మెయిల్ చేస్తు న్నావా! నన్ను నాశనం చేస్తావా? నేనీ వెధవపన్లు చేసింది ఎవరివల్ల? జానీముఠాని కొట్టానంటే ఆ శక్తి ఎవరిది? కానిస్టేబిల్ నీ, ఆ మనుషుల్ని కొట్టానంటే కారణం ఎవరు? పెట్రోలుబంకులో బెదిరించడానికి ప్రేరేపించిందెవరు? మాట్లాడు బాస్టర్డ్!"

"ఏమిటి కమల్! నిన్నెవరు ప్రేరేపించారు?"

"నువ్వు! నీ వెధవ ఫోటో! నీ దిక్కుమాలిన చరిత్ర! నీ గురించి చదివివుండకపోతే జానీచేతిలో చచ్చేవాడ్ని! నీ ధైర్యసాహసాలు తలచుకుని వాడ్ని కొట్టకపోతే నాకు చావు మూడేది!"

"నా గురించి చదివి నువ్విలా చేశావంటే నాకాశ్చ ర్యంగా వుంది!" అన్నాడతను నన్ను వెనక్కి తోసి—ఎర్ర బడ్డ ముఖంతో.

నేను ఆయాసంతో వగరుస్తూ కుర్చీలో కూలబడ్డాను.

ఓహ్, ఏమిటిది! నేను మనసులో గురువుగా ఆరా ధించేది వీడ్నా! జానీనుంచి నన్ను రక్షించినందుకు అభి నందనలతో ముంచెత్తాలనుకున్నది వీడ్నా! వీడి మాయలోపడి నేను చేసిన వెధవపనులకి వీడే బుద్ధి చెప్తు న్నాడా! వీడు—వీడెవడు గుంటనక్క.

"కమల్, నా మాట వింటే నీకేమీ ప్రమాదం వుండదు!" అన్నాడతను జేబులోంచి ఓ కవరు తీసి.

ఆ కవరులోంచి ఒక ఫోటోతీసి నాకిచ్చాడు "బాగుంది

కదూ?''

ఫోటో తీసి చూశాను. ఎంత చక్కగా తీశాడు! నా ముఖంలో క్రూరత్వం, ఆ టెండర్ ముఖంలో ఆందోళన ఎంత స్పష్టంగా కన్పిస్తున్నాయి!

ఫోటో కిందపెట్టి శంకర్ని చూశాను: ''ఎంత కావాలి?''

''నీ అంచనా తప్పు!'' అన్నాడతను, తిరిగి బటానీలు తింటూ.

''అంటే?''

''ఆఫ్టారాల్ ఓ సెక్రటరీ దగ్గర నేనెంత డబ్బు గుంజ తాననుకున్నావు? వందలు-అతికష్టంమీద వేలు. నిన్ను డబ్బుకోసం బ్లాక్ మెయిల్ చెయ్యడం తెలివితేనితనం! పాపం కూడా!'' అన్నాడు శంకరం వింతగా నవ్వుతూ.

ఇంతకూ శంకరం ప్లాన్ ఏమిటి? కమలాకర్ను దేనికి బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు?...

కమలాకర్ తను పిరికివాడు కాడని నిరూపించుకుంటాడా? లేక కొత్త చిక్కులు కొని తెచ్చుకుంటాడా?...

జానీగ్యాంగ్ ఏమైనట్లు? కమలాకర్పై పగ తీర్చుకుంటాడా? వదులుతాడా?

మాధవి విషయం ఏమిటి?...

వీటన్నిటికి సమాధానాలు ''మాయమైన వంటగత్తె'' (పరువు ఖరీదు-రెండవ భాగం)లో చదవండి...వచ్చే సంచికలో...

# ముష్టిదాని పాట!

టెంపోరావ్

రాగిణి తన స్నేహితురాళ్ళతో బస్టేండులో నిలబడింది.

ఉమ చలాకీగా కబుర్లు చెపుతోంది. కమల, రాగిణి వింటున్నారు.

అనేక మందితో బస్టేండ్ కిటకిట్లాడుతోంది. ఒక బస్సొచ్చి ఆగింది.

"యూ ఆర్ లక్కీ, మీ బస్!" అంది రాగిణి.

ఉమ, కమల బైబై చెప్పి బస్సులో ఎక్కారు. పేవ్‌మెంటుమీద నిలబడి వెళ్లిపోతున్న బస్ వైపు రాగిణి నవ్వుతూ చూసింది.

మరో రెండు బస్సులొచ్చి, ఆగి వెళ్ళిపోయాయి. తర్వాతఒకబస్సూ రాలేదు. నిమిషాలు దొర్లిపోతున్నాయి. అరగంట దాటింది.

రాగిణి టైమ్ చూసింది. ఐదున్నర అయింది. ఆరు గంటలకు చీకటిపడుతుంది. తను పదికిలోమీటర్ల దూరం వెళ్ళాలి. నడిచివెళ్ళడం సాధ్యంకాదు.

ఏ ఆటోలోనో పోవడం మంచిదేమో! రోడ్డమ్మట దూసుకుపోతున్న రెండు ఆటోలను ఆమె ఆపింది. మీటర్ చార్జికి డ్రయివర్లు రానన్నారు. పదిరూపాయలు యివ్వమన్నారు.

మరెవరో ఆ ఆటోలో ఎక్కేశారు. ఆమె వెనక్కి నడిచి మళ్ళా పేవ్‌మెంట్‌మీద నిలబడింది. ఇంటికి ఎలా చేరుకోవాలా అని ఆమె తీవ్రంగా ఆలోచిస్తోంది.

"బస్ స్ట్రయికట! ఇలా తటాలున స్ట్రయిక్ చేస్తే ప్రయాణికులు ఎంత కష్టపడ్తారో వాళ్ళు వూహించడం లేదు," అన్నాడొక మనిషి పక్కమనిషితో.

రాగిణి ఆ మాటలు విని ఉలిక్కిపడింది! ఇంతకుముందొకసారి బస్ స్ట్రయికయితే ఆమె ముప్పాతిప్పలూ పడి రాత్రి తొమ్మిదింటికి యింటికి చేరుకోగల్గింది.

చీకటిపడింది. రోడ్డుదీపాలు వెలుగుతున్నాయి. టైమ్ ఆరుదాటింది. ఆమె రోడ్డమ్మట మెల్లిగా నడుస్తోంది.

ఆమె మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. ప్రజాస్వామ్యంలో అందరికీ స్ట్రయిక్ చేసే హక్కు వుండొచ్చు! బస్ పాసులతో తనలా కాలేజీలకు వెళ్ళే విద్యార్థినులు ఎంత కష్టపడ్తారో స్ట్రయిక్ చేసేవాళ్లు ఊహించరు! ఎవరు ఏమైతే వాళ్ళకేం!

మరో ఆటోరిక్షాను ఆమె ఆపింది. ఆమె బేరంచేసే లోపలో ఒకవ్యక్తి దానిలోకి ఎగిరి కూర్చున్నాడు. నిస్సహాయంగా ఆమె నడక సాగించింది.

తన యింట్లోనివాళ్ళు ఆమెనుగురించి గాభరా పడ్తూ వుంటారు. నాన్న యీపాటికి ఆఫీసునుంచి వచ్చేసి వుంటాడు. తన మిత్రులకు దొరికినట్లు తనకో బస్ దొరికి వుంటే ఎంత బాగుండేది!

ఒక సిగరెట్ షాపుముందు ఆగిందామె. సోడాతాగి డబ్బు చెల్లించింది. తన పర్సులో మరో యాభైపైస లున్నాయి. ఆటోకోసం ఆమె చూస్తూ అడుగులేస్తోంది.

నల్లటి ఫియట్ కారొచ్చి ఆమెపక్కనే ఆగింది.

"అమ్మాయి!" అన్నాడొక వ్యక్తి.

ఆమె కిటికీలోంచి లోపలకు చూసింది. రోడ్డులైటు కాంతిలో అతను స్పష్టంగా అగుపిస్తున్నాడు.

అతడి వయసు యాభైపైన వుంటుంది. వెంట్రుకలు తెల్లబడినాయి. పాంటు, స్లాక్‌లో వున్నాడు. మొహం చూస్తే పెద్దమనిషిలా కనిపించాడు.

"బస్ స్ట్రయికని విన్నాను. ఎక్కడికెళ్ళాలమ్మా?" ప్రశ్నించాడతను.

"మైలాపూర్ వెళ్ళాలండి" అందామె.

"యూ ఆర్ లక్కీ! నేను అడ్యార్ వెళ్తున్నాను. నిన్ను మైలాపూర్‌లో దింపేస్తాను" అన్నాడతను.

"చాలా థాంక్సండి" అని ఆమె వెనుకతలుపు తెరిచి సీటుమీద కూర్చుంది.

ఇద్దరు మొగాళ్ళు కారువైపు పరుగెత్తుకొచ్చారు. "సార్. బస్సులు లేవు. మమ్మల్ని మౌంట్‌రోడ్డులో దింపేస్తారా?" అడిగాడు ఒకతను.

"ఎక్కండి" అన్నాడతను.

ఒకతను ముందుసీటుమీద కూర్చున్నాడు. రెండో వాడు రాగిణి పక్కనే కూర్చుని తలుపు మూశాడు. కారు కదిలింది.

తనపక్క కూర్చున్నతని వైపు రాగిణి ఓరగా చూసింది. అతను పాంటు, స్లాక్‌లో వున్నాడు. పెద్ద మీసాలు. ఏదో నవ్వుతున్నాడు.

కారు స్పీడుగా వెళ్తోంది. కారు మైలాపూర్ వైపు వెళ్ళడంలేదని ఆమె గమనించింది.

"ఏమిటిసార్ యిలా వెళ్తున్నారు?" అడిగిందామె.

"కల్లీస్‌లో చిన్నపనుంది. రెండు నిముషాల్లో అయిపోతుంది. తర్వాత మైలాపూర్‌లో నిన్ను దింపుతాను" అన్నాడు కారు నడుపుతున్నతను.

అతని కంఠం తీయగా వుంది. అతడి మాటలు వింటూంటే అనుమానానికి ఆస్కారం లేదనిపించింది. రోడ్డుకటువైపునున్న షాపులను చూస్తూ ఆమె కూర్చుంది.

పక్క కూర్చున్నతను ఠటాలున ఆమెను పట్టుకుని సీటుమీద నొక్కి పడుకోబెట్టాడు. అరవకుండా ఆమె నోరు నొక్కేశాడు. కారు చాలా స్పీడుగా వెళ్తోందని ఆమె గ్రహించింది.

రాగిణి గింజుకుంది. అతడితో పోట్లాడింది. కాని ఆమె బలం చాలలేదు. నల్లటి గుడ్డను ఆమె కళ్ళకు కట్టేశాడతను.

"అరిస్తే లాభంలేదు! మేం చెప్పినట్లు చేస్తే నీకే ప్రమాదమూ రాదు" అన్నాడతను.

ఆతను కట్టిన నల్లగుడ్డ మూలంగా ఆమెకళ్ళు కనపడ్డం లేదు. నోరును కప్పిన చెయ్యిని అతడు తీసేశాడు.

వెల్లకిలా ఆమె సీటుమీద పడుకునివుంది.

"మీకేం కావాలి?" అందామె.

"తొందరపడకు! తర్వాత తెలుస్తుంది" అన్నాడతను.

ఆమె జవాబివ్వలేదు. కారు వేగంగా వెళ్తోంది. వాళ్లు తన్నిలా బాధిస్తూంటే కారు నడిపేవ్యక్తి యెందుకు వూరుకున్నాడు? ముందు కూర్చున్నతను నడిపేవ్యక్తిని భయపెడ్తున్నాడా?

"సార్, మిమ్మల్ని నమ్మి కారులో ఎక్కాను. వీళ్లెవరో నా కళ్ళుకట్టి నన్ను బాధిస్తున్నారు. కాపాడండి! కారును ఆపండి!" అర్చిందామె.

"అమ్మాయి భయపడకు! వాళ్ళు నా మనుషులే!" అన్నాడతను తీయటి కంఠంతో.

ఆమె ఉలిక్కిపడింది. అందరూ మోసగాళ్ళే! ఆమె ఏడుస్తూ అలాగే వుండిపోయింది. ఏమాత్రం లేవడానికి ప్రయత్నించినా అతడు చేత్తో బలంగా నొక్కుతున్నాడు.

రాగిణి కాలేజిలో బి.ఏ. చదువుతోంది, మొదటి సంవత్సరం. తండ్రి ఒక ఇంజనీరింగ్ కంపెనీలో అసిస్టెంట్ మేనేజర్‌గా పని చేస్తున్నాడు. రాగిణి తర్వాత ఒక తమ్ముడున్నాడు. తండ్రీ, తల్లీ, తమ్ముడూ ఆమెకు జపిస్తున్నారు.

వాళ్ళ చేతుల్లోంచి ఎలాగేనా బయటపడి తను ఇంటికి చేరుకోవాలి. వాళ్ళకు తన నగలు కావాలేమో! "నా మెళ్లోవున్న గొలుసూ, చెవులకున్న రింగులూ మీకిచ్చేస్తాను. నన్ను దింపేయండి" అందామె.

పక్కనున్న వ్యక్తి హేళనగా నవ్వాడు. ఆమె మెడను వేళ్లతో చుట్టిపట్టుకున్నాడు, గట్టిగా నొక్కేస్తాడేమో! పీకపిసికి చంపేస్తాడేమో!

ఆమె గుండె దడదడలాడింది. కారు స్పీడ్ తగ్గింది. ఏదో గేటు తెర్చిన చప్పుడు ఆమెకు వినపడింది. మళ్ళా కారు కదిలింది. ఓ నిమిషం తర్వాత కారు ఆగింది.

వాళ్ళ మాటలు ఆమెకు వినపడుతున్నాయి.

"ఆమెను గదిలోకి తీసుకెళ్ళండి." అంది తీయటి కంఠం.

ఆ తీయటి కంఠంలో యింత విషముందని ఆమె మొదట్లో గ్రహించలేకపోయింది. తను చూసిన క్రయిమ్ సినిమాలు ఆమెకు గుర్తొస్తున్నాయి. వాళ్ళు తనని ఏం చేస్తారు? తనని ఖైదీగావుంచి డబ్బు చెల్లించమని తన తండ్రికి వుత్తరం రాస్తారా?

ఎవరో ఆమెను ఎత్తుకు మోసుకుపోయారు. ఒకచోట క్రిందకు దించారు. ఆమె కళ్ళకు కట్టిన నల్ల గుడ్డను అతడు తీసేశాడు. కళ్ళు చిట్లించి ఆమె అతని వంక చూసింది. కారులో తన పక్క కూర్చున్నతను.

ఆమె నలువైపులా చూసింది. అందమైన గది.

ఒకవైపు మంచం, ఫోమ్ బెడ్ వున్నాయి. కొన్ని కుర్చీలు, ఒక టీపాయి గదిలో వున్నాయి. ఆమె అతడి వైపు కోపంగా చూసింది.

"నన్నిక్కడికి ఎందుకు తీసుకొచ్చారు?" అడిగిందామె.

"కాస్సేపట్లో బాస్ నీ దగ్గర కొస్తారు. ఆయన ఎందుకో చెప్తారు," అని అతడు గదిలోంచి బయటకు నడిచి, తలుపు మూశాడు.

ఆమె వేగంగా వెళ్ళి తలుపును లాగింది. తలుపు తెరవబడలేదు. అటువైపున అతడు తాళం వేసి వుండొచ్చు.

"అమ్మా!" అని అరుస్తూ రాగిణి పరుపుమీద వాలి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

టైమ్ చూసింది. ఎనిమిది కావస్తోంది. ఈపాటికి తన కోసం తల్లీ తండ్రీ పట్నమంతా వెతుకుతూ వుంటారు! "ఓ గాడ్, నన్ను రక్షించు!" ప్రార్థించిందామె.

## 2

నారాయణరావు తన భార్యవైపు విచారంగా చూశాడు.

"తొమ్మిది దాటిందే, ఇంత ఆలస్యం ఎలా అవుతుంది? స్కూటర్ మీద వెళ్ళి చూసొస్తాను," అన్నాడతను.

"ఎక్కడ చూస్తారు?" అడిగింది కోమల.

"దానితో చదివే ఉమ యింటికి వెళ్ళి కనుక్కుంటాను. ఇవాళ సాయంత్రం బస్సులు లేవు. అనేకమంది రోడ్లమీద నడుస్తున్నారు. అది నడిచి వస్తోందేమో!"

"నడిచినా యీపాటికి రావాలి."

అతడు కుర్చీలోంచి లేచాడు. ముందు హాల్లో కొడుకు నిద్రపోతున్నాడు. ఆమె అతడితో ముందు వరండా మీదకు వెళ్ళింది. అతడు స్కూటర్ని కిందకు దింపాడు. ఆమెవైపు చూశాడు.

"నువ్వు బెంగెట్టుకోకు! నేను కనుక్కొస్తాను. అది ఏ ఉమ యింట్లోనో వుండి పోయిందేమో! నేనొచ్చే లోపల నువ్వు కాస్త తిండి తిని కూర్చో!"

"ఏదో తెలిశాక తిందాం లెండి," అందామె.

స్కూటర్ని స్టార్ట్ చేసి అతడు పోనిచ్చాడు. చల్లటి గాలి వీస్తోంది. ఎక్కడికి వెళ్ళాలో తెలియక కాలేజి వైపు అతడు స్కూటర్ని పోనిస్తున్నాడు.

కాలేజిలో యిప్పుడెవరుంటారు? ఈ ప్రశ్న మెదడులో లేవగానే అతడు స్కూటర్ని ఉమ యింటి వైపు పోనిచ్చాడు.

షావుకారుపేటలో వున్న ఒక యింటి ముందు స్కూటర్ ఆపి అతడు దిగాడు. డిమ్‌గా వెలుగుతూన్న వీధి దీపాల కాంతిలో ఉమ యిల్లును అతడు పోల్చుకగలాడు. మెల్లిగా వెళ్ళి ముందు తలుపును తట్టాడు. తలుపు తెరవబడింది.

ఉమ తల్లివైపు అతడు సీరియస్‌గా చూశాడు.

''మా అమ్మాయి యిక్కడుందా?'' అడిగాడు చిత్రంగా.

''లేదండి. ఇక్కడకు రాలేదే!'' అందామె.

లోపల్నుంచి ఉమ గుమ్మందగ్గరకొచ్చి అతడివైపు నవ్వుతూ చూసింది.

''కమాన్ అంకుల్, కూర్చోండి'' అంది ఉమ.

అతడు గుమ్మం దాటలేదు. ఉమవైపు సూటిగా చూశాడు.

''రాగిణి యింతవరకూ యింటికి రాలేదు!'' అన్నాడతను.

''నేనూ, రాగిణీ, కమలా కలిసి బస్టేండ్ కొచ్చాం. మా బస్ ముందొచ్చింది. మేం ఎక్కేశాం. బస్ స్ట్రయికని విన్నాను. కొంతదూరం వెళ్ళాక మా బస్‌ను ఆపేశారు. నేనూ, కమలా, నడిచి యిళ్లకు వచ్చేశాం'' అందామె.

''ఉమా, అది ఏమైందంటావు?''

''బస్సులు లేక ఎక్కడో యిరుక్కుని వుంటుంది. మీతో నేనూ వస్తాను. దానికోసం వెతుకుదాం'' అంది ఉమ.

''ఇంత రాత్రివేళ ఎక్కడికెళ్తారమ్మా?'' తల్లి వారించింది.

''నీకు తెలియదమ్మా! రాగిణి నాప్రాణస్నేహితురాలు. దానికోసం నిద్రమాని వెతగ్గలను!'' అంది ఉమ వుద్రేకంగా.

''ఉమా, నువ్వు రావద్దులే! దాని బస్ కూడా ఎక్కడో ఆపేసివుంటారు. నేను వెళ్ళి చూస్తాను'' అని అతడు వెనక్కు తిరిగాడు.

ఉమ స్కూటర్ దాకా వచ్చింది.

"ఈ రాత్రి సాదు నిద్రపట్టదు. దాన్నిగురించే ఆలో చిస్తూవుంటాను. ఈ పాటికది యింటికి వచ్చేసి వుంటుందేమో!"

"అలా జరిగితే ఎంతేనా సంతోషిస్తాను," అని అతడు స్కూటర్ని పోనిచ్చాడు.

కాలేజి సమీపంలో వున్న బస్టాండుకు అతడు స్కూటర్ని పోనిచ్చాడు. బస్టాండ్ నిర్మానుష్యంగా వుంది. బస్సులు తిరగడంలేదు. అక్కడిదాకా ఉమ, కమల, రాగిణి కలిసివచ్చారు. అక్కడ ఏ బస్సో ఆమె ఎక్కివుంటుంది. తోవలో ఎక్కడో బస్ ఆగిపోయి వుండాలి.

మైలాపూర్ బస్ వెళ్ళేరూటమ్మట అతడు స్కూటర్ని పోనిచ్చాడు. తన కూతురికోసం వెయ్యి కళ్ళతో చూస్తు న్నాడు. ప్రభుత్వం ఏదో చేస్తేగాని యీ స్ట్రయికులు యిలా సాగుతూనే వుంటాయి. దూరంగా నివసించేవాళ్లు ముప్పతిప్పలూ పడవలసివస్తుంది.

దూరంలో నడుస్తున్న ఆకారాన్ని చూసి అతడు స్పీడ్ హెచ్చించాడు. దగ్గర కొచ్చాక ఆమె రాగిణి కాదని అతడు గుర్తించి స్కూటర్ని పోనిచ్చాడు.

అరగంటలో స్కూటర్ యింటి ముందు ఆగింది. అతడు దిగి టైమ్ చూశాడు. పది దాటింది. అతడి భార్య పరుగెత్తు కొచ్చింది.

"అమ్మాయి ఎక్కడేనా వుందా?" అడిగింది భార్య.

రాగిణి యింటికి యీపాటికి వచ్చుండవచ్చని అతడు ఆశపడ్డాడు. భార్య ప్రశ్న అతడి ఆశల్ని పాతమార్చింది. గోడమీద స్కూటర్ని వదిలి అతడు భార్యతో ముందు

హాల్లోకి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. ముఖాన్ని చేత్తో కప్పేసుకున్నాడు.

"ఏమైందండీ?" అడిగింది కోమల గద్గద కంఠంతో.

"మన అమ్మాయి ఉమ యింట్లో లేదు. రోడ్డు మీద కూడా నాకు కనపడలేదు? ఏమైందో ఊహాతీతంగా వుంది," అన్నాడతను.

ఆమె ఏడుస్తూ నేలమీద కూర్చుండి పోయింది. ముఖాన్ని కప్పిన చెయ్యితీసి భార్యావంక చూశాడతను. అతడి కళ్ళమ్మట నీళ్ళు జలజల కారుతున్నాయి.

కన్నీళ్ళు ఏ సమస్యనూ పరిష్కరించవని వాళ్ళకు తెలును. కాని మనిషిలోని బాధ, బలహీనత కన్నీళ్ళకు దారితీస్తాయి.

కొంచెం సేపయ్యాక అతడు కుర్చీలోంచి లేచాడు.

"పోలీస్ రిపోర్టు యివ్వడం మంచిది. నేను స్టేషన్‌కి వెళ్ళి రిపోర్టిచ్చి వస్తాను," అన్నాడతను.

"నా బిడ్డ యింటికొస్తుందంటారా?"

ఆమెకేసి అతడు సూటిగా చూశాడు.

"కోమలా, నీది చాలామంచి హృదయం. నువ్వెవరికీ ఎప్పుడూ హాని చేసి ఎరుగవు. అనేక మందికి సహృదయంతో సహాయపడ్తూ వుంటావు ధర్మం జయిస్తుందనేది నిజమైతే మన బిడ్డ మనకు దక్కుతుంది."

నారాయణరావు బయటకు పరుగెత్తాడు. వెనుకనుంచి భార్య ఏడుపు వినిపిస్తోంది. అతడు స్కూటర్ని పోలీస్ స్టేషన్ వైపు పోనిచ్చాడు.

సబిన్‌స్పెక్టర్ రామన్‌కి ఎదురుగా కూర్చున్నాడతను. రిపోర్టురాసి అతడికిచ్చాడు. సబిన్‌స్పెక్టర్ రిపోర్టును చదివి అతడి వైపు చూశాడు.

"మీ అమ్మాయి ఫోటో మాకివ్వాలి," అన్నాడు సబిన్స్పెక్టర్.

"తర్వాత తెచ్చి యిస్తాను,' అన్నాడతను.

సబిన్స్పెక్టర్ రామన్ సవ్యంగా అతడి వంక చూశాడు.

"మీ అమ్మాయికి ఎవరేనా బాయ్ ఫ్రెండ్స్ వున్నాడా?"

"రాగిణి అటువంటిది కాదు. కాలేజికెళ్ళి తిన్నగా యింటి కొచ్చేసేది," అన్నాడు నారాయణరావు.

"అటువంటి విషయాలు ఆమె మీకు తెలియకుండా జాగ్రత్త పడొచ్చు!"

"ఆ అవకాశం లేదండి. దానికి నేను కావలసినంత స్వేచ్ఛ యిచ్చాను. ఎవర్నైనా ప్రేమిస్తే నాతో చెప్పమన్నాను. తను యిష్టపడిన వ్యక్తి వద్దని నేనెన్నడూ అనని దానికి తెలుసు."

"అల్ రైట్, మేం దర్యాప్తు చేస్తాం. మీరు యింటికి వెళ్ళి విశ్రాంతి తీసుకోండి."

నారాయణరావు కుర్చీలోంచి లేచి క్షణకాలం సబిన్స్పెక్టర్ వైపు చూశాడు.

"నాకు యిద్దరే పిల్లలున్నారు. పూర్వకాలంలో పెద్ద కుటుంబాలు వుండేవి. ప్రభుత్వం ప్రచారంచేసే ఫామిలీ ప్లానింగ్ మంచిదని నమ్మి నేను ఆపరేషన్ చేయించుకున్నాను. నాకున్న యిద్దరు పిల్లల్నీ నేను పోగొట్టుకోలేను. దయచేసి గట్టిగా దర్యాప్తు చేయండి. రాగిణి వీలైనంత తొందరగా యింటికి చేరేటట్లు చూడండి,"అన్నాడతను బాధతో.

"అల్ రైట్!" అన్నాడు సబిన్స్పెక్టర్ రామన్.

# 3

ఆ వ్యక్తి చెప్పినట్లు వాళ్ళ బాస్ గదిలోకి వస్తాడను కుంది రాగిణి. సరిగ్గా తొమ్మిదింటికి తలుపు తెరుస్తూన్న చప్పుడైంది. బాస్ వస్తున్నాడేమో!

ట్రే పట్టుకుని ఒక స్త్రీ గదిలో కొచ్చింది. కుర్చీ ఎదురుగావున్న టీపాయిమీద ట్రేను వుంచి ఆమె రాగిణి వంక చూసింది.

"భోంచెయ్యి!" అందామె.

తనకి ఆకలి వుంటేగా తినడానికి? ఆ ఆడమనిషి గోడ మూలనున్న కూజాలోని నీళ్ళు గ్లాసులో పోసి టీపాయి కింద పెట్టి సమీపంలో నిలబడింది.

రాగిణి ఆమె వైపు తిరిగి క్షణకాలం చూస్తూ వుండి పోయింది.

"నేను తినే ముందు మీ బాస్‌తో మాట్లాలి,"

అందామె.

"అదంతా నాకు తెలియదు. నా పని మీకు తిండి పెట్టడం. ఆకలేస్తే తిను. వద్దంటే పట్టుకు పోతాను," అందామె కటువుగా.

"నువ్విక్కడ పని మనిషిగా వుంటున్నావా?"

ఆమె తలాడించింది.

"నువ్వు జీతంకోసం పనిచేస్తున్నావు. నాకు సహాయం చేస్తే బాగా డబ్బు నీకొచ్చేటట్లు నేను చూస్తాను," అంది రాగిణి.

"భోజనం చేస్తావా, పట్టుకు పోనా?" అందామె టేప్ రికార్డర్‌లా.

"నా మెళ్ళోని యీ గొలుసు నీకిచ్చేస్తాను. దాని ఖరీదు వెయ్యి రూపాయిలు పైన వుంటుంది," అంది రాగిణి.

ఆమె రాగిణికేసి నిరుత్సాహంగా చూసింది.

"ఎలాగ కేనిక్కడ ఖైదీని. ఏం సహాయం చేయ గలను?" అందామె.

"నువ్వు బయటకు వెళ్తూ వుంటావా?"

"ఎప్పుడూ వెళ్ళలేను. ఈ యింట్లోనే పడుంటాను."

"ఈ శానిస గొలుసుల్లోంచి మనిద్దరం బయటపడే మార్గం వుంది. నేను రాసిన వుత్తరం నా తండ్రికి అంద చేయాలి. నాన్న పోలీసులతో వచ్చి మన్ని విడుదల చేయి స్తాడు," అంది రాగిణి.

"ఇక్కడ నా జీవితం సుఖంగా గడిచి పోతోంది. బయట కెళ్ళాలనే వుద్దేశం నాకులేదు. మళ్ళా వస్తాను. భోంచేస్తే ట్రే పట్టుకుపోతాను." అని ఆమె బయటకు వెళ్ళిపోయింది.

రాగిణి ప్రయత్నం ఫలించలేదు. ఆ పనిమనిషి లొంగే ట్టులేదు.

ఆమె పరుపుమీదనుంచి లేచి కుర్చీలో కూర్చుంది. ట్రేలో ఒక స్టెయిన్‌లెస్ స్టీల్ ప్లేటుంది. ప్లేటులో నాలుగు చిన్నపూరీలు, అన్నం ఒకవైపున్నాయి. మరో వైపున చిన్న కప్పుల్లో రెండు కూరలు, సాంబార్, రసం, పచ్చడి, నెయ్యి వగైరా వున్నాయి. మామూలు పరి స్థితుల్లో ఆమె పుష్టుగా భోజనం చేసేది. కాని ఇవాళ ఆమెలోని ఆకలి పూర్తిగా హరించి పోయింది.

ట్రేలోని పదార్థాల వంక చూస్తూ ఆమె అలాగే కూర్చుండి పోయింది. ఆమె మెదడులో తనింటిని గురించి ఆలోచనలు సాగుతున్నాయి. అమ్మా, నాన్నా భోజనం చేశారో, లేదో. వాళ్ళిద్దరికీ తనంటే ఎంతో ప్రేమ!

ప్రతి రాత్రీ ముగ్గురూ కలిసి తింటూ వుంటారు. తమ్ముడు మాత్రం ముందుగా తినేసి తొందరగా పడుకుంటాడు.

వాళ్ళు తనని ఏం చేస్తారో తెలియదు. తను తిండి తిని బలంగా వుండాలి. ఎటువంటి పరిస్థితులనైనా ఎదుర్కోడానికి శక్తి కావాలి! నీరసంగా వుంటే తనేపనీ చేయలేదు.

రాగిణి మెల్లిగా తినడం మొదలెట్టింది. శక్తికోసం తింటోంది, కాని పదార్థాలు తనకు రుచికరంగా లేవు. ఎలాగో తిండి పూర్తి చేసి ఆమె రెండు గ్లాసుల నీళ్ళు తాగింది. పక్కనున్న యటాచ్డ్ బాత్‌రూమ్‌లోకి వెళ్ళి నోరు కడుక్కుంది.

గదిలోకొచ్చి మంచంమీద పడుకుంది. తీవ్రంగా ఆలోచిస్తోంది. పని మనిషి గదిలో కొచ్చి ప్లేటుని పట్టుకు పోతోంది.

"ఇలా చూడు, ఈ యిల్లు ఎక్కడుంది?" అడిగింది రాగిణి.

"నేనీ వూరుదాన్ని కాదు. పల్లెటూళ్లో పొట్ట నిండక యిక్కడికొచ్చాను. జాన్ నన్ను కారులో యిక్కడకు తీసుకొచ్చారు. ఈ యిల్లు ఎక్కడుందో నాకు తెలియదు" అందామె.

ఆమె వెళ్ళిపోయింది. తొమ్మిదిన్నర దాటాక తలుపు తెరుచుకుని ఒకతను గదిలోకొచ్చాడు. అతడిని చూసి ఆమె ఉలిక్కిపడింది.

పొట్టిగా లావుగా వున్నాడతను. గళ్ళలుంగీ, బనియన్‌లో వున్నాడు. ఒంటినిండా నల్లటిబొచ్చు. ఎలుగుబంటులా కనిపిస్తున్నాడు. నల్లటిశరీరం. కత్తుల లాంటి పళ్ళు! వెడల్పయిన పెదిమలు.

కుర్చీని మంచందగ్గరగా లాక్కొని కూర్చున్నాడు. ఆమెకేసి నవ్వుతూ చూశాడు. అతడినవ్వు పళ్ళు ఇకిలించినట్లుంది! అతడి కాళ్ళకు త్రాచుపాము చర్మంతో చేసిన స్లిపర్లు వున్నాయి.

"చిలకా, నీ పేరు?" అడిగాడతను.

"రాగిణి" అందామె.

అతడి ముఖంలోని నవ్వు హఠాత్తుగా మాయమైంది. అతడికళ్ళు ఆమెమీదే కేంద్రీకృతమైనాయి.

"మేం ఏంచేసినా నువ్వు సమ్మతిస్తే ప్రాణంతో మీ యింటికి వెళ్తావు. మమ్మల్ని అడ్డగిస్తే కష్టాల పాలవుతావు. నీ ప్రాణానికే ముప్పురావచ్చు," అన్నాడతను.

ఆమె శరీరం వణికింది. గుండె దడదడలాడింది. అతడు దేవాంతకుడిలా వున్నాడు. అతడివైపు చూస్తే ఏదైనా చెయ్యగలడనిపిస్తోంది!

ఆమె ధైర్యాన్ని తెచ్చుకుంది.

"నీకేం కావాలి?" అడిగిందామె.

అతడు విషపురుగులా నవ్వాడు.

"మేం తీసే ఒక ఫిలింలో నువ్వు నేనూ కలిసి నటించాలి. నువ్వొక ఫిలింస్టార్ అవుతావు!"

"నేను సినిమాల్లో నటించను. నాన్న నన్ను తిడ్తాడు."

"మేం తీసే సినిమా మీ నాన్న చూడడులే! ఆ చిత్రాన్ని యీ దేశంలో ఎవ్వరూ చూడరు. గల్ఫ్, ఆఫ్రికా దేశాల్లో అవి ప్రదర్శింపబడతాయి, రహస్యంగా. నీకు యీ చిత్రం మూలంగా ఏ ముప్పూ రాదు!"

అతడు కుర్చీలోంచి లేచాడు. ఆమె అతడివంక చూసింది. ఆమె కళ్ళలో నీళ్లు నిండాయి.

"నన్ను నీ చెల్లెలుగా భావించి వెళ్ళిపోనీ! అమ్మా, నాన్నా నాకోసం ఎంతో బాధపడ్తూవుంటారు" ఆమె ప్రతిమాలింది.

అతడు మళ్ళా పళ్ళు యికిలించాడు.

"ఈ లోకంలో కొందరు బాధపడ్తూనేవుంటారు. చివరికి జీవితంతో రాజీపడిపోతారు!" అన్నాడతను.

అతడు వెళ్ళిపోయాడు. తలుపు మూసుకునిపోయింది. ఆమె పరుపుమీద పడి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

# 4

విశాలమైన హాలు!

హాల్లో అరడజనుమంది వున్నారు. లైట్లు, మూవీ కెమెరా అన్నీ సిద్ధంగావున్నాయి. బాస్ నగ్నంగా హాలుమధ్యలో నిలబడివున్నాడు.

"రెడీ!" అన్నాడు బాస్.

"యస్సార్!" అన్నాడు కెమెరామన్.

గూండాలావున్న ఒక వ్యక్తివైపు చూశాడు బాస్.

"మస్తాన్, ఆమెను తీసుకురా!" అన్నాడు బాస్.

మస్తాన్ పెద్దఅంగల్లో వెళ్ళిపోయాడు.

బాస్ కింగ్ సైజు సిగరెట్ వెలిగించాడు.

పొగవదుల్తూ నలువైపులా చూశాడు.

రాగిణిని యీడ్చుకుంటూ మస్తాన్ తీసుకువచ్చాడు. ఆమె ఏడుస్తోంది, అరుస్తోంది. బాస్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు. అతడివైపు చూసి ఆమెకళ్ళు మూసుకుంది. నల్లత్రాచులా బాస్ శరీరం మెరుస్తోంది!

"స్టార్ట్!" అన్నాడు బాస్.

రాగిణి పిచ్చిదానిలా బాస్‌వైపు చూస్తోంది. ఆమె దుస్తులను లాగేశాడు. ఆమె వెనక్కితిరిగి పరుగెత్త

పోయింది. అతను ఆమెని బలంగా పట్టుకున్నాడు. ఆమె అతడి చెయ్యిని కొరికేంది.

అతడామెకేసి కోపంగా చూశాడు. ఆమె చంపమీద గట్టిగా కొట్టాడు. ఆమె నోట్లోంచి రక్తం కారింది. రెండు చేతులతోనూ బిగించిపట్టుకొని ఆమె ఎర్రటి పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"ఛీ, దుర్మార్గుడా!" అని ఆమె అతడి ముఖంమీద వుమ్మింది.

అతడు ముఖాన్ని తుడుచుకోలేదు. నగ్నంగావున్న వున్న ఆమెను చేతుల్తో ఎత్తి, గచ్చునేలమీద వెల్లకిలా పడుకోబెట్టాడు.

రాగిణి కాళ్లతో అతడిని తన్నింది. సాయశక్తులా అతడిని ఎదిరించింది.

అతడామెమీద చోటుచేసుకున్నాడు. రక్తం చిమ్మిన ఆమె పెదిమలను ముద్దాడాడు. అతడిని ఎదిరించే స్థితిలో లేదామె. అతడిని ఎదిరించడానికి తనబలం చాలదని ఆమె గ్రహించింది.

అడవిలో పెద్దపులి మీద పడ్తే చెయ్యగల్గిందేమిటి? పులికి బలవ్వాలసిందే!

ఎంత గింజుకున్నా అతడి పట్టులోంచి ఆమె బయట పడలేకపోయింది. ఆమె విషాదపు అరుపు హాలు నలు వైపులా ధ్వనించింది.

కొన్ని నిముషాల తర్వాత అతడు లేచాడు. నేలమీద పడున్న ఆమెవైపు చూశాడు.

"కట్!" అర్చాడతను.

ఆమె యింకా అలా నేలమీద పడుకు నేవుంది. అతడు మరో సిగరెట్ వెలిగించాడు. పొగవదుల్తూ తన సహ చరులవంక చూశాడు.

"ఈ రాత్రికిది చాలు! రేప్ యిన్ బేదింగ్ టబ్ రేపు చిత్రీకరిద్దాం" అన్నాడతను.

అతడు మస్తాన్‌కి సౌజ్ఞ చేశాడు.

"ఆమెను తీసుకెళ్ళి గదిలో పడుకోబెట్టు. డాక్టర్ని చూడమను" అన్నాడతను.

"యస్ బాస్" అన్నాడు మస్తాన్.

నేలమీద పడున్న ఆమె దుస్తులను మస్తాన్ తీసుకున్నాడు. ఆమెను ఎత్తి, భుజంమీద పడుకోబెట్టుకున్నాడు. ఆమెను హాల్లోనుంచి వడివడిగా తీసుకుపోయాడు.

సిగరెట్ పీలుస్తూ బాస్ కుర్చీలో కూర్చున్నాడు. ఇద్దరు మనుషులు అతడి కాళ్ళనూ, చేతులనూ మసాజ్ చేస్తున్నారు.

"ఈ రేప్ సీన్ బ్రహ్మాండంగా వచ్చింది బాస్" అన్నాడు కెమెరామన్.

"విదేశాల్లో యీ ఫిలింకి కొన్ని లక్షలిస్తారు. మనకి కావలసింది డబ్బు!" అన్నాడు బాస్.

బాస్ అమాంతంగా కుర్చీలోంచి లేచాడు. ఎవరో తెచ్చియిచ్చిన గళ్లలుంగీని తన నడుంకి చుట్టుకున్నాడు.

"అందరూ హాయిగా పడుకోండి! రేపు చాలా పనుంది" అని బాస్ వెళ్ళిపోయాడు.

# 5

రాగిణి నిర్జీవంగా పరుపుమీద కూర్చునివుంది. టైమ్ చూసింది. ఎనిమిది ఐదైంది. గదిలో లైటు ఎప్పుడూ వెలుగుతూ నేవుంది. ఇప్పుడు రాత్రో, పగలో!

తనిక్కడకొచ్చి చాలారోజులు అయినట్టుంది. ఈ నరకంలోంచి తనింక బయట పడలేదేమో!

తలుపు తెరుచుకుని బాస్ లోపలకొచ్చాడు. ఆమె ఎదురుగా నిలబడ్డాను. ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"నిన్ను యివాళ బయటకు పంపేస్తున్నాను" అన్నాడు.

"ఎక్కడికి?"

"మా యింటికి!"

"నేనెలా యింటికెళ్ళను? ఏ మొహంతో వెళ్ళగలను?" ఏడుస్తూ అడిగిందామె.

"ఇక్కడే వుంటానంటే నాకు అభ్యంతరం లేదు. నీయిష్టం!"

ఆమె అతడివైపు కన్నీళ్లతో చూసింది.

"నన్ను పంపేయి."

అతడామెను పట్టుకుని ముద్దెట్టుకున్నాడు.

"యూ ఆర్ స్వీట్! మళ్ళా యిక్కడకు ఎప్పుడేనా వస్తావా?"

ఆమె మెదడులో ఏదో మెరిసింది.

"వస్తాను. ఇక్కడికెలా రావాలి? ఈ ఇంటి అడ్రెస్ చెప్పు" అందామె.

అతను ఫక్కున నవ్వాడు.

"మై డియర్ రాగిణీ, నేను నిన్న పుట్టలేదు! నువ్వు ఏమి ఆలోచిస్తున్నావో నాకు తెలుసు. నువ్వు ఇక్కడికి వస్తానంటే మళ్ళా తీసుకొచ్చేటట్లు నేను నియమిస్తాను" అన్నాడతను.

"నేను రాను," అందామె.

"గతాన్ని మర్చిపో, విష్ యూ గుడ్ లక్," అని అతడు బయటకు వెళ్ళిపోయాడు.

ఆ నాటి రాత్రి కారులో తనపక్క కూర్చున్నతను లోపలకు వచ్చాడు. ఆమె టైమ్ చూసింది. 8.15 అయింది. నల్లటిగుడ్డను ఆమె కళ్లకు కట్టాడతను.

ఆమెను మోసుకెళ్ళి మెత్తని కారుసీటుమీద పడుకో బెట్టాడు.

"మిస్ రాగిణీ, మౌనంగా పడుకో, అల్లరిచేస్తే ప్రమాదం" అని హెచ్చరించాడతను.

కారు తలుపులు మూసిన చప్పుడైంది. మరికొందరు కార్లో ఎక్కి వుండాలి. కారు మెల్లిగా కదిలి కాస్సేపట్లో ఆగింది. ఇనుప గేటు తెరిచిన చప్పుడు ఆమెకు వినపడింది.

మళ్ళీ కారు కదిలింది, అనేక మంది కంఠాలు ఆమెకు వినపడ్డాయి. గేటుదాటి కారు రోడ్డు చేరుకుని వుంటుంది. ఎవరో సినిమాపాట పాడుతున్నారు.

"బాబూ, గుడ్డిదాన్ని, దానంచేయండి," అని అరుస్తోందామె పాట ముగిశాక.

కారు దూసుకుపోతోంది. ముష్టిదాని కంఠం ఇప్పుడు వినపడ్డంలేదు.

అరగంట తర్వాత కళ్ళకుగట్టిన నల్లగుడ్డ విప్పేయ బడింది.

"మిస్ రాగిణీ, లేచి మామూలుగా కూర్చో" అన్నాడు పక్కనున్నవ్యక్తి.

ఆమె రోడ్డు యిరువైపులా చూసింది. తనెక్కడున్నదీ ఆమెకు వెంటనే బోధపడలేదు. కొంచెం సేపయ్యాక వెల్లింగ్‌టన్ టాకీస్ కనిపించింది. తను మౌంటు రోడ్డు ప్రాంతంలో వున్నట్లు ఆమె గ్రహించింది.

మరికొంతదూరం వెళ్ళాక రోడ్డువారగా కారు ఆగింది. పక్కకూర్చున్నతను ఆమెకేసి చూశాడు.

"మిస్ రాగిణీ, ఇక్కడ దిగి నీ యింటికి వెళ్ళిపో, మా కారునంబరు రాసుకుని లాభంలేదు. మేము రోజూ నంబరుప్లేట్లు ఎన్నిసార్లో మారుస్తూవుంటాం. నీ హేండ్

బాగ్‌లో ఐదువందల రూపాయలనోట్లు పెట్టాం. అది మేమిచ్చే పారితోషికం" అన్నాడతను.

అతడు తలుపు తెర్చాడు. ఆమె కిందకు దూకింది. వెంటనే కారు రోడ్డమ్మట దూసుకుపోయింది. వెనక నున్న కారునంబరువైపు ఆమె చూసింది. ఆ నంబర్ని గుర్తుంచుకుంది. టైమ్ చూసింది. 9 అయింది.

రోడ్డుదీపాలు వెలుగుతున్నాయి. చల్లటిగాలి వీస్తోంది. మళ్ళీ ప్రజలమధ్య పేవ్‌మెంట్ మీద నడుస్తూంటే ఆమెకు హుషారుగా వుంది.

అమ్మా, నాన్నా ఎలా వున్నారో. తను వెంటనే యింటికి చేరుకోవాలి. తనకు మానభంగం జరిగింది. తను ఎదిరించలేని పరిస్థితుల్లో అదంతా సాగిపోయింది. కడుపు చీల్చుకుని ఎంత ఏడ్చినా పోయింది తనకు రాదు.

ఆమె గబగబా నడవసాగింది. రోడ్డువారగావున్న ఆటోలో ఎక్కి మైలాపూర్ వెళ్ళమంది. ఆటో రోడ్డమ్మట దూసుకుపోయింది.

పది నిమిషాల్లో యింటిముందు ఆటో ఆగింది. ఆమె దిగి లోపలకు పరుగెత్తింది. హాల్లో కోమలి చాపమీద నీరసంగా పడుకునివుంది. తండ్రి, తమ్ముడు ఆమెపక్కనే కూర్చునివున్నారు.

"అమ్మాయి!" అర్చాడు నారాయణరావు.

"చిట్టితల్లీ." అంది కోమలి.

"అక్కా," అని తమ్ముడు ఏడ్వసాగాడు.

నారాణరావు బయటకెళ్ళాడు. ఆటోను చూసి డబ్బు పట్టుకెళ్ళి చెల్లించి గదిలోకి తిరిగివచ్చాడు. తల్లి ఒళ్ళో తలదాచుకుని రాగిణి వెక్కి వెక్కి ఏడుస్తోంది.

# 6

అతడిని సోఫాలో కూర్చోమన్నాను. ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించి, పొగవదుల్తూ అతడివంక సూటిగా చూశాను.

అతడి వయస్సు 60 వుంటుంది. రిటైరయిన వ్యక్తిలా వున్నాడు. అతడు ధరించిన స్లిప్పర్లు అనేకచోట్ల కుట్టబడి వున్నాయి. అనేక రకాల తోలుముక్కలు అతికించ బడ్డాయి.

"చెప్పండి," అన్నాను.

"పరశురామ్ గారూ, నా పేరు నాగయ్య. నేను ఒక లారీ కంపెనీలో పనిచేసి రెండేళ్ల క్రితం రిటైరయినాను. నాకు ఎనమండుగురు పిల్లలు. ఇద్దరుకొడుకులు వేరే వూళ్లలో వుద్యోగాలు చేస్తున్నారు. ముగ్గురు కుమార్తెలకు పెళ్లిళ్లయిపోయినాయి. వాళ్ళు కాపురాలు చేసు కుంటున్నారు. నా భార్య యీ మధ్యనే మరణించింది. నాతో ఆఖరి కూతురూ, యిద్దరు కొడుకులూ వుంటున్నారు..."

"ఇదంతా అనవసరం, అసలు విషయానికి రండి," అన్నాను.

"నా ఆఖరి కూతురి పేరు సుకుమారి. ఆమె హోటల్ జాబేదాలో టెలిఫోన్ ఆపరేటర్ గా పని చేస్తోంది. రాత్రి ఎనిమిదింటికి ఆమె డ్యూటీ అయిపోతుంది. ఆమె యింత వరకూ యింటికి రాలేదు. హోటల్ కి ఫోన్ చేస్తే ఎనిమి దింటికి ఆమె వెళ్ళిపోయిందని మేనేజర్ కుమార్ చెప్పాడు."

టైమ్ చూశాను. పదకొండు కావస్తోంది. మరో సిగరెట్ ముట్టించి అతడివైపు తిరిగాను.

"పోలీస్ రిపోర్టు యిచ్చారా?"

"లేదు. పోలీసు రిపోర్టిస్తే హోటల్ కి అపకీర్తి వస్తుందని మేనేజర్ కుమార్ అన్నాడు. సుకుమారి యీ రాత్రి ఎప్పుడో వస్తుందని అతని ఆశ. కాని నాకు నమ్మకం లేదు."

"ఎందువలన?"

"ఆర్నెలల క్రితం మా పరిసరాల్లో వుండే ఒక అమ్మాయి మాయమైంది. నాల్గు రోజుల తర్వాత ఆమె యింటికి తిరిగి వచ్చిందని విన్నాను."

"ఆమె ఎక్కడికి కెళ్ళింది?"

"ఆమె తలిదండ్రులు ఆ విషయాన్ని గోప్యంగా వుంచారు. దగ్గర వాళ్లెవరేనా గట్టిగా అడిగితే తాతగారి వూరికి వెళ్ళిందని చెప్తున్నారు."

"మీ అమ్మాయిని ఎవరో ఎత్తుకుపోయి వుంటారని అనుమానిస్తున్నారా?" ప్రశ్నించాను. అతను నావైపు సూటిగా చూస్తూ ఒక ఫోటోను నాకిచ్చాడు.

"పరశురామ్ గారూ, ఫోటో చూస్తే మీకే తెలుస్తుంది. నా నలుగురు కూతుళ్ళూ చాలా అందంగా వుంటారు. సుకుమారి అందరికంటె బాగా వుంటుంది. ఇటువంటి అందమైన యువతి రోడ్డుమీద ఒంటరిగా వెళ్తూంటే ఎంతమంది వెనక పడ్తారో మీరే వూహించాలి."

అతనిచ్చిన ఫోటో చూశాను. సుకుమారి గులాబీ పువ్వులావుంది. విశాల నేత్రాలు. చిన్న నోరు. చక్కటి పెదిమలు.

"షీ యీజ్ ఎ రియల్ బ్యూటీ!" అన్నాను.

"అమ్మాయి బ్యూటీ అయాక యింటి కొస్తూంటే అనేక మంది యువకులు వెంటబడి అల్లరి చేస్తున్నారని

నాతో చెప్పింది. దయచేసి మీరు దర్యాప్తు చేసి అమ్మాయి ఏమైందో కనుక్కోండి," అన్నాడతను.

అతడి అడ్రస్, టెలిఫోన్ నంబరు తీసుకుని వెళ్ళమన్నాను. నాకు నమస్కరించి నాగయ్య వెళ్ళిపోయాడు.

ఆలోచిస్తూ పడగ్గదిలోకి వెళ్ళాను. పార్వతి హాయిగా నిద్రపోతోంది. హాల్లోకి తిరిగొచ్చి రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పాను.

ఇన్ స్పెక్టర్ నాయర్ కంఠం అటువైపునుంచి వినపడింది.

"నాయర్ భాయ్, గత పన్నెండు నెలల్లోనూ ఆడపిల్లలను ఎత్తుకుపోయిన కేసులు ఏమైనా మీ దగ్గరకొచ్చాయా?" అడిగాను.

"బ్రదర్, కనుక్కుని చెప్తాను. అరగంట లోపల నీకు ఫోన్ చేస్తాను," అన్నాడు ఇన్ స్పెక్టర్ నాయర్.

అతడికి థాంక్స్ చెప్పి రిసీవర్ని పెట్టేశాను. నా జేబులో వున్న సుకుమారి ఫోటో వైపు మరోసారి చూశాను. మనుషుల్ని నేరస్థులుగా మార్చే అందం ఆమెది.

రిసీవర్ ఎత్తి మరో నంబర్ తిప్పాను.

"హోటల్ జుబేదా!" అందో స్త్రీ కంఠం.

"మిస్ సుకుమారి వుందా?" అడిగాను.

"ఎనిమిదింటికి ఆమె డ్యూటీ అయిపోయింది. పని నాకు అప్పజెప్పి ఆమె యింటికి వెళ్ళిపోయింది." అందామె.

"ఆమె యింకా యింటికి రాలేదు."

"ఐ యామ్ సారీ. ఆమె ఎక్కడికి వెళ్ళిందో నాకు తెలియదు."

"మేనేజర్ సుకుమార్ వున్నారా?"

"ఆయన ఇంటికి వెళ్ళిపోయారు."

"థాంక్స్." అని రిసీవర్ని పెట్టేశాను.

సుకుమారి కోసం యీ మహాపట్నంలో ఎక్కడ వెత కాలి? ఆలోచిస్తూ సోఫాలో కూర్చున్నాను.

టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవర్ని ఎత్తాను.

"పరశురామ్ హియర్," అన్నాను.

"బ్రదర్, రెండు కేసులను గురించి పోలీసులు దర్యాప్తు చేశారు. రాగిణి, త్రివేణి అనే యువతులు మాయ మయ్యారు. వాళ్ళిద్దరూ కొన్ని రోజుల తర్వాత యిళ్లకు తిరిగొచ్చారని పోలీసులకు వార్తలందాయి." అన్నాడు నాయర్.

"వాళ్ళ అడ్రసులు చెప్పగలవా?"

"రాగిణి తండ్రి నారాయణరావు. అడ్రస్ 10, స్వామీ స్ట్రీట్, మైలాపూర్. త్రివేణి తండ్రి పేరు రామ అయ్యర్. అడ్రస్ 33 ముకుదమ్ రోడ్డు, పెరంబూరు."

"ఇంకా ఏమైనా కేసు రిపోర్టులు వున్నాయా?"

"చూడమన్నాను. ఈ రెండూ కనిపించాయి. తతిమ్మా వాటిని గురించి తర్వాత ఫోన్ చేస్తాను."

"థాంక్స్, నాయర్ భాయ్," అని రిసీవర్ పెట్టేశాను.

పడగ్గదిలోకి వెళ్ళి సూటు వేసుకున్నాను. తల దువ్వు కుని, సిగరెట్ వెలిగించి, బయటకు నడిచి మెట్లుదిగాను.

ముందు వరండాలో పడుకున్న క్రిష్ణయ్య కూనిరాగాలు తీస్తున్నాడు. నవ్వుతూ అతని వైపుచూసి షెడ్ కేసి నడిచాను.

కాస్సేపట్లో డాడ్జి కారును బయటకు పోనిచ్చాను. రోడ్లమీద జనసంచారం ఎక్కువగా లేదు. మునపటిలా తప్ప తాగిన మనుషులు రోడ్లమీద తిరగడం లేదు. ప్రొహి

బిషన్ పోలసీ కొంతవరకూ ఫలించిందనే చెప్పాలి. తాగే వాళ్ళు గుట్టుగా తాగి, తిని యిళ్ళల్లో నిద్రపోతున్నారు.

కారును వెపరీవైపు పోనిచ్చాను. ముకదమ్ రోడ్డు 33 నంబరు యింటి ముందు కారాపి దిగాను. ముందు మెట్లెక్కి తలుపును వేళ్ళతో తట్టాను.

తలుపు తెరవబడింది. రామ అయ్యర్ జల్తారు పంచను నడుముకు బిగించి నాముందు ప్రత్యక్షమయ్యాడు. నా పేరు చెప్పాను.

"పరశురామ్ గారూ, రండి, కూర్చోండి," అన్నాడతను.

హాల్లో ఫ్లోరసెంట్ లైటు వెలుగుతోంది. పాతబడిన సోఫాలో కూర్చుని అతడివైపు చూశాను.

"మీ అమ్మాయి త్రివేణి వుందా?"

"నిద్రపోతోంది," అన్నాడతను.

"ఆమెతో మాట్లాడాలి."

"అదేమీ లేదు సార్. ఎవరేనా ఎత్తుకుపోయేరేమో అని మేం భయపడి పోలీస్ రిపోర్టు యిచ్చాం. తాతగారి వూరువెళ్ళి అది తిరిగొచ్చింది. అంతే."

నాగయ్య యిల్లు యీ ప్రాంతంలో వున్నట్టు నాకు గుర్తొచ్చింది. త్రివేణి విషయమే నాగయ్య నాతో చెప్పి వుండాలి!

రామయ్యర్ వైపు సూటిగా చూశాను.

"అనేకమంది యువతులు పట్నంలో మాయమవుతున్నారు. కొన్ని రోజుల తర్వాత వాళ్లు తిరిగొస్తున్నారు. ఇది పెద్ద మిస్టరీలావుంది. మీరు నాతో సహకరిస్తే, ఏదీ దాచకుండా నిజం చెప్తే దోషులను పట్టుకునే అవకాశం నాకుంటుంది."

"పరశురామ్‌గారూ, దాచవలసిన అవుసరం నాకే ముంది, సార్? ఏదేనా వుంటే మీకు చెప్పనా?" అన్నాడు రామ అయ్యర్.

ఎంత అడిగినా యీ ముసలాడు నిజం చెప్పడని నా కనిపించింది. గూఢచారిని టార్చర్ చేసినట్లు యితడిని హింసిస్తేగాని నిజం పల్కడు.

వెనక్కి తిరిగి కారు వైపు నడిచాను. రామ అయ్యర్ ముందు తలుపు మూసుకున్నాడు.

కారును పోనిచ్చాను. మైలాపూర్‌లోని స్వామి స్ట్రీట్‌లో కారాపి, దిగి 10 నంబరు యింటికోసం వెతి కాను. ఇంటి కాంపౌండులోకి వెళ్ళాను. ముందు వరండా మీద ఒక స్కూటర్ వుంది. టార్చి కాంతిలో తలుపు వైపు చూశాను. నారాయణరావు పేరున్న తెల్ల ప్లాస్టిక్ ప్లేట్ అగుపించింది.

తలుపును తట్టాను. ఓ నిమిషం తర్వాత తలుపు తెరవ బడింది. లుంగీ బనియన్‌లో వున్నతను నా వైపు చూశాడు.

పేరు చెప్పాను. అతను నాతో కరచాలనం చేశాడు. ముందున్న చిన్న గదిలో రెండు కుర్చీలున్నాయి.

"కూర్చోండి, సార్," అన్నాడతను.

కూర్చుని సిగరెట్ వెలిగించి అతడి వంక నవ్వుతూ చూశాను.

"మీ రాగిణితో మాట్లాడాలి," అన్నాను.

"దేన్ని గురించి?" అడిగాడతను.

"మీరు పోలీసు రిపోర్టిచ్చారు. మీ అమ్మాయి తిరి గొచ్చిందని తెలిశాక పోలీసులు దర్యాప్తు మానేశారు. మరో యువతి ఇవాళ రాత్రి మాయమైంది." అన్నాను.

"గుడ్ గాడ్," అని అతడు లోపలకు వెళ్ళాడు.

కాస్సేపట్లో రాగిణివచ్చి నా ముందు నిలబడింది. చాలా అందమైన యువతి. కాని కళ్ళలో ఏదో భయం!

"నమస్కారం, పరశురాంగారూ," అందామె.

ఆమెకేసి నవ్వుతూ చూశాను.

"రాగిణీ, యీ మధ్య నువ్వు మాయమయ్యావని విన్నాను. ఏమైంది?" ప్రశ్నించాను.

ఆమె వెంటనే జవాబివ్వలేదు. తండ్రివైపు చూసింది.

"మా చుట్టాల యింటి కెళ్ళిందండి," అందో స్త్రీ కంఠం.

గుమ్మంలో నిలబడిన ఆమె వైపు చూశాను.

"మా అమ్మ," అంది రాగిణి.

రాగిణి వంక సూటిగా చూశాను.

"మీ రందరూ ఏదో దాస్తున్నారు. అది నేను కను క్కోగలను. ఈ పట్నంలో అమాయకులైన యువతులు మాయమవుతున్నారు. అది ఆపాలంటే ఎవరో నాకు నిజం చెప్పాలి! మీరేం చెప్పినా నాలో రహస్యంగావుంటుంది," అన్నాను.

రాగిణి నా వంక తదేకంగా చూసింది.

"పరశురాంగారూ, మీకు నేను నిజం చెప్తాను. కాలేజినుంచి వస్తూండగా వాళ్ళునన్ను ఎత్తుకుపోయారు," అందామె.

"ఈ విషయం మేం పోలీసులకు చెప్పలేదు. మీరు రహస్యంగా వుంచాలి," అన్నాడు నారాయణరావు.

"పెళ్ళి కావల్సిన పిల్ల! దాని భవిష్యత్తు పాడవకుండా మీరు చూడాలి," అంది రాగిణి తల్లి.

"మీకే భయంగాలేదు. నిజం చెప్పు రాగిణీ!"

కన్నీళ్ళతో రాగిణి జరిగినదంతా చెప్పింది. పిడికిలి బిగించాను. నా రక్తంలో కోపం మిళితమై వేగంగా

పసుగడుతోంది! ధనార్జనకోసం అమాయకులను యింత ఘోరంగా వుపయోగించే దుష్టులు యీ పట్నంలో వున్నారా?

సానుభూతితో ఆమె చెయ్యిపట్టుకున్నాను.

“ఆ యిల్లు యెక్కడుందో నువ్వు చెప్పలేవు!”

“చెప్పలేను సార్. నన్ను కారులో తీసుకువెళ్లేటప్పుడు కాల్లీస్ వరకూ నేను చూశాను. తర్వాత నా కళ్ళకు నల్లగుడ్డ కట్టేశారు. నన్ను వదిలేసేటప్పుడు చాలా దూరం వచ్చాక నా కళ్ళకుకట్టిన గుడ్డ తీసేశారు. అప్పటికి నేను వెల్లింగ్టన్ టాకీస్ ప్రాంతంలో వున్నాను.”

“నిన్ను వాళ్ళు ఎక్కడ దింపారు?”

“క్లాక్ టవర్ ప్రాంతంలో.”

“వాళ్ళ యింటినుంచి అక్కడకు చేరుకోడానికి ఎంత టైమ్ పట్టిందో చెప్పగలవా?”

“బయల్దేరేముందు టైమ్ 8.15 అయింది. క్లాక్ టవర్ ముందు నేను దిగాక, వాళ్ళ కారు పోయాక తొమ్మిది అయింది.”

“నలభైఅయిదు నిమిషాలు వాళ్లకారు నడుస్తూవుందన్న మాట!” అన్నాను.

ఆమె తలాడించింది.

“వాళ్ళకారు బాగా స్పీడుగా వెళ్ళిందా?”

“60 కిలోమీటర్ల స్పీడులో వెళ్ళింది. కారు వెళ్తుండగా నేను ఒకసారి స్పీడామీటర్ చూశాను.”

ఆనాటి సాయంత్రం తనను కారులో తీసుకువెళ్ళిన ముగ్గుర్ని వర్ణించింది. తనను రేప్ చేసిన బాస్ను కళ్లకు రూపం కనిపించేటట్లు చిత్రించింది.

ఆమెవైపు చూశాను.

"మరేదైనా గుర్తుంటే చెప్పు!"

రాగిణి ఆలోచిస్తూ వుండిపోయింది.

"ఆ ఇంటి గేటు దాటి కారు రోడ్డుమీదకు రాగానే ఎవరో ముష్టిది పాడేపాట నాకు వినపడింది."

"ఆమె కంఠాన్ని మళ్ళీవింటే పోల్చగలవా?"

"పోల్చగలను," అందామె.

"రాగిణీ, నిన్ను నాతో కారులో తీసుకువెళ్తాను. ఆ ప్రదేశాల్లో తిరిగి చూద్దాం. రాగలవా?"

"నేను రావడం సంఘానికి ఉపయోగపడుతుందని మీరంటే తప్పక వస్తాను," అంది రాగిణి.

"ఇంత రాత్రివేళ ఎక్కడికెళ్తావమ్మా?" అంది తల్లి.

"పక్కన పరశురామ్‌గారుండగా భయం ఎందుకు?" అంది రాగిణి.

తలిదండ్రులకు బైబై చెప్పి రాగిణీ, నేనూ కారువైపు నడిచాం. డాడ్జికారును పోనిచ్చాము. టైం పన్నెండు దాటింది.

కల్లీస్ వైపు కారును పోనిచ్చాను. కల్లీస్‌లో కొత్తగా నిర్మించిన ఒక థియేటర్ ముందునుంచి కారు వెళ్తూంది.

"ఈ ప్రాంతంలోనే వాళ్ళు నా కళ్ళకు గుడ్డకట్టారు" అందామె.

మరికొంత దూరం వెళ్ళింది కారు. రోడ్డుజంక్షన్ వచ్చింది. అక్కడ కారు ఎటువైపైనా తిరిగివుండొచ్చు.

"ఇక్కడ కారు ఎటుతిరిగిందో గుర్తుందా?"

"చెప్పలేను. నేను అప్పట్లో చాలా గాభరాపడ్తూ వున్నాను. ఏదీ గుర్తించేస్థితిలో లేనప్పుడు" అందామె.

కారును ఆయినావరం వైపు పోనిచ్చాను.

"రాగిణీ, కళ్ళు మూసుకో! ఆనాటిరాత్రి నువ్వు విన్న చప్పుళ్ళు యేమైనా వినపడ్తాయేమో గమనించు," అన్నాను.

"ఇప్పుడు షాపులూ అవీ మూసున్నాయి. నన్ను వాళ్ళు యిలా తీసికెళ్ళినప్పుడు ఏడుగంటలు దాటి వుంటుంది" అందామె.

"యూ ఆర్ రైట్! ఏడుగంటల ప్రాంతంలో మనం వినే చప్పుళ్ళు రాత్రి పన్నెండు తర్వాత వుండకపోవచ్చు," అన్నాను.

విల్లివాకందాకా కారును పోనిచ్చాను. ఓ రెస్టారెంట్ ముందు కారాపి హారన్ నొక్కాను. ఒక కుర్రాడు కారు పక్కకొచ్చాడు.

"హాట్ టీ నీట్ గా కప్పుల్లో తేగలవా?"

"తెస్తాను, సార్."

కాస్సేపట్లో రెండు టీలు తెచ్చాడతను. ఇద్దరం వేడి టీ తాగాం. కుర్రాడికి డబ్బులిచ్చి కారును వెనక్కి తిప్పాను.

కారును వేగంగాపోనిస్తున్నాను. రోడ్డమీద కుక్కలు మాత్రం తిరుగుతున్నాయి.

"రాగిణీ, రేపురాత్రి యిటువైపు మళ్ళావద్దాం. 8.15 ప్రాంతంలో నిన్ను కారులో వాళ్ళు బయటకు తీసుకెళ్లేటప్పుడు ముష్టిదాని సినిమాపాట వినపడిందన్నావు. ముష్టివాళ్ళు సాధారణంగా ఒకేస్థలంలో అడుక్కుంటూ వుంటారు. ఆ పాట మళ్ళీ వినపడితే నువ్వు పోల్చవచ్చు" అన్నాను.

"గుడ్ ఐడియా సార్" అందామె.

రాగిణి వాళ్లయింట్లో అప్పగించి నా యింటికి చేరుకున్నాను. మేడమీద ఏర్ కండిషండ్ హాల్లోకి నడిచాను.

టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ని అందుకున్నాను.
"బ్రదర్, నీకోసం యిందాకటి నుంచి ఫోన్ చేస్తున్నాను ఎవరూ రిసీవర్ని తీయడంలేదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

"పార్వతి గాఢనిద్రలో వుండుంటుంది. నేను ఇంట్లో లేను," అన్నాను.

ఇన్‌స్పెక్టర్ నాయర్ మరో ముగ్గురు యువతుల పేర్లూ, అడ్రసులూ యిచ్చాడు. వాళ్ళు కూడా హఠాత్తుగా మాయమై కొన్ని రోజుల తర్వాత యిళ్లకు చేరుకున్నారు!

"ఈ సమాచారం నాకిచ్చినందుకు చాలా థాంక్స్, నాయర్ భాయ్," అన్నాను.

"బ్రదర్, యిదంతా ఎందుకు? ఎవరేనా కనపడకుండా పోయారా?"

ఇన్‌స్పెక్టర్ నాయర్ ప్రశ్నకు జవాబివ్వలేదు.

"నాయర్ భాయ్, పేపర్లలో యీ సంఘటనలను గురించి ఎందుకు ప్రకటించలేదు?" ప్రశ్నించాను.

"ఇదంతా పేపర్లలో వేస్తే ప్రజలు అనవసరంగా తారెత్తిపోతారు. ఇటువంటి వెన్నో పత్రికల్లో రావు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

అతడికి గుడ్ నైట్ చెప్పి రిసీవర్ని పెట్టేశాను. సోఫా మీద పడుకుని రాగిణి చెప్పిన దాన్ని గురించి ఆలోచిస్తున్నాను. బ్లూ ఫిలిమ్స్‌ను నిర్మించి వాళ్ళు గల్ఫ్ దేశాలకు, తదితర ఆఫ్రికా దేశాలకు రహస్యంగా పంపుతున్నారు. అందమైన యువతులను ఎత్తుకుపోయి వాళ్ళతో రేప్ సీన్స్ తీస్తున్నారు. పనిపూర్తయినాక ఆ యువతులను వదిలేస్తున్నారు. వాళ్ళింత ధైర్యంగా ఎలా ప్రవర్తిస్తున్నారు?

త్రివేణి తండ్రి గుర్తొచ్చాడు. ముద్దల్లో పోలీస్ రిపోర్టిచ్చినా, జరిగింది తెలిశాక తలిదండ్రులు నోరు మూసుకుంటున్నారు. మాయమైన వాళ్ళు యిళ్ళకు తిరిగి రావడంతో పోలీసులు దర్యాప్తు మానేస్తున్నారు. వాళ్ళు చేసింది రచ్చకెక్కదనే విశ్వాసంతో అంత ధైర్యంగా ప్రవర్తిస్తున్నారు!

లైట్ మార్చాను. ఒంటిగంట దాటింది. నిద్రముంచుకొస్తోంది. ఆవులిస్తూ పక్కనున్న పడగ్గదిలోకి నడిచాను. పార్వతి పక్కనే మేను వాల్చి కళ్ళుమూశాను.

# 7

ఎనిమిది గంటలయింది. రోడ్డు లైట్లు వెల్గుతున్నాయి. డాడ్జి కారును స్పీడుగా పోనిస్తున్నాను. రాగిణి నా పక్కనే కూర్చుని వుంది.

షాపుల్లోని లైట్లు ప్రకాశవంతంగా వున్నాయి. కార్లు, బస్సులు రోడ్డమ్మట దూసుకుపోతున్నాయి.

"రాగిణీ, ఆ ముష్టిదాని పాట ఎక్కడేనా వినపడ్తుందేమో చూడు!" అన్నాను.

కారును అంబత్తూర్ దాకా పోనిచ్చి వెనక్కి తిప్పాను. అన్నానగర్‌కి పోనిచ్చాను. కారు న్యూ ఆవడీ రోడ్డమ్మట వెళ్తోంది.

"రాగిణీ, వాళ్ళు నీకిచ్చిన ఐదువందలు ఏం చేశావు?" అడిగాను.

"ఆ నోట్లు నా దగ్గర లేవు. నాన్న కిచ్చాను. నాన్నా ఆనోట్లను కవరులో పెట్టి, అంటించి దేవాలయం హుండీలో పడేశాడు," అందామె.

కారును మరో రోడ్డుమీదకు తిప్పి పోనిస్తున్నాను. ఏదో సినిమా పాట వినిపిస్తోంది. నాపక్క కూర్చున్న రాగిణి తృళ్ళిపడింది.

"బాబూ, గుడ్డిదాన్ని! దానం చేయండి!" అన్న మాటలు దూరంనుంచి మాకు వినిపించాయి.

"పరశురాంగారూ, ఆ ముష్టిదే!" అంది రాగిణి వుద్రేకంతో.

కారును మరి కొంచెం దూరం పోనిచ్చాను.

పేవ్‌మెంటుమీద ముష్టిది కూర్చునివుంది. నేలమీద గుడ్డ పరచివుంది.

కారును ఆపి దిగాను. రాగిణి నాపక్కనే నిలబడింది. రోడ్డు కిరు వైపులా చూశాను. అనేక షాపులున్నాయి. ఒక షాపు బోర్డుచూసి ఆ రోడ్డు పేరు గమనించాను. టర్క్‌మన్ రోడ్డు!

పేవ్‌మెంటుమీద కూర్చున్నగుడ్డిదాని వైపువెళ్ళాను. జేబులోంచి పది రూపాయిల నోటు తీసి ఆమె చేతిలో పెట్టాను.

"ఇది పది రూపాయిలనోటు, కాగితం ముక్క కాదు. దాచుకో," అన్నాను.

"ధర్మరాజూ?" అందామె.

వెనక్కి తిరిగాను. రాగిణి చెయ్యి పట్టుకుని కారు వైపు నడిచాను. ఆమె కార్లో కూర్చుంది. స్టీరింగ్ వెనక్కి జరిగి తలుపు మూశాను.

"నిన్న వాళ్ళు తీసుకెళ్ళే కారు గేటు దాటిన కాస్సేపట్లో ఆమె పాట నీకు వినిపించింది. అవునా?"

"అవును, సార్."

"ఆ యిల్లు యిక్కడెక్కడో వుండాలి. మనందాన్ని దాటి వచ్చేసి వుండొచ్చు," అన్నాను.

"కారును వెనక్కి పోనీయండి, చూద్దాం," అందామె.

కారును వెనక్కు తిప్పి మెల్లిగా పోనిచ్చాను. ఎడమ వైపున షాపులున్నాయి. కారు మెల్లిగా వెళ్తోంది. రాగిణి

నా చెయ్యి పట్టుకుంది. ఆమె చెయ్యి వణుకుతోంది. ఎందుకో నేను వెంటనే గ్రహించాను.

ఎడమ వైపున పెద్ద యినప గేటు మూసివుంది. గేటు ముందు గూర్ఖా స్టూల్ మీద కూర్చుని వున్నాడు. మరి కొంతదూరం పోనిచ్చి కారును ఆపాను.

"ఆ యిల్లే అయివుండాలి, సార్," అందామె.

"నే వెళ్ళి చూసివస్తాను," అన్నాను.

"పరశురాంగారూ, ఒంటరిగా వెళ్తే ప్రమాదం," అందామె.

"డోంట్ బాదర్, నువ్విక్కడే కూర్చో! నేను వీలైనంత వ్యవధిలో వచ్చేస్తాను," అని వెనక్కి నడిచాను.

బట్టల షాపులోకి దూరి టెలిఫోన్ రిసీవర్ని ఎత్తి ఒక నంబరు తిప్పాను. అటువైపునుంచి ఇన్‌స్పెక్టర్ నాయర్ కంఠం వినపడింది.

"నాయర్ భాయ్, నువ్వు కొంతమంది సాయుధ పోలీసులతో టర్కునన్ గోడునకు రా!" అన్నాడు.

"బ్రదర్, అక్కడ ఏం జరిగింది?" అడిగాడతను.

"ఒక ముఠాను నేను నీకు అందజేస్తాను! గతంలో ఎందరో యువతులను ఆ ముఠా ఎత్తుకుపోయి, తర్వాత వదిలేసింది!"

"వెంటనే వస్తున్నాను," అన్నాడు నాయర్.

"నా కారు వెనకనే నీ జీప్ ఆపు. నా కారులో ఒకమ్మాయి వుంటుంది. నేను ఏ యింట్లో వున్నానో ఆమె నీకు చూపిస్తుంది."

"గుడ్!"

రిసీవర్ పెట్టేశాను. కౌంటర్ మీద యాభై పైసలు పడేశాను. షాపుయజమాని నావైపు విచిత్రంగా చూస్తూ, "70 పైసలు సార్," అన్నాడు.

"ఇది ఎమర్జన్సీ పోలీస్ కాల్!" అన్నాను.

వేగంగా బయటకు వచ్చాను. పేవ్‌మెంటమ్మట కొంతదూరం నడిచాను. ఆ యింటిముందు వున్నాను. స్టూల్ మీద కూర్చున్న గూర్ఖా నావైపు అదోలా చూశాడు.

"ఈ యింట్లో ఎవరుంటున్నారు?" ప్రశ్నించాను.

"సాబ్!"

"ఆ సాబ్ పేరు?"

"బడేసాబ్," అన్నాడతను.

గేటు తెరవబోయాను. గూర్ఖా నాకు అడ్డు పడ్డాడు.

"లోపలకు వెళ్ళనివ్వను," అన్నాడతను.

కుడిచెయ్యి పైకెత్తి అమాంతంగా అతడిమీద బలంగా కొట్టాను. అతడి తల పక్కకు వంగిపోయింది. గూర్ఖా మూల్గుతూ నేలకూలిపోయాడు.

గేటు కొద్దిగా తెరిచి లోపలకు వెళ్ళాను. పెద్ద కాంపౌండు. చుట్టూ ఎత్తయిన ప్రహారీ గోడ! గోడపైన గాజు పెంకులు!

ఎదురుగా తెల్లటి మేడ కనిపిస్తోంది. మేడముందు మూడు కార్లు వున్నాయి. నల్లటి ఫియట్ కారును చూసి ఆశ్చర్యపడ్డాను. ఆ ఫియట్ కారులోనే వాళ్ళు రాగిణి ఎత్తుకుపోయి వుండాలి!

ముందు తలుపు తెరుచుకుని యిద్దరు బయటకొచ్చారు. కార్ల పక్కనే వంగి దాక్కున్నాను. వాళ్ళవైపు కారు అద్దంగుండా చూశాను.

ఒకడు గూండాలా వున్నాడు. రెండోవాడిమీద నా చూపు కేంద్రీకృతమైంది. అతడు పాంట్, స్లాక్‌లో వున్నాడు. జుత్తు నెరిసింది. పెద్దమనిషిలా మాట్లాడి

ఆనాడు సాయంత్రం రాగిణ్ని కారులో ఎక్కమన్నతను అయివుండాలి!

వరండాలో నిలబడి వాళ్ళు ఏదో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ మాటలు నాకు వినపడ్డంలేదు.

అమాంతంగా వాళ్ళవైపు దూసుకెళ్ళాను. ఇద్దరూ నావైపు చూశారు.

"ఏం కావాలి సార్?" అడిగాడు జుత్తు నెరిసిన వ్యక్తి, తీయటి కంఠంతో.

కోటు జేబులోంచి పిస్టల్ తీసి వాళ్ళవైపు గురి పెట్టాను.

"చేతులెత్తి నిలబడండి! కదిల్తే చస్తారు!" అన్నాను.

ఇద్దరూ చేతులెత్తేశారు. దగ్గరగా వెళ్ళి గూండాని చంపమీద కొట్టాను. కాలు విరిగిన స్టూల్లా అతను కింద పడ్డాడు. జుత్తు నెరిసినతడిని పొట్టమీద తన్నాను. నేలమీద దొర్లుతూ వెళ్ళి అతడు పిట్టిగోడ పక్కనే పడ్డాడు!

ముందు తలుపు తోసుకుని లోపలకు వెళ్ళాను. విశాలమైన హాలు! హాల్లో సోఫాలున్నాయి. మనుషులెవరూ లేరు. హాల్లోంచి లోపలకు వెళ్ళాను.

విశాలమైన గది. కుర్చీలో నల్లటి వ్యక్తి కూర్చుని వున్నాడు. అతడు అండర్‌వేర్‌లో వున్నాడు. ఇద్దరు గూండాలు అతడి శరీరాన్ని రుద్దుతున్నారు. మరో రేప్ సీన్‌కి ఎద్దును సిద్ధపరుస్తున్నారేమో!

కుర్చీలో కూర్చున్న వ్యక్తిని చూడగానే బాస్ అతడే అయివుండాలని వెంటనే పోల్చగల్గాను. రాగిణి అతడిని చక్కగా వర్ణించింది.

"మిస్టర్ ఎవరు నువ్వు?" అర్చాడతను.

పిస్టల్ని అతడివంక గురిపెట్టాను. అతడి ఒళ్ళురుద్దే వాళ్ళు పారిపోబోయారు. పైకి రెండుసార్లు షూట్ చేశాను. గదిలో భయంకరమైన చప్పుళ్ళు ధ్వనించాయి.

"కదలకండి!" గర్జించాను.

మెల్లగా ముందుకు నడిచాను. కుర్చీలో కూర్చున్న బాస్ లేచి నిలబడ్డాడు. అతడి పొట్టలో తన్నాను. వెనక్కి పడ్డాడు. దగ్గరగా వెళ్ళి అతడిని లేవదీసి చంపల్ని పగలగొట్టాను. అతడి నోట్లోంచి రక్తం కార్తోంది. అతడు మూలుగుతూ నేలమీద పడిపోయాడు.

"సుకుమారి ఎక్కడుంది?" అడిగాను, గూండాలిద్దరి వంకా చూస్తూ.

వాళ్ళు ఒక గుమ్మంవైపు చెయ్యి చూపించారు. అటువైపు పరుగెత్తాను. గది తలుపు మూసి వుంది. తలుపు తెరిచి లోపలకు చూశాను.

పరుపుమీద కూర్చుని వున్న ఒక యువతి నావైపు భయంతో చూసింది. ఆమె దగ్గరగా వెళ్ళాను.

"మిస్ సుకుమారీ, భయపడకు! నువ్వు స్వేచ్ఛగా మీ యింటికెళ్తావు!" అన్నాను.

ఆమె వుషారుగా నాదగ్గరకొచ్చింది. అప్పుడే ఇన్స్పెక్టర్ నాయర్ గదిలోకొచ్చాడు. నాతో కరచాలనం చేసి ఇన్స్పెక్టర్ ఆమెకేసి చూశాడు.

"నాయర్ భాయ్, ఈమె పేరు సుకుమారి! అమాయకులైన ఆడపిల్లలను ఎత్తుకొచ్చి, యిక్కడ బంధించి, యీ ముఠా బ్లూ ఫిలిమ్స్ నిర్మించి, వాటిని రహస్యంగా

గల్ఫ్ దేశాల్లో, ఆఫ్రికా దేశాల్లో అమ్ముతోంది,'' అన్నాను పుద్రేకంతో.

''ఈ మేడ చుట్టూ సాయుధ పోలీసులున్నారు. అందర్నీ అరెస్టు చేస్తాను,'' అన్నాడు ఇన్స్పెక్టర్ నాయర్.

నేను నా కారుదగ్గరకు చేరుకునేసరికి పది దాటింది. రాగిణి హుషారుగా నా చెయ్యి పట్టుకుంది.

''మిస్టర్ పరశురామ్, మీరు సాధించారు!'' అందామె.

ఆమెవైపు నవ్వుతూ చూశాను.

''రాగిణీ నువ్వు ధైర్యంగా అంతా చెప్పి నా విజయానికి తోడ్పడ్డావు,'' అని కారుని వెనక్కి తిప్పి పోనిచ్చాను.

''ముష్టిదాని పాట వినపడ్డంలేదు!'' అందామె.

''ఆ పాటే వాళ్లను మనకు పట్టిచ్చింది,'' అన్నాను.

—:అయిపోయింది:—

# నాల్గురీళ్ల సినిమా

## వసుంధర

సుబ్రహ్మణ్యం కథ రాసుకుంటూండగా అతని భార్య గౌరి వచ్చి "మీకోసం ఎవరో వచ్చారండీ హాల్లో కూర్చోపెట్టాను" అంది.

సుబ్రహ్మణ్యం కలం మూత పెట్టి కాగితంమీద పేపర్ వెయిట్ పెట్టి "కథ మంచి పట్టులో వుండగా వచ్చారు, ఎవరో కానీ" అని స్వల్పంగా విసుక్కుంటూ చొక్కా తొడుక్కుని హాల్లోకి వెళ్ళాడు.

"నమస్కారమండీ!" అన్నాడు హాల్లోని వ్యక్తి సుబ్రహ్మణ్యాన్ని చూస్తూనే లేచినిలబడి.

ఆ వ్యక్తిని అదివరలో ఎక్కడా చూసినట్లు అనిపించ లేదు సుబ్రహ్మణ్యానికి. మనిషిమాత్రం చాలా గొప్ప వాడిలా కనబడుతున్నాడు. "నమస్కారం మీ పేరు తెలుసుకోవచ్చా?"

"ఆనంద్. చలనచిత్ర రంగంలో దర్శకుణ్ణి" అన్నాడతను.

సుబ్రహ్మణ్యం క్షణకాలం తడబడ్డాడు. మనిషి తెలియకపోయినా ఆనంద్ పేరు అతను వినివున్నాడు. ఇప్పుడిప్పుడే పైకివస్తున్న దర్శకుడతను. రెండు సంవత్సరాలలో అతని దర్శకత్వంలో విడుదలైన ఆరుచిత్రాలలో రెండు రజతోత్సవాలూ, మూడు శతదినోత్సవాలూ జరుపుకోగా ఒకటిమాత్రం సుమారుగా ఆడింది. ఆనంద్ గురించిన యీ వివరాలు పత్రికలలో చదవడం మాత్రమే కాక కొందరు దర్శక, నిర్మాతల నోటివెంబడి కూడా సుబ్రహ్మణ్యం విన్నాడు.

సుబ్రహ్మణ్యానికి సినిమా ఫీల్డు కొత్తకాదు. రచయితగా అతనికి సుమారు పదిహేను సంవత్సరాలుగా గుర్తింపు వుంది. ఆరేడుసంవత్సరాలుగా అతను సినిమారంగంలో కొద్దికొద్దిగా అనుబంధాన్ని పెంచుకుంటూ వచ్చాడు. అతని కథలు పది—ఇంతవరకూ చలనచిత్రాలుగా వచ్చాయి. రెండు తయారీలో వున్నాయి. ఆ సందర్భమై అతను అప్పుడప్పుడు మద్రాసువెళ్ళి వస్తూంటాడు. తనపని ఏదో చూసుకుని వచ్చేసే బాపతు కావడంవల్ల చలనచిత్ర రంగంలో అతనికిగల పరిచయస్థుల సంఖ్య పరిమితంగానే వుంది.

"మీగురించి విన్నాను. దివినుంచి భువికి దర్శకుడిగా మీరు దేశంలో చాలామంది హృదయాలలో మరచిపోలేని ముద్ర వేశారు. మీ పరిచయం లభించడం అదృష్టంగా భావిస్తున్నాను" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"కల్పనాశక్తి మీ రచయితలది. వాటికి రూపకల్పన చేసి పేరుతెచ్చుకునేది మేము. ఎంతగొప్ప దర్శకుడైనా

రచయితపైనే ఆధారపడాలి కదా!" అని నవ్వి "మిమ్మల్ని చూడకపోయినా మీ రచనలు చాలాకాలంగా చదువుతున్నాను. మీ అభిమానుల్లో నేనొకడిని" అన్నాడు ఆనంద్.

సుబ్రహ్మణ్యం కొద్దిగా సిగ్గుపడి "మరీ అంత పెద్ద పదాలుపయోగించకండి. పెద్దపదాలు మీ సహృదయతనే గానీ నా స్థితిని సూచించవు" అన్నాడు.

"విషయానికి వస్తాను" అన్నాడు ఆనంద్ "మన ఆంధ్రదేశం అదృష్టంకొద్దీ వెలసిన అతికొద్ది రచయితల్లో మీరొకరు. రంగనాథంగారు మీ గురించి అసమానం అంటూంటారు. మీ ఊహాశక్తి అద్భుతం. నిర్మాతలు కోరిన దృశ్యాలన్నింటినీ దృష్టిలో వుంచుకుని అద్భుతమైన కథల్లగలశక్తి మీకుతప్ప ఎవ్వరికీ లేదట. మీ రచనల్లో వెరైటీ చూశాక నాకూ మీ గురించి అటువంటి అభిప్రాయమే కలిగింది. అందుకే మీ సహాయం కోరి వచ్చాను."

"ఆ మాత్రం దానికి మీరు స్వయంగా రావాలా, ఒక వుత్తరం రాస్తే నేనే వచ్చివుండేవాడిని" అన్నాడు సుబ్రహ్మణ్యం నొచ్చుకుంటూ.

"లేదండీ నేను స్వయంగా వచ్చి మిమ్మల్ని తీసుకు వెళ్ళాలనుకుంటున్నాను" అని ఆగాడు ఆనంద్.

"సినిమాకథకు సంబంధించి విషయమేనా?" అన్నాడు సుబ్రహ్మణ్యం అనుమానంగా.

"అవును. కానీ ఇది మన మేధాశక్తికి పరీక్ష అవుతుంది. నా చిత్రాలను విజయవంతం కావించడం ద్వారా ప్రేక్షకులు నా బాధ్యతను బాగా పెంచారు. ప్రేక్షకుల ఎక్స్పెక్టేషన్ నా చిత్రాల విషయంలో చాలా "హై" గా

వుంటోంది. వారిని నిరుత్సాహపరచకూడదని ప్రతిచిత్రం లోనూ వైవిధ్యం చూపించడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాను. అయితే లక్షలకొద్ది డబ్బు పెట్టుబడి పెట్టే నిర్మాతల ఆశయాలు నన్ను కొంత అదుపులోకి తీసుకుంటూంటాయి. అందువల్ల నాలో కొంత అసంతృప్తి వుంది. దాన్ని రూపుమాపడం కోసం నేనే స్వయంగా ఒక చిత్రాన్ని నిర్మించాలనుకుని అందుకు కొంత ప్రయత్నం చేశాను. ఇప్పుడు మీ సహకారం కావాలి.''

''చెప్పండి ఎటువంటి కథ కావాలి మీకు?'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

''ఇంకా నాకే తెలియదు'' అన్నాడు ఆనంద్.

''అంటే?'' అన్నాడు సుబ్రహ్మణ్యం అర్థంకాక.

''ఇప్పటికి నా వద్ద నాలుగురీళ్ళ చిత్రంవుంది. నాలుగు రీళ్ళ కథా ఒక్కలాగా వుండదు. నాలుగూ నాలుగు రకాలుగా వుండవచ్చు. మీరా నాలుగురీళ్ళను శ్రద్ధగా చూసి ఆ నాలుగింటినీ అసలు కథలో ఏ విధంగానూ అసందర్భం అనిపించకుండా వుండేలా ఇమడ్చాలి.''

''ఆ నాలుగురీళ్ళలోని నటీనటులెవ్వరు?''

''అంతా కొత్తవారు. అయితే వారిలో ఎవ్వరూ అసలు చిత్రంలో వుండకపోవచ్చు.''

సుబ్రహ్మణ్యం ఆశ్చర్యంగా ఆనంద్ వంక చూసి ''అసలు మీరా నాలుగురీళ్ళను ఎందుకు, ఎలా షూట్ చేశారు?'' అనడిగాడు.

''ఎలా అని అడక్కండి? ఎందుకో వేరే చెప్పాల్సినదేముంది. సినిమాకోసం.''

''నాలుగురీళ్ళూ నాలుగురకాలుగా వుండవచ్చునంటున్నారు గదా—ఏ కథలను దృష్టిలో వుంచుకుని అవి షూట్ చేశారో చెప్పగలరా?''

"ఏమీ చెప్పలేను. నిజం చెప్పాలంటే వాటిని ప్రొజక్టర్లో మొట్ట మొదటిసారిగా మనమిద్దరం కలిసే చూస్తాం. అంతవరకూ అందులోని కథాంశం నాకూ తెలియదు."

సుబ్రహ్మణ్యానికి అంతా మిస్టరీగావుంది. ఆనంద్ దగ్గర నాలుగు సినిమారీళ్ళున్నాయి. వాటిలోని నటీనటుల గురించీ, సన్నివేశాల గురించీ, సంభాషణల గురించీ అతనికి తెలియదు. నాలుగూ నాలుగురకాలుగా వుంటా యని అతననుకుంటున్నాడు. అతనితోపాటు తనూ అవి చూసి వాటి ఆధారంగా ఓ కథ అల్లాలి.

"మీరు చెప్పేదంతా మిస్టరీగా వుంది నాకు" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"ఇందులో మిస్టరీ ఏమీ లేదండీ నేనో కొత్తరకం ప్రయోగం చేస్తున్నాను. అందుకే మీకా రీళ్ళు యెలా వచ్చాయో చెప్పడంలేదు. వాటి ఆధారంగా కథ చెప్పి సహకరించడం మీవంతు. అందుకు సంతృప్తికరమైన పారితోషికం మీకు యివ్వగలను. మీరు ఊఁ అంటే మనం యిప్పుడే బయల్దేరి వెడదాము" అన్నాడు ఆనంద్.

సుబ్రహ్మణ్యం అర్థం చేసుకున్నాడు. ఆ నాలుగు రీళ్ళనూ షూట్ చెయ్యడానికి ఆనంద్ ఒక కొత్తపద్ధతి ఎన్నుకున్నాడు. అది అందరికీ తెలియడం అతనికిష్టం లేదు. ఈ పద్ధతి విజయవంతమైతే-తన తరువాతి చిత్రాలకు కూడా కొనసాగిస్తాడు. వ్యాపారరహస్యం అన్నమాట అది. సుబ్రహ్మణ్యం లోపలకు వెళ్ళి భార్యకు వివరాలు చెప్పి "మరి నేను బయల్దేరి వెడతాను" అన్నాడు.

అతను తిరిగివచ్చేటప్పుడు ఏమేం కొని తీసుకురావాలో గౌరి పెద్దజాబితా రూపంలో తెలియజేసింది.

# 2

తెరమీద బొమ్మ కనబడగానే ఆనంద్ ముఖం చూశాడు సుబ్రహ్మణ్యం. కొత్తగా చూడబోతున్నవాడి ఆత్రుత అతని ముఖంలో చూసి అతను కాస్త ఆశ్చర్య పడ్డాడు.

ఆ రీల్లో పెద్దవిశేషాలేమీ లేవు. ఒక సందులోని విశేషాలున్నాయి. నాలుగు కూరలదుకాణాలు, ఒక కిరాణా దుకాణం. అరడజనుమంది బిచ్చగాళ్ళు, వచ్చే పోయే జనం–అంతే అందులోని విశేషాలు. ఏ ప్రయోజనమూ ఆశించకుండా తీసిన డాక్యుమెంటరీ చిత్రంలా గున్నది.

తర్వాత రెండవ రీల్లో సన్నివేశం అంతా ఓ కాఫీ హోటల్లో జరుగుతుంది. సర్వర్లు, క్లీనర్లు, టిఫిన్ తినే వాళ్ళు, వచ్చేపోయే జనం–హడావుడి! కాఫీహోటలు గురించి డాక్యుమెంటరీ చిత్రం తీసినా అంత సేపు ఆ వివరాలు చూపరు.

మూడవ రీలు షాకింగుగా వుంది. బెడ్రూంలో భార్యాభర్తలు. నటన చాలా సహజంగా వుంది. ఇద్దరూ కూడా ఎంతో సంసారపక్షంగా కన్పిస్తున్నప్పటికీ–వారి నటన సహజంగా వున్నప్పటికీ తెరపైని వారినటన అసభ్యంగా వున్నదనక తప్పదు.

సుబ్రహ్మణ్యానికి మూడవరీలు అయిపోగానే మరొక్క సారి చూడాలనిపించింది. ఆ అవకాశం మళ్ళీ వస్తుందో రాదో తెలియదు. అతను మొహమాటాన్ని పక్కకునెట్టి "నాల్గవరీలు చూసేముందు ఇంతవరకూ చూసిన మూడు రీళ్ళనూ మరొక్క మాటు చూడాలనుకుంటున్నాను" అన్నాడు.

ఆనంద్ వెంటనే అంగీకరించాడు. అతని ముఖంలో అంతులేని సంతృప్తి కనబడుతోంది.

మొదటిరీలు రెండవ పర్యాయం చూసినపుడు సందులోని విశేషాలు చాలా వినోదాత్మకంగా వున్నాయని సుబ్రహ్మణ్యానికి అనిపించింది. పదినిముషాలసేపు ఆ సందులో జరిగిన బేరసారాలు, సంఘటనలు, మనుషుల ముఖాల్లోని హావభావాలు - అత్యంత సామాన్యమైనవే అయినప్పటికీ-అప్పుడు తెరమీద చూస్తూంటే వింతగా, కొత్తరకంగా ఉన్నాయి. మొదటిపర్యాయం చూసినప్పుడు తనీ విషయాల్ని గుర్తించలేకపోయినందుకు సుబ్రహ్మణ్యం మనసులో చిన్నబుచ్చుకున్నాడు.

మొదటి రీలుతో పోలిస్తే రెండవసారి రెండవరీలు యింకా సరదాగా వుంది. సరదాకు సహజత్వంతోడై చాలా గొప్పగా వున్నదని సుబ్రహ్మణ్యానికి తోచింది. ఆ సన్నివేశంలో మరికొన్ని రసవత్తరమైన సంభాషణలు యిరికిస్తే-ఇంకా రక్తికడుతుందనీ, అయినా సహజత్వం చెడదనీ అతనికి అనిపించింది.

మూడవరీలు చూసేముందు అప్రయత్నంగానే సుబ్రహ్మణ్యం మెదడులో ఆవేశం చోటుచేసుకుంది. ఆ రీలు చూడాలని అతనికి ఆత్రంగా వుంది. కానీ తీరా చూశాక సుబ్రహ్మణ్యం ఆశ్చర్యపడ్డాడు. ఆ సన్నివేశం తాననుకున్నంత అసభ్యంగా లేదు. ఆ మాటకొస్తే సెన్సారు నిబంధనలకు అనుగుణంగానే వున్నదని చెప్పవచ్చు. సత్యజిత్ రాయ్ భార్యాభర్తల అనుబంధాన్ని చూపించాలనుకుంటే ఆ రీలులో ఆ విధంగానే తీస్తాడని సుబ్రహ్మణ్యానికి అనిపించింది. అంతవరకూ భార్యాభర్తల అనుబంధాన్ని తెరపై అంతసహజంగా చూసివుండక

పోవడంవల్ల_మొదటిసారి తనకు అటువంటి పొరపాటు అభిప్రాయం కలిగివుండవచ్చునని సుబ్రహ్మణ్యం అను కున్నాడు.

"మీరీ ఫిల్ములనెలా చిత్రీకరించారో తెలియదు కానీ చాలా గొప్పగా వున్నాయి. యూ ఆర్ రియల్లీ ఎ జీని యస్. మీరు తీసుకోబోయే చిత్రానికీ సన్నివేశాలు తప్పక రసపుష్టినిస్తాయి. మిమ్మల్ని అభినందించక తప్పదు" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"నా శక్తి అంతా నాల్గవరీలుమీదే వుంది. అందులో ఏముందో చూడాలి" అన్నాడు ఆనంద్.

మూడూ మూడురకాలుగా వున్నందువల్ల నాల్గవరీల్లో ఏముందో చూడాలని సుబ్రహ్మణ్యానికీ ఆత్రుతగానే వుంది. అయితే అందులో ఏముందో చూడాలని ఆనంద్ కూడా ఆత్రుతపడుతూంటే అతనికి ఆశ్చర్యంగా వుంది. తనకు తెలియకుండా చిత్రీకరణ యెలా జరుగుతుంది?

ఆనంద్ రీలు మార్చి ప్రొజక్టర్ ఆన్ చేశాడు.

అది చిన్నసైజు ఆవరణేకానీ నగరంలోని ఓ యిరుకు ప్రాంతమని కూడా చెప్పవచ్చు. అక్కడికి చేరుకోవ డానికి మార్గం ఓ ఇరుకుసందు. ఆ ఆవరణకు చుట్టూ గోడ లున్నాయి. ఎంతో అపరిశుభ్రంగా వున్నదా ఆవరణ. పగిలిన సీసాలు చెత్తకాగితాలు, తుక్కుగుడ్డలు వగైరా లెన్నో వున్నాయి. బహుశా అక్కడ భరించలేని దుర్వా సన వుండి వుంటుంది.

ఆ ఆవరణలోకి సన్నగా నాజూగ్గావున్న ఓ యువకుడు పరుగెత్తుకురావడంతో రీలు ప్రారంభమైంది. ఆ యువకుడి ననుసరించే ఓ మనిషి వచ్చాడు. ఆ మనిషి ఎత్తుగా, బలంగా వున్నాడు. కళ్ళు క్రూరంగా వున్నాయి. వాటం

చూస్తూంటే ఆతనా యువకుణ్ని తరుముకుంటూ వచ్చి నట్లుంది.

"ప్లీజ్ నన్ను చంపకు" అన్నాడు యువకుడు.

"నా ఆఖరి హెచ్చరికను కూడా నువ్వు లక్ష్యపెట్ట లేదు. నేనింక నీ మాటలు వినే స్థితిదాటిపోయింది. నీకు చావు తప్పదు" అన్నాడా మనిషి.

యువకుడేదో మాట్లాడబోయాడు కానీ ఆ మనిషి చేతులు ఆతని గొంతును గట్టిగా బిగించి పట్టుకున్నాయి. యువకుడు పెనుగులాడుతున్నాడు కానీ ఆ మనిషిపట్టు సడలటంలేదు.

క్రమంగా యువకుడి పెనుగులాట ఆగిపోయింది. ఆ మనిషి అతన్ని వదిలేశాడు. యువకుడు నిర్జీవంగా నేల కొరిగాడు. ఆతని ముఖం మహా భయంకరంగా వుంది. బయటకు వచ్చిన నాలుక, ప్రాణభయాన్ని సూచించే కళ్ళు.

ఆ శవానికి మించి భయంకరంగా వున్నదా మనిషి ముఖం. ఒక మనిషిని చంపానన్న భయం, దిగులు, పాప భీతి ఆ ముఖంలో కనబడ్డంలేదు. సంతృప్తితో కూడిన క్రూరత్వం, చచ్చిన ఆ యువకుడిపట్ల అసహ్యం ఆ కళ్ళలో కలగలుపుగా కనిపిస్తున్నాయి.

ఆ దృశ్యం చూస్తున్నంతసేపూ తానొక సినిమా చూస్తున్నానన్న విషయం సుబ్రహ్మణ్యానికి గుర్తులేదు. ఆ మనిషి, శవంపైన తుపుక్కున ఊయగానే రీలు అయి పోయింది. అప్పుడే సుబ్రహ్మణ్యం ఈ లోకంలోకి వచ్చాడు. అప్పుడే అతను తానంతవరకూ చూసినది సినిమా అని గుర్తుకువచ్చింది.

"ఇది చాలా అద్భుతమైన చిత్రీకరణ. దృశ్యం చూస్తున్నంతసేపూ ప్రేక్షకుడు తన్ను తాను మైమరచి

పోతాడు. సినిమాకోసం చిత్రీకరించిన దృశ్యంకాక నిజంగా జరుగుతున్న సంఘటనను చూపించినట్లుంది. హేట్సాఫ్ టూ యూ'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

అయితే ఆనంద్ ముఖంలో సంతృప్తి కనబడలేదు. అతని కళ్ళలో భయం, శరీరంలో వణుకు కనిపెట్టి సుబ్రహ్మణ్యం ఆశ్చర్యపడి "అదేమిటి? అలాగైపోతు న్నారు?'' అన్నాడు.

"ఏమీ లేదు, ఇది చూడ్డం నేనూ ఇదే మొదటిసారి. అందువల్ల షాక్ తిన్నాను'' అన్నాడు ఆనంద్. అతని మాటలు బాగా తడబడ్డాయి.

"మీ కేమీ అనుకోనంటే అడుగుతాను. మీకు తెలియ కుండా మీరీ దృశ్యాన్నెలా చిత్రీకరించగలిగారు?'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

"అది ట్రేడ్ సీక్రెట్'' అన్నాడు ఆనంద్.

"అసలు చిత్రీకరించబోయే దృశ్యమైనా మీకు తెలుసా?''

"తెలియదు. తెలిస్తే యిప్పుడు షాక్ యెందుకు తింటాను?'' అన్నాడు ఆనంద్.

"పోనీ ఈ దృశ్యంలో నటించిన ఆ యిద్దరూ ఎవరో తెలుసుకోవచ్చా?''

"ఆ విషయమే నేనూ ఆలోచిస్తున్నాను. ఇలా జరుగు తుందని అనుకోలేదు'' అంటూ అస్పష్టంగా తనలో తనే ఏదో గొణుక్కున్నాడు ఆనంద్.

సుబ్రహ్మణ్యంఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయి. ఆనంద్ ఎందుకిలా తడబడుతున్నాడు. అతను జరుగకూడ దన్నదేమైనా జరిగిందా? కొంపదీసి ఆ నటీనటుల్లో ఒకడు సహజత్వంకోసం...నిజంగానే రెండోవాడిని చంపేయ

లేదుకదా? అలా జరిగివుండటానికి వీల్లేదు. చూస్తూ చూస్తూ ఎవడూ అలాంటి తెలివితక్కువ పని చేయడు అందులోనూ ఆ దృశ్యం చిత్రీకరించబడుతున్నదని తెలిసినప్పుడు-యింకా జాగ్రత్తగా వుంటారు. మరి ఏం జరిగివుంటుంది?

“కధ గురించి ఆలోచించమంటారా?” అన్నాడు సుబ్రహ్మణ్యం.

“అయాం వెరీసారీ మిస్టర్ సుబ్రహ్మణ్యం. మీకు చాలా ట్రబులిచ్చినందుకు మన్నించండి. మీ సమయాన్ని వృధాచేసినందుకు మీకు నష్టపరిహారం ఇచ్చుకుంటాను. ప్రస్తుతానికి నేను ప్రయోగాత్మక చిత్రం తీసే ఉద్దేశ్యం వదిలిపెట్టాను” అన్నాడు ఆనంద్.

హఠాత్తుగా అతను తీసుకున్న నిర్ణయానికి కారణం అర్థంకాక ఆశ్చర్యంగా అతనివంక చూస్తూండిపోయాడు సుబ్రహ్మణ్యం.

## 3

సుబ్రహ్మణ్యం యిల్లుచేరేసరికి తలుపులు బార్లా తెరిచివున్నాయి. అక్కడ సోఫాలో కూర్చుని అతని భార్య ఎవరో యువతితో మాట్లాడుతోంది. ఆ యువతి ముఖం సుబ్రహ్మణ్యానికి కనబడ్డంలేదు. వీపు గుమ్మంవైపుకు వుంది.

సుబ్రహ్మణ్యాన్ని చూస్తూనే గౌరి లేచినిలబడి “అరే అప్పుడే వచ్చేశారే-చాలా ఆశ్చర్యం!” అంది.

సుబ్రహ్మణ్యం నవ్వి-ఎవరన్నట్లుగా భార్యవంక సైగ చేసేంతలో ఆ యువతి కూడా లేచినిలబడి వెనక్కు తిరిగింది.

సుబ్రహ్మణ్యం ఆమెను గుర్తుపట్టి “రాణీ! నువ్వా?” అన్నాడు.

రాణీ అతనికి కాలేజీలో క్లాస్ మేటు. ఇద్దరివీ పక్క పక్క ఇళ్ళే అవడంవల్ల తరచు కలుసుకుని మాట్లాడు కుంటూ పాఠాలను గురించి చర్చించుకుంటూండేవారు. ఇద్దరికీ చాలా మంచిస్నేహం. చదువు పూర్తి కాకుండానే రాణికి పెళ్ళిపోయింది. రాణిపెళ్ళికి సుబ్రహ్మణ్యం ప్రత్యేకంగా ప్రజంటేషన్ ఇచ్చాడు.

"గుర్తున్నానన్న మాట?" అంది రాణి సంతోషంగా.

తన భార్యఎదుట ఆమె ఈ ప్రశ్న వేయడం సుబ్ర హ్మణ్యానికి నచ్చలేదు. తన ఆడస్నేహితుల్ని అతను బాగా గుర్తుంచుకుంటాడని గౌరి తరచుగా ఆరో పిస్తూంటుంది.

గౌరి నవ్వి, "స్నేహితులనూ, స్నేహితురాండ్రనూ ఆయన ఎప్పుడూ మర్చిపోరు" అంది.

సుబ్రహ్మణ్యం ఇబ్బందిగా నవ్వి "ఏమిటిలా వచ్చావ్? మీ ఆయన కూడా వచ్చాడా? విశేషాలేమిటి?" అన్నాడు.

రాణిముఖం విషాదంగా అయిపోయింది.

"మీరలా కూర్చోండి. ఆవిడ అన్నీ చెబుతుంది. ఈలోగా కాఫీ తీసుకువస్తాను" అంటూ లోపలకు వెళ్ళింది గౌరి.

"చాలా దురదృష్టకరమైన పరిస్థితుల్లో ఇరుక్కున్నాను నేను" అంది రాణి.

"ఏమిటవి?"

"నాకు తెలిసినంతవరకూ మా వారికి ఏ విధమైన వ్యసనాలూ లేవు. కానీ ఇప్పుడాయన ఓ హత్యానేరం మోపబడి పోలీసులకస్టడీలో వున్నారు."

"హత్యచేశాడా? ఎందుకు?" అన్నాడు సుబ్ర హ్మణ్యం తృళ్ళిపడి.

"చేయలేదని ఆయన అంటారు. ఆయన మాటలు నమ్మ దగ్గవేనని నాకు అనిపిస్తోంది. కానీ బలమైన సాక్ష్యాలు ఆయనకు వ్యతిరేకంగా వున్నాయి."

"మీ ఆయన హత్యచేశాడని అనుకుందాం. చేస్తే ఎందుకు చేశాట్ట?"

"అదే మరింత అవమానకరమైన సంఘటన. చెప్ప డానికి నోరు కూడా రావడంలేదు" అంది రాణి. ఈలోగా గౌరి కాఫీలు తీసుకుని వచ్చింది.

సుబ్రహ్మణ్యం నెమ్మదిగా రాణి దగ్గర్నుంచి రాబట్టిన వివరాలివి:

రాణి భర్త జగన్నాథం విఠలరావు భార్య సావిత్రితో అక్రమసంబంధం పెట్టుకున్నాడు. అందుకు సావిత్రి ప్రోత్సాహంకూడా వుంది.ఆవిషయం సావిత్రే ఒప్పుకుంది. విఠలరావుకీ విషయం తెలిశాక భార్యనూ, జగన్నాథాన్నీ కూడా తీవ్రంగా హెచ్చరించాడు. సావిత్రిని భయపడి జగన్నాథాన్ని రావద్దంది. ఆయితే అతను సావిత్రిని వదిలి పెట్టలేకపోయాడు. సావిత్రి యెంత బ్రతిమాలినా జగన్నాథం వినలేదు. అతన్ని వారించే శక్తిలేక సావిత్రి ఊరుకుంది.

ఒకరోజు విఠలరావు రహస్యంగా యింట్లో కాశాడు. జగన్నాథం వచ్చి సావిత్రితో మాటలు మొదలుపెట్టాక అతను బయటకు వచ్చాడు! గొడవ జరిగింది. జగన్నాథం విఠలరావును కత్తితో పొడిచి చంపేశాడు. సావిత్రిని భయపడవద్దని హెచ్చరించి విఠలరావు శవాన్ని ఓ సంచీలో వేసి మూటకట్టి అక్కణ్ణించి కదిలేడు.

సావిత్రి యీ హత్యను చూసి ఊరుకోలేక పోలీసులకు ఫిర్యాదు చేసింది. పోలీసులు రంగంలోకి దిగారు. విఠల

రావు శవం దొరకలేదు కానీ సావిత్రి చెప్పిన యితర విషయాలన్నీ నమ్మదగ్గవిగానే వున్నాయి.

"నాకు తెలిసినంతవరకూ ఆయన ప్రవర్తనలో లోపం వుండటానికి వీల్లేదు. ఆఫీసు, ఇల్లు తప్ప రెండో విషయం పట్టని మనిషి ఆయన" అంది రాణి కళ్ళు వత్తుకుంటూ.

రాణి పరిస్థితి విన్నాక చాలా జాలి కలిగింది సుబ్రహ్మణ్యానికి. అయితే ఈ పరిస్థితుల్లో రాణి వెతుక్కుంటూ తనవద్దకు ఎందుకు వచ్చిందో అతనికి అర్థంకాలేదు. అదే అతనామెను అడిగాడు.

"మా నాన్నగారు పోయాక నాకు మా యింటితో సంబంధం తెగిపోయింది. ఇద్దరన్నయ్యలు దూర ప్రాంతంలో వుంటున్నారు. ఒకడు నాకు దగ్గర్లోనే వుంటున్నా అంటీముట్టనట్టుంటున్నాడు. అక్కయ్యకేమో యీ కథ తెలిసీక నేను తన బంధువని చెప్పుకోవడమే అవమానంగా వుంది. ఇప్పుడు నన్నాదుకునేవారెవ్వరూ లేరు. ఈ వూళ్ళో ప్రముఖ డిటెక్టివ్ అప్పలస్వామిగారికి నా గోడు చెప్పుకుందామని వచ్చాను. నీదీ యీ వూరే కదా – ఈ విషయంలో నువ్వు నాకాస్త సాయపడక పోవనే ఆశతో మీ యింటికి వచ్చాను" అంది రాణి.

## 4

"మన భారతదేశంలో ఆడవాళ్ళతో వచ్చిన ఇబ్బంది యిదే. ప్రతి ఆడదీ తన భర్త ప్రవరాఖ్యుడనీ, శ్రీరామ చంద్రుడనీ అనుకుంటుంది. అలా తను నమ్ముతూ అందర్నీ నమ్మించాలనుకుంటుంది. మీరు చెప్పిన కథ వింటూంటే యిది చాలా హోప్‌లెస్ కేస్ అనితోస్తోంది" అన్నాడు అప్పలస్వామి.

"ఒకసారి మీరు ఏ కేసైనా చేపడితే దాని స్వభావం మారిపోతుంది. మీ సాయంలో జగన్నాథం బయట పడ తాడు" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"చూడండి సుబ్రహ్మణ్యంగారూ మనం యేదైనా కేసును చేపట్టడానికి రెండే రెండు కారణాలుంటాయి. ఒకటి డబ్బు, రెండోది మానవత్వం. ఈ కేసులో నాకు పెద్దగా డబ్బురాకదు. మానవత్వం సంగతంటారా–ముద్దాయి నిర్దోషి అని నాకు అనిపించడంలేదు" అన్నాడు అప్పలస్వామి.

"మీకు అలా తోచడం నా దురదృష్టం. కానీ కేవలం నేను చెప్పిన కథవిని ముద్దాయిపైన ఒక అభిప్రాయం ఏర్పరచుకున్నారు మీరు. కథలు వ్రాయడంలోవున్న చాతుర్యం చెప్పడంలో నాకు లేకపోవచ్చు. అందువల్ల మీరు కొంత ప్రిలిమినరీ ఇన్వెస్టిగేషన్ చేసి–కన్విన్సు అయిన పక్షంలోనే వ్రాసీడవండి."

అప్పలస్వామి సీరియస్‌గా సుబ్రహ్మణ్యంవంక చూసి "ప్రిలిమినరీ ఇన్వెస్టిగేషన్ను ఇనీషియేట్ చేయడానికి నా ఫీసు రెండువేలు" అన్నాడు.

సుబ్రహ్మణ్యం ఓక్షణం ఆలోచించాడు. దీనవదనంతో వున్న రాణి అతని కళ్ళముందు మెదలింది. ఆమె ఆర్థిక పరిస్థితి ఎటువంటిదో తనకు తెలియదు. ప్రిలిమినరీ ఇన్వెస్టిగేషన్ కరించి రెండువేలు తను ఇవ్వాడివ్వగలడు. ఆ డబ్బు రాణి ఇవ్వలేకపోయినా తను తట్టుకోగలను. ఎటొచ్చీ ఆ తర్వాత సంగతే తెలియదు.

"అలాగే మీరు ప్రారంభించండి" అన్నాడు సుబ్రహ్మణం.

"డబ్బు తీసుకురండి" అన్నాడు అప్పలస్వామి.

సుబ్రహ్మణ్యం నవ్వి "కూడా చెక్కు-బుక్కు తీసుకు

వచ్చాను. బ్యాంకులో నాకు బ్యాలన్సుందో లేదో ఫోన్ చేసి కనుక్కోండి'' అన్నాడు.

''అయితే చెక్కు రాయండి'' అన్నాడు అప్పల స్వామి.

సుబ్రహ్మణ్యం రెండువేలకు చెక్కు రాసి అప్పల స్వామికి అందించేక ''ఈ కేసులో నేను ప్రాసీడయేదీ లేనిదీ తెలియడానికి యెంతో సేపు పట్టదు. మీరు కూడా నాతో వస్తే అలా బ్యాంకుమీదుగా పోలీస్ స్టేషన్కు వెడదాం'' అన్నాడతను.

''హత్య జరిగిందీ వూళ్ళో కాదు'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

''అవుననుకోండి. కానీ కేసుకు సంబంధించిన కొన్ని పాయింట్సు డిస్కస్ చేయడానికి ఇన్స్పెక్టర్ రఘునాథ్ కొన్ని డాక్యుమెంట్సుతో సహా ఈ వూరు వచ్చాడు'' అన్నాడు డిటెక్టివ్ అప్పలస్వామి.

''ఈ వివరాలు మీకెలా తెలుసు?'' ఆశ్చర్యంగా అడిగాడు సుబ్రహ్మణ్యం.

''నేను అన్ని కేసులూ ఫాలో అవుతూ వుంటాను. అపరాధ పరిశోధనపట్ల ఆసక్తివల్ల కాదు. బిజినెస్. అంతే!'' అన్నాడు అప్పలస్వామి.

5

అప్పలస్వామి కార్లో యిద్దరూ బ్యాంకుకు వెళ్ళారు. చెక్కు మార్చుకున్నాక-యిద్దరూ కలిసి పోలీస్ స్టేషన్కు వెళ్ళారు.

''ఊరక రారు మహాత్ములు'' అంటూ ఇన్స్పెక్టర్ శంకరం అప్పలస్వామిని పలకరించాడు.

''డిటెక్టివ్లను మహాత్ములుగా గుర్తిస్తే మీ పోలీస్ శాఖకు యిబ్బందులు వుండవని హామీ యివ్వగలను.

ఊరక రాని వారందరూ మహాత్ములే అయితే మీరు గుర్తించినా గుర్తించకపోయినా నేను మహాత్ముడినే అవుతాను'' అంటూ నవ్వి "ఇన్‌స్పెక్టర్ రఘునాథ్ గారితో పనుండి వచ్చాను'' అన్నాడు అప్పలస్వామి.

"నేను మీకు తెలుసా? నేనిక్కడుంటానని యెలా ఊహించారు?'' అన్నాడు రఘునాథ్ అమితంగా ఆశ్చర్యపడుతూ.

"విశలరావు హత్యకేసు మీద నాకూ యింట్రస్టు వుంది. జగన్నాథాన్ని రక్షించాలని ఆశ. అందుకేమైనా అవకాశాలున్నాయేమో పరీక్షించాలని ఇక్కడకు వచ్చాను'' అన్నాడు అప్పలస్వామి.

రఘునాథ్ ముఖం అప్రయత్నంగా మారింది. ఇన్‌స్పెక్టర్ శంకరం అప్పలస్వామిని రఘునాథ్‌కు పరిచయం చేసి "అవులిస్తే పేవులు లెక్కపెట్టగల మనుషులుంటారని ఈయన్ని చూశాకనే నమ్మగలిగాను. నేరస్థుల్ని బయటపెట్టడంలోనూ, అమాయకుల్ని రక్షించడంలోనూ ఈయన సిద్ధహస్తులు. ఆ కారణంగా అప్పుడప్పుడు నన్ని బ్బందిలో పెట్టినా ఈయనంటే నాకు చాలా యిష్టం'' అన్నాడు.

తర్వాత అయిష్టంగానే రఘునాథ్ కేసుకు సంబంధించిన కొన్ని వివరాలు అప్పలస్వామికి చెప్పాడు. అప్పలస్వామి ఆ వివరాలన్నీ శ్రద్ధగా విన్నాడు. తర్వాత కేసుకు సంబంధించిన ఫోటోలు కొన్ని చూశాడు.

సావిత్రి ఫోటో చూసి "ఈమె చాలా అందంగా వుంది. ఈమె కోసం హత్య జరగడంలో ఆశ్చర్యం లేదు'' అన్నాడు.

జగన్నాథం, విశలరావుల ఫోటోలు చూశాక "హత్య

జరిగేక జగన్నాథం ఒంటిమీద గాయలేమైనా వున్నాయా?" అనడిగాడు అప్పలస్వామి.

"అటువంటిదేమీ లేదు. చాలా నేర్పుగా ఒకే ఒక్క కత్తిపోటుతో జగన్నాథం, విఠలరావుని గాయపరిచాడు" అన్నాడు రఘునాథ్.

"మీరు చెప్పినకథ ప్రకారం విఠలరావు యింట్లో వున్నట్లు జగన్నాథానికి తెలియదు. అతను స్వేచ్ఛగా సావిత్రితో గడుపుదామని వచ్చాడు. అటువంటప్పుడు హఠాత్తుగా బయటకు వచ్చిన విఠలరావే జగన్నాథాన్ని హత్యచేయడానికిగానీ, గాయపర్చడానికిగానీ అవకాశముంటుంది. హత్యాయుధమంటూ వుంటే అది విఠలరావు దగ్గరే వుండడానికి అవకాశముంది. ఎందుకంటే యీ వ్యవహారంవల్ల నష్టపోతున్నది విఠలరావు మాత్రమే! ఆవేశం అతనిలోనే ఎక్కువగా వుండాలి. అటువంటప్పుడు జగన్నాథం ఏ మాత్రమూ గాయపడకుండా విఠరావునెలా హత్య చేయగలిగాడు? ఎక్కడో ఏదో లోపముంది?"

రఘునాథ్ నవ్వి "సావిత్రిపై జగన్నాథానికున్న కాంక్ష అటువంటిది. విఠలరావు హెచ్చరించాక అతను తనవద్ద ఎప్పుడూ కత్తిని ఉంచుకుంటున్నాడు. అవసరమైతే విఠలరావును చంపి అయినా సావిత్రి పొందును శాశ్వతం చేసుకోవాలని అతననుకుంటున్నాడు" అన్నాడు.

"అయితే ఈ ఫోటోలు చూడండి. విఠలరావు చూడ్డానికి పహిల్వాన్ లాగున్నాడు. జగన్నాథం బక్కపలచగా వున్నాడు. చేతిలో కత్తి వున్నప్పటికీ జగన్నాథంలాంటి మనిషి తను గాయపడకుండా విఠలరావును హత్యచేయడం అసాధ్యమని నా అభిప్రాయం" అన్నాడు

అప్పలస్వామి.

"అయితే యేం జరిగిందంటారు?" అన్నాడు రఘునాథ్.

"నేను డిటెక్టివ్‌నే కానీ జ్యోతిష్కుణ్ణి కాను" అన్నాడు అప్పలస్వామి.

"ఒప్పుకున్నారు కదా...అయితే వినండి. జగన్నాథం కంటె సన్నటి మనుషులు, విఠలరావు కంటె బలమైన మనుషుల్ని అవలీలగా పొడిచిన సందర్భాలున్నాయి. అటువంటి కొన్ని కేసులు నా హయాంలోనే వచ్చాయి" అన్నాడు రఘునాథ్.

"నావంటివాళ్ళు కలగజేసుకోనప్పుడు అమాయకు లెందరో శిక్షలపాలవుతూవచ్చారు. అందువల్ల పోలీసులు అమాయకుల్నే నేరస్థుల్ని చేస్తారని నేనంటే ఎంత అసం దర్భంగా వుంటుందో-జగన్నాథం విఠలరావును అవలీలగా చంపగలిగేడన్న విషయమూ అంత అసందర్భంగానే వుంటుంది. కావాలంటే యిక్కడ ప్రఖ్యాత రచయిత సుబ్రహ్మణ్యంగారున్నారు. ఈ విషయంలో ఆయన అభి ప్రాయం తీసుకుందాం" అంటూ అప్పలస్వామి వారిద్దరి ఫోటోలనూ సుబ్రహ్మణ్యానికి చూపించాడు.

సుబ్రహ్మణ్యం ఆ ఫోటోలవంక చూసి వులిక్కిపడ్డాడు. ఆ ఫోటోలోని విఠలరావును అతను ఎక్కడో చూశా డనిపించింది. స్పష్టంగా అతని కళ్ళముందు ఏదో దృశ్యం కదలాడుతోంది.

"ఇందులోని విఠలరావు ఫోటో యేది?" అనడిగాడు సుబ్రహ్మణ్యం.

అప్పలస్వామి చూపించాడు.

"మైగాడ్. ఈ విఠలరావు హంతకుడు" అన్నాడు సుబ్రహ్మణ్యం అప్రయత్నంగా.

"మీకు మాటలు తడబడుతున్నాయి. విఠలరావు హంతకుడు కాడు. హతుడు," అన్నాడు రఘునాథ్.

సుబ్రహ్మణ్యం యేదో చెప్పబోతూండగా అప్పల స్వామి అందుకుని "ఈ రెండు ఫోటోలనూ చూసిన వారెవరైనా విఠలరావునే హంతకుడనుకుంటారు. అందులో సుబ్రహ్మణ్యంగారి తప్పేమీ లేదు. ఎటొచ్చీ నాకు జగన్నాథం నిర్దోషి అన్న అనుమానం తగిలింది. నేనీ కేసు టేకప్ చేస్తున్నాను. బహుశా అనుకున్నది సాధించగలననుకుంటాను" అన్నాడు.

## 6

"పోలీసుల ముందు నోరుజారడం మంచిది కాదు. ఇప్పుడు చెప్పండి. విఠలరావు గురించి మీకేమో తెలుసు. అతను హంతకుడని యెందుకన్నారు?" అన్నాడు అప్పలస్వామి.

సుబ్రహ్మణ్యం ఓ క్షణం తటపటాయించి సినీ డైరెక్టర్ ఆనంద్ తనను తీసుకువెళ్ళి చూపించిన నాలుగురీళ్ళ విషయం చెప్పాడు.

అప్పలస్వామి ముఖం గంభీరంగా అయిపోయింది. "అయితే అందులో మీరు చూసినది విఠల్ రావునే నంటారు?" అన్నాడు.

"అందులో సందేహమేమీ లేదు. క్రూరత్వాన్ని చిందించే ఆ భయంకర ముఖం నా మనసులో చెరగని ముద్ర వేసుకుంది. ఆనంద్ నాకు చూపించిన సన్నివేశం నిజంగా జరిగినట్లుంది తప్పితే నటనలా లేదు. ఆ సన్నివేశం చూసి అతను కూడా అమితంగా కలవరపడ్డాడు."

"ఆనంద్ దగ్గరకు నేను వెడితే అతనది నాకు చూపిస్తాడా?"

"చెప్పలేను. అనుకోనిది జరిగించనీ తను చిత్ర

నిర్మాణాన్ని వాయిదా వేసుకున్నాననీ ఆ రీలు జాగ్రత్తగా చూశాక నే అన్నాడతను. ఇందులో యేదో మిస్టరీ వుందని నాకు అనిపిస్తోంది."

అప్పలస్వామి వింటూనే ఆలోచిస్తున్నాడు. సామాన్యుడైన విఠలరావు, నటనాజీవితంలో ఏ విధమైన సంబంధములేని విటల్ రావు_దర్శకుడు ఆనంద్ తీసిన ఫిల్ములోకి ఎలా వచ్చాడు? అదీ ఒక హత్యచేస్తూ! ఆ హత్య నిజమైనదా_లేక నటనా?

ఈ ప్రశ్నలకు జవాబు సంపాదించాలంటే ఆనంద్ ను కలుసుకుని మాట్లాడాలి. అందుకుముందు ఒక పర్యాయం హత్య జరిగిన ఊరుకు వెళ్ళి హత్య జరిగిన పరిసరాలను పరిశోధించాలి.

"మీరిక వెళ్ళవచ్చు. నా ప్రయత్నాలు నేనారంభిస్తాను" అన్నాడు అప్పలస్వామి.

"చాలా థాంక్స్. నా స్నేహితురాలి కుటుంబాన్ని నిలబెట్టగలరని ఆశిస్తున్నాను" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"మనిషి ప్రాణాలకు విలువ కట్టలేము. ఇప్పటికే మీ వద్దనుంచి నాకు రెండువేల రూపాయలు ముట్టాయి. జగన్నాథం ప్రాణాలను నేను రక్షించగలిగినట్లయితే మరో ఎనిమిదివేలు ఎలాగో అలా సిద్ధంగా వుంచమని మీ స్నేహితురాలికి చెప్పండి" అన్నాడు అప్పలస్వామి.

సుబ్రహ్మణ్యం వెళ్ళిపోయాక అతను భార్యను పిలిచి "అర్జంటు పనిమీద నేను ఊరికి వెడుతున్నాను. ఇది మరీ ఎక్కువ డబ్బులొచ్చే కేసుకాదు కాబట్టి మన కారు తీసుకువెళ్ళడం లేదు. బస్సులో వెళ్ళి బస్సులో వచ్చేస్తాను" అన్నాడు.

"మీరు పిసినిగొట్టుతనం కాస్త తగ్గించుకుంటేగానీ కేసులు త్వరగా పూర్తికావు. కేసులు త్వరగా పూర్తయితే

కానీ తప్పు వకాలంలో ఎక్కువ కేసులు, ఎక్కువ డబ్బు సంపాదించలేము" అంది అప్పలస్వామి భార్య లలిత.

"సరే నా పిసినిగొట్టుతనంవల్లనే కదా నువ్వు చేతి నిండా బంగారు గాజులు వేసుకుని, ఇంట్లో కూడా పట్టు చీరలు కడుతున్నావు" అని నవ్వాడు అప్పలస్వామి.

7

"నమస్కారం రండి, కూర్చోండి" అంది సావిత్రి.

"మీరు నాకు చాలా నచ్చారు" అన్నాడు అప్పలస్వామి.

"ఎందుకని?" అడిగింది సావిత్రి.

"భర్తపోయిన దుఃఖంలో వున్న మిమ్మల్ని పలకరించడంకోసమని నేను అరడైరెండుసార్లు రిహార్సల్సు వేసుకున్నాను" అన్నాడు అప్పలస్వామి.

"భర్తపోవడం నాకు దుఃఖాన్ని కలిగించలేదు. ఆ విషయాన్ని నేను పోలీసులక్కూడా చెప్పాను. నా భర్త నన్నెప్పుడూ సుఖపెట్టలేదు. ఆయనకు చాలా దురలవాట్లున్నాయి. కోర్టుద్వారా విడాకులు తీసుకుందామని కూడా అనుకుంటున్న తరుణంలో ఈ హత్య జరిగింది. మనిషిపై ఎంత ద్వేషమున్నా హత్యచేయాలని నేనెన్నడూ అనుకోలేను. ఒక నిండుజీవితాన్ని అంతంచేసే అధికారం ఏ మనిషికీ లేదని నేననుకుంటాను. అలాగే నేనెంతగా ప్రేమించిన మనిషి అయినా సరే-హంతకుడైతే అతన్ని అసహ్యించుకోకుండా ఉండలేను. ఒక నిండు ప్రాణాన్ని అంతం చేసిన వ్యక్తి క్షమార్హుడు కాడని నేననుకుంటాను" అంది సావిత్రి.

"మీ అభిప్రాయాలతో నేనూ ఏకీభవిస్తాను. నిర్దోషికి శిక్షపడితే నేను సహించలేను. అలా శిక్షపడ్డానికి తప్పుడు సాక్షాలు చెప్పినవాళ్ళనైతే మొదలే క్షమించలేను.

అన్నట్లు జగన్నాథం మీ భర్తను హత్య చేశాడనడానికి మీరు ప్రత్యక్షసాక్షి కదూ?" అన్నాడు అప్పలస్వామి.

సావిత్రి తడబడింది—"అవును" అంది నెమ్మదిగా.

"ఏం జరిగిందో చెప్పగలరా?"

సావిత్రి వర్ణించింది.

"మీరు చూశానంటున్నారు కాబట్టి నమ్మకతప్పదేమో కానీ ఇది కట్టుకథలా అనిపిస్తోంది. ఏమంటారు?" అంటూ అప్పలస్వామి ఈ హత్యవిషయంలో తనకుగల అనుమానాలు బయటపెట్టాడు.

సావిత్రి అవన్నీ విని యిబ్బందిగా ముఖంపెట్టి "మీరన్నది నిజమే! కానీ నా కళ్ళముందు జరిగిన నిజమిది" అంది.

"జరిగితే జరిగిందికానీ మీరీ విషయం పోలీసులకు చెప్పకుండా వుండాల్సింది. ఎందుకంటే జగన్నాథం చేతిలో కాకపోయినా మీ భర్త ఎలాగూ చావవలసినవాడే! హంతకుణ్ణి చంపిన జగన్నాథం పెద్ద నేరస్థుడని నేననుకోను" అన్నాడు అప్పలస్వామి.

"నా భర్త హంతకుడా-ఎవరన్నారు?" అంది సావిత్రి.

"నీ భర్త చేసిన ఒక హత్యకు నేను ప్రత్యక్షసాక్షిని" అన్నాడు అప్పలస్వామి.

"అబద్ధం" అంది సావిత్రి.

అప్పలస్వామి, విశాలరావు ఎలా హత్య చేశాడో వర్ణించి చెప్పి "నువ్వు చెప్పింది కట్టుకథ కాదనడానికి అవకాశమున్నది కానీ దీనికి లేదు" అని "జగన్నాథాన్ని నిర్దోషిగా నిరూపించడానికి ప్రయత్నిస్తున్నాను. నీ జాగ్రత్తలో నువ్వుండటం మంచిది" అన్నాడు.

సావిత్రి తెల్లబోయి అతనివంక చూసి "మీరేమంటున్నారో నాకు తెలియడం లేదు" అంది.

"జగన్నాథంలాంటి సాధుజంతువుకు నీతో ఎఫైర్ వున్నదంటే ఎవ్వరూ నమ్మడం లేదు. ఆఖరికి నేను కూడా" అన్నాడు అప్పలస్వామి.

"నిజం తెలిసేవరకూ అందరూ సాధువుల్లాగనే వుంటారు. దొరకనంత మాత్రాన అందరూ దొరలైపోరు. వాళ్ళలో ఎందరో దొంగలుంటారు" అంది సావిత్రి.

"అదే—ఆ విషయం చెబుదామనే వచ్చాను. వస్తాను" అన్నాడు అప్పలస్వామి.

# 8

అప్పలస్వామి యింట్లో కూర్చుని కేసు గురించి ఆలోచిస్తున్నాను.

సావిత్రి సామాన్యురాలు కాదు. ఏదో నాటకమాడుతోంది. జగన్నాథానికేమైందో తెలియదు. తను నిర్దోషినని చెప్పడం మినహా అతనింకేమీ వివరాలివ్వడంలేదు. అందువల్ల నువ్వు ఉరికంబం ఎక్కే ప్రమాదమున్దన్నా అతను బెదిరిపోవడంలేదు. అతనీ విధంగా ప్రవర్తించడానికేదో బలమైన కారణమే వుండివుండాలి.

చుట్టుపక్కలవాళ్ళు చెప్పినదాన్నిబట్టి జగన్నాథం నిజంగానే సాధువు. అది అబద్ధమైన పక్షంలో అతను గుండెలుతీసిన బంటు అయుండాలి. జగన్నాథంతో ఒక పర్యాయం మాట్లాడివచ్చేక అతన్ని గుండెలు తీసినబంటు అనుకునేందుకు అతనికి మనస్కరించలేదు.

ఈ కేసులో విచిత్రమైన విషయం శవం లేకపోవడం. హత్యకావలసిన అన్ని ఆధారాలూ వున్నాయి శవం తప్ప! జగన్నాథాన్ని అడిగితే ఏమీ చెప్పడు నిర్దోషిననడం మినహాయించి.

ఆనంద్‌ని కలుసుకుని మాట్లాడితే తప్ప కొన్ని ప్రశ్నలకు జవాబులు లభించవని అప్పలస్వామికి తోచింది.

అతను ఆనంద్‌ను కలుసుకున్నాడు.

ఆనంద్ మొదట తనకు యేమీ తెలియదన్నాడు. ఎవరో అతనికి తప్పుడు సమాచారమిచ్చారని దబాయించాడు. అయితే అప్పలస్వామి అతన్ని బాగా బెదిరించాడు. తన పేరు పోలీస్ స్టేషన్‌కి వెడితే పరువు ప్రతిష్ఠలకు భంగమవుతుందని ఆనంద్ భయపడ్డాడు. ఆఖరుకు తనవద్ద ఆ రీల్సు వున్నట్లు ఒప్పుకున్నాడు.

ఆనంద్ ఆధ్వర్యంలో ఆ నాలుగు రీళ్ళూ చూశాడు. నాల్గవరీలును అతను మరింత శ్రద్ధగా చూశాడు.

"ఇది సినిమాకోసం తీసినది కాదు. మీరు తీసిన నాలుగు సంఘటనలూ-ఆ సన్నివేశంలోని పాత్రధారులకు తెలియకుండా తీయబడ్డాయి. లేనిపక్షంలో అవి అలా వచ్చివుండేవి కావు" అన్నాడు అప్పలస్వామి.

"మీరు ఎలా అనుకున్నా నాకు అభ్యంతరం లేదు" అన్నాడు ఆనంద్.

"అయితే విఠల్ రావ్ చేసిన హత్యను మీరు ఎలా చిత్రీకరించారో నాకు చెప్పాలి" అన్నాడు అప్పలస్వామి.

ఆనంద్ క్షణం సందేహించి "నావద్ద స్పెషల్ ఇంఫ్రారెడ్ కెమేరా వుంది. దాన్ని నేను ఆయా స్థలాల్లో రహస్యంగా వుంచి ఈ పాట్సు తీసాను" అన్నాడు.

"అంతవరకూ బాగానే వుంది. హోటల్లోనూ, సందులోనూ జనసంచారం ఎప్పుడూ వుంటుంది. కానీ దంపతులకు సంబంధించినదీ, హత్యకు సంబంధించినదీ మీరు స్వయంగా చూస్తూ ఫిల్మ్ చేసివుండాలి. మరోవిధంగా అది సాధ్యపడదు. అనగా హత్యకు మీరు ప్రత్యక్ష సాక్షులన్నమాట" అన్నాడు అప్పలస్వామి.

"కాదు మీరు పొరపడ్డారు" అన్నాడు ఆనంద్.

"ఏ విధంగా?"

"నా దగ్గర స్పెషల్ ఇంటెగ్రేటెడ్ కెమెరా వుందని చెప్పానుగా! దాన్ని రహస్యంగా ఎక్కడైనా అరేంజ్ చేసే మనుషులెవరైనా దాని రేంజ్‌లోకి రాగానే ఆటోమేటిక్‌గా స్టార్టవుతుంది.

మా యింటికి బాగా దూరపు బంధువులొచ్చాయి ఒకడు భార్యతో వచ్చాడు. అప్పుడతనికిచ్చిన బెడ్రూంలో ఈ కెమెరా ఏర్పాటు చేశాను. వాళ్ళూళ్ళోకి వెళ్ళి తిరిగి రాగానే వాళ్ళను బెడ్రూంలోకి వెళ్ళకుండా కబుర్లతో ఎంగేజ్ చేసి బాగా ఆలస్యంచేసి పడుకోడానికి వెళ్ళనిచ్చాను. వాళ్ళు గదిలోకి వెళ్ళగానే కెమెరా ఆటోమేటిక్‌గా స్టార్టవుతుంది. అలా మొదటి పదినిముషాలూ జరిగిన వివరాలు సినిమాక్రింద వచ్చింది.

ఇందులో నాకు దురుద్దేశ్యమేమీ లేదు. సాధారణంగా సినిమాల్లో చూపే బెడ్రూం సీన్సు అసహజంగా వుంటున్నాయి. ఆ తేడాను తెరమీదనే చూసి అవసరమైన మార్పులు చేయాలని ఈ పద్ధతి ఎన్నుకున్నాను. ముందుగా తెలిస్తే ఎవరూ దీనికి ఒప్పుకోరు. ఒప్పుకున్నా సహజత్వముండదు."

"మరి హత్యవిషయం?" అన్నాడు అప్పలస్వామి.

"అది నిజంగా హత్యే!" అన్నాడు ఆనంద్. "నేను కెమెరా ఏర్పాటుచేసిన ఆ ఆవరణ నేరాలకు ప్రసిద్ధి. నిజమైన నేరాలు ఎలావుంటాయో తెరమీద చూడాలన్న కుతూహలంతో ఆ యేర్పాటుచేసేను. అనుకోకుండా నా కెమెరా ఒకహత్యను రికార్డుచేసింది. నేనుచాలా అప్సెట్ అయ్యాను. అది హత్యకు సంబంధించినదని తెలుసు. కానీ పోలీసులవద్దకు వెళ్ళి విషయం చెబితే నా ట్రేడ్ సీక్రెట్ బయటపడిపోతుంది. అలా జరగడం నాకిష్టం లేదు."

"అయాం సారీ మిస్టర్ ఆనంద్! మీ సీక్రెట్ ట్రేడ్ బయటపెట్టడం నా అభిమతం కాదు. ఒక అమాయకుణ్ని రక్షించటంకోసం మీ సహాయాన్నపేక్షించి వచ్చాను. ఈ విఠల్ రావు పరమ కిరాతకుడని అర్థమయింది. ఇది జగన్నాథం శిక్షను చాలావరకూ తగ్గించగలదు. ఆ దృశ్యంలో హత్యకాబడిన వ్యక్తి ఎవరో అది ఏ తేదీన జరిగిందో వివరాలు తెలిస్తే—ఎవరికీ తెలియని ఒక హత్యను మనం బయటపెట్టవచ్చును..." అన్నాడు అప్పలస్వామి.

ఆనంద్ తన డైరీతీసి అప్పలస్వామి అడిగిన వివరాలనిచ్చాడు. ఆ వివరాలు వింటూనే అప్పలస్వామి వులిక్కిపడి "మైగాడ్! జగన్నాథం చేతిలో చచ్చిన మూడు రోజులకు విఠల్ రావు ఈ హత్యచేశాడు" అన్నాడు.

# 9

"శంకరంగారూ — మీరు నాకో చిన్న సాయం చేయాలి" అన్నాడు అప్పలస్వామి జేబులో చేయిపెట్టి.

"అడగండి. నాకు చేతనయినది చేస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శంకరం.

"ఈ ఫోటోలోని వ్యక్తి ఎవ్వరో చెప్పగలరా?"— అన్నాడు అప్పలస్వామి ఒకఫోటోను శంకరానికందిస్తూ.

శంకరం ఆ ఫోటోనుచూసి ఉలిక్కిపడి, "ఏ సందర్భంలో ఈ వ్యక్తి మీకు తటస్థపడ్డాడు?" అని అడిగాడు.

"అంటే ఇతను మీకు తెలుసన్నమాట?" అన్నాడు అప్పలస్వామి. అతని కళ్ళు మెరిసాయి.

"మీకు ఎలా తెలుసో చెప్పాలి?" అన్నాడు శంకరం.

"నేనితన్ని చూడలేదు. చూసే అవకాశంకూడలేదు. అతను చచ్చిపోయాడు. అంటే సహజంగాకాదు. హత్యచేయబడి" అన్నాడు అప్పలస్వామి.

"వాట్!" అన్నాడు శంకరం.

అప్పలస్వామి చిన్నగా నవ్వి, "ఇత నెవరో చెప్ప గలరా?" అన్నాడు.

"మీరు నాకు మరికొన్ని వివరాలు చెబితేగానీ ఏమీ చెప్పలేను. ఇతన్ని గురించి మీకు తెలిసినదంతా చెప్పండి" అన్నాడు శంకరం.

"ఈ వూళ్ళో మీకు తెలిసిన ఓ ప్రసిద్ధ ప్రాంతముంది. దాని పేరు దెయ్యాలదిబ్బ. అది దిబ్బకాదు కానీ అక్కడ పెంటకుప్పలుంటాయి. దెయ్యాలుండవు కాని అలాంటి మనుషులు అప్పుడప్పుడు అక్కడికి వెడుతుంటారు. ఈ ఫోటోలోని మనిషి ఒకపర్యాయం అక్కడికెళ్ళి హత్య చేయబడ్డాడు. అంతే నాకు తెలిసింది..." అన్నాడు అప్పలస్వామి.

"ఎవరతన్ని హత్య చేశారు?"

"విఠల్ రావు..."

"ఏ విఠల్ రావు?"

"ఆ మధ్య ఇన్ స్పెక్టర్ రఘునాథ్ మీ దగ్గరకొచ్చేడు గదా..."

"అంటే జగన్నాథం చేతిలో హత్యకాబడ్డ విఠల్ రావు..."

"అవును ఆ విఠల్ రావే హత్య చేశాడు."

"ఒక్క క్షణం వుండండి" అంటూ ఇన్ స్పెక్టర్ తన డ్రాయరుసొరుగుతీసి ఏదో పుస్తకంతీసి చదువుతున్నాడు. "మా పోలీసుల మెదళ్ళలో తేదీలు ముద్రించుకుని వుంటాయి. విఠల్ రావు చనిపోయిన మరుసటి రోజున ఇతను నన్ను కలుసుకున్నాడు."

అప్పలస్వామి నవ్వి "ఇంకా ఖచ్చితంగా చెప్పమంటే తను చనిపోయిన మూడురోజులకి విఠల్ రావు ఈ మనిషిని

హత్య చేశాడు. ఈ విషయాన్ని నేను ఋజువు చేయగలను" అన్నాడు.

శంకరం చిత్రంగా అప్పలస్వామి వంక చూసి—
"ఋజువు తీసుకుని నా దగ్గరకు రండి. తప్పకుండా నమ్ముతాను" అన్నాడు.

"అలాగే కానీ—ఇత నెవరో నాకు చెప్పలేదు."

"ఏదో ముఠాకు సంబంధించిన కొన్ని వివరాలు పోలీసులకు చెప్పడానికి వచ్చాడు."

"చెప్పాడా?"

"లేదు...తర్వాతనుంచీ కనబడ్డంలేదు."

"వీలయినంత రహస్యంగా దెయ్యాలదిబ్బ దగ్గర అన్వేషించండి. ఇత గాడి శవం దొరకవచ్చును" అన్నాడు అప్పలస్వామి లేచి నిలబడుతూ.

"మీ పరిశోధన మా సమస్యలను పరిష్కరించాలి గానీ, మరిన్ని చిక్కులు తెచ్చిపెట్టకూడదు" అన్నాడు శంకరం.

"ఉష్ణం ఉష్ణేన శీతలం—" అని ఆక్రోశించి వెళ్ళిపోయాడు అప్పలస్వామి.

# 10

దెయ్యాలదిబ్బ దగ్గర పెంటకుప్పల అడుగున పోలీసులకు ఓ శవం దొరికింది. అదృష్టవశాత్తూ అదింకా గుర్తుపట్టగల పరిస్థితిలోనే వుంది. ఫోటో సహాయంతో ఒక్క రోజులో ఆ శవం ఎవరిదో తెలిసింది.

సాధారణ మధ్యతరగతి కుటుంబీకుడు పరంధామయ్యగారి రెండో అబ్బాయి శివరావుది ఆ శవం. పరంధామయ్యగారి అంచనా ప్రకారం వారి అబ్బాయి బొంబాయిలో వుండాలి. బొంబాయినుంచి కొడుకు ఉత్తరం కోసం యెదురుచూస్తున్న ఆయనకు ఆ ఊళ్ళోని దెయ్యాల

దిబ్బ దగ్గర కొడుకు శవం దర్శన మిచ్చేసరికి దుఃఖాన్ని తట్టుకోలేక పోయాడు.

రెండురోజులు అప్పలస్వామి ఆయన్ని దుఃఖానికి వదిలి పెట్టి మూడోరోజున వెళ్ళి కాసిని ఉపశమన వాక్యాలు పలికి "మీ అబ్బాయి దేశానికి మహోపకారం చేయ బోయి తన ప్రాణాలమీదికి తెచ్చుకున్నాడు. అందుకు నాకెంతో బాధగావుంది. శివరావును హత్యచేసిన దుర్మా ర్గుడు ఎవరో నాకు తెలుసు. అయితే అతనెందుకు హత్య చేశాడో తెలియదు. మీ అబ్బాయిగురించి మీకు తెలి సింది చెప్పండి" అన్నాడు.

రెండు సంవత్సరాలుగా శివరావు నిరుద్యోగి. ఇంట్లో ఆర్థికమయిన ఇబ్బందులున్నాయిగానీ మరీ పస్తులుండ వలసి వచ్చేటంత అధ్వాన్నంగా లేదు పరిస్థితి. ఆయిదారు మాసాలుగా శివరావు ఇంటికి ఆర్థికంగా సహాయ పడు తున్నాడు. తన స్నేహితుడికి వ్యాపారంలో సాయపడు తున్నాననీ—త్వరలో బొంబాయి వెడతాననీ చెప్పాడు. హత్య జరగడానికి ఒకరోజు ముందు కాబోలు అతను బొంబాయికని బయల్దేరాడు.

"క్షేమంగా చేరినట్లు ఉత్తరం వస్తుందనుకున్నాను గానీ, ఇలా చావు కబురు వస్తుందనుకోలేదు" అంటూ ఆయన మళ్ళీ దుఃఖంలో మునిగిపోయాడు. ఆయన్ను శోకసాగరంనుంచి తేల్చి మరికొన్ని వివరాలు రాబట్ట డానికి అప్పలస్వామికి చాలాసేపు పట్టింది. అతనికి ముఖ్యంగా కావలసిన వివరం, శివరావు వ్యాపారములో ఏ స్నేహితుడికి సహాయపడ్డాడూ అన్నది.

శివరావు స్నేహితుడి పేరు విఠల్ రావని చెప్పాడు.

11

"మిస్టర్ జగన్నాధం హత్యానేరాన్ని ఒప్పుకున్నాడు. అంతు తెలియని ఆవేశం తనచేత ఆ పని చేయించిందనీ శవాన్ని ముక్కలు చేసి మూటకట్టి నదిలో పారవేశాననీ అంగీకరించాడు. అతని భార్య రాణి ఈ కేసునుంచి మిమ్మల్ని విరమించుకోవలసిందిగా కోరింది—" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"రాణి కోరికను తెలియజేయడానికి మీరిక్కడకు వచ్చారా?" అన్నాడు అప్పలస్వామి.

"అవును—" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"అయితే వినండి. చెబుతున్నాను. జగన్నాధం నిర్దోషి. ఆ విషయాన్ని అతి త్వరలోనే నేను ఋజావు చేయబోతున్నాను. ఈ పరిస్థితుల్లో నేను కేసునుంచి ఎలా విరమించుకునేది?"

"జగన్నాధం తనకు తానే నేరాన్ని ఒప్పుకుంటే మీరేమి చేయగలరు?"

అప్పలస్వామి—"అతనాడిన అబద్ధానికి కారణమైన పరిస్థితులను బయటపెట్టి—పోలీసులకు తప్పుడు స్టేట్మెంట్ ఇచ్చిన అతని నేరానికి శిక్షపడకుండా ఆప గలను."

సుబ్రహ్మణ్యం ఆశ్చర్యంగా అప్పలస్వామివంక చూసి, "చాలా నమ్మకంగా చెబుతున్నారు. జరిగేపనే అంటారా?"

"చూడండి మిస్టర్ సుబ్రహ్మణ్యం. నాకు కేసు అప్ప గించడం వరకే మీ వంతు. దాని అంతు చూసేకనే నేను ఆగుతాను. విజయం సాధించానా—నాఫీజు వసూలు చేయక మానను. నాకై నేనే ఈ కేసును పరిశోధిం చాను గదా అని డబ్బు యెగవేస్తే ఊరుకోను. రాణి

ఇప్పుడు ఇక్కడ లేదనుకుంటాను. నేనే వెళ్ళి ఆమెను స్వయంగా కలుసుకుంటాను” అన్నాడు అప్పలస్వామి.

అతని మాటలకు యేం జవాబు చెప్పాలో తెలియక సుబ్రహ్మణ్యం అక్కడ్నించి వెళ్ళిపోయాడు. తర్వాత అప్పలస్వామి స్వంతకార్లో డ్రయివ్ చేసుకుంటూ రాణి ఊరువెళ్ళి ఆమెను కలుసుకున్నాడు.

“మీకు చాలా శ్రమ యిచ్చాను. మన్నించండి—” అంది రాణి.

“మన్నించాను. నేను చెప్పేది వినండి—” అన్నాడు అప్పలస్వామి. “మీ ఆయన నిరపరాధి. ఆ విషయం ఋజువు చేయడానికి అనువయిన సాక్ష్యాలు నా దగ్గర వున్నాయి. కాబట్టి కేసు వదులుకో నక్కరలేదు.”

రాణికళ్ళు ఆశగా మెరిసినా అంతలోనే ఆ మెరుపు మాసిపోయింది. “మా విషయం మర్చిపొండి. ఆయన నేరం చేసినట్లు స్వయంగా ఒప్పుకున్నారు” అంది.

“అంతేగదా—అందుకారణం చెబుతాను. ఈహత్య కేసుకు సంబంధించిన మనుషులు మిమ్మల్ని అవమానాలకు గురిచేస్తామని బెదిరించి వుంటారు. హత్య కేసుల్లో యిది సర్వ సాధారణం. కాబట్టి మీరేమీ భీతి చెందనక్కర్లేదు. మీకు ఈ అప్పలస్వామి రక్షణ లభిస్తోంది. మీ వంటి మీద ఈగకూడా వాలదు. ఇప్పుడు చెప్పండి. మీ ఆయన ప్రాణాలు రక్షించగల శక్తి నాకుంది. రక్షించ మంటారా?” అన్నాడు అప్పలస్వామి.

రాణి చటుక్కున అప్పలస్వామి పాదాలమీద వ్రాలి “మీరు దైవస్వరూపులు. నా భర్తకు మించిన పెన్నిధి లేదు నాకు. ఒకరికొకరంగా ఇంతకాలం బతుకుతున్నాం. మీరాయన్ని రక్షిస్తే అంతకంటే ఇంకేమీ కోరుకోను” అంది.

అప్పలస్వామి ఇబ్బందిగా వెనక్కు కదిలి "మనుషుల్లో రాక్షసులూ వుండరు. దేవుళ్లూ వుండరు. పరిస్థితులే వాళ్ళనలా తయారుచేస్తాయి. నేను దేవుణ్ణికాను. దైవస్వరూపుణ్ణి కాను. నేనే దేవుణ్ణయితే కొందర్ని శిక్షించడమూ, కొందర్ని రక్షించడమూ ఎందుకు జరుగుతుంది. మంచివాళ్ళను ఆపదల పాలుకాకుండా కాపాడినట్లే చెడ్డవాళ్ళ ప్రవర్తనను సరిచేసి మనసు మార్చగలగాలి. నేను పరిశోధనకు దిగాకనే మీ ఆయనకు బెదిరింపు అందింది. అంటే నేను దుర్మార్గులను సంస్కరించడానికి బదులు రెచ్చగొడుతున్నాననేమాట!" అప్పలస్వామి అన్నాడు.

రాణి త్వరగా అతనితో బయల్దేరడానికి ఓ సూట్‌కేసులో బట్టలు సర్దుకుని వచ్చింది.

అప్పలస్వామి పోలీసు స్టేషన్‌కు వెళ్ళి ఇన్‌స్పెక్టర్ రఘునాథ్‌కు రాణిని అప్పజెప్పి క్లుప్తంగా విషయం చెప్పి, "హత్యానేరం ఒప్పుకున్న జగన్నాథంతో కాసేపు మాట్లాడే అవకాశం నాకు ఇవ్వాలి మీరు" అన్నాడు.

"ఎందుకు?" అన్నాడు రఘునాథ్.

"మీ ఉద్దేశ్యం, నా ఉద్దేశ్యంకూడ నిర్దోషులను కాపాడటమే కదా. అటువంటప్పుడు నేను మీకు సహకరిస్తానంటే, నా సహకారం వద్దంటారా?" అన్నాడు అప్పలస్వామి.

"వద్దనను" అన్నాడు రఘునాథ్. సులభంగా పరిష్కారమయ్యే కేసుల్లో డిటెక్టివ్‌ల జోక్యం మంచిది కాదని అనుభవజ్ఞుడయిన అతని కొలీగ్ చెబుతుండేవాడు. కానీ అందమయిన రాణిముఖం, ఆర్ద్రమయిన ఆమెకళ్ళు చూసి, ఆమె తరఫున వచ్చిన అప్పలస్వామిని వారించాలని అతననుకోలేక పోయాడు. జగన్నాథం నిర్దోషి అని

తేలితే బాగుండునని ఆ క్షణంలో అతనికి అనిపించింది. ఇదివరలో అతను రాణిని చూసినా—ఒక సాక్షిగా తప్ప ఆడదిగా పరికించలేదు.

అప్పలస్వామి, జగన్నాథాన్ని కలుసుకుని "మిస్టర్ జగన్నాథం. మరోసారి నాగురించి చెప్పుకుంటున్నాను. నాపేరు డిటెక్టివ్ అప్పలస్వామి. విఠల్ రావు హత్య కేసును నేనే పరిశోధిస్తున్నాను. ఇంతవరకూ నేను పరిశోధించిన దాన్నిబట్టి నువ్వు నిర్దోషివని తేలింది. నిన్ను నేను రక్షించగలను. ఇప్పుడు నువ్వు నాకు నేనడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పి సాయపడాలి" అన్నాడు.

జగన్నాథం విషాదంగా నవ్వి "నేను హంతకుడ్ని. కాదనడానికి మీరెవరు?" అన్నాడు.

"నీ భార్యకు పూర్తి పోలీసురక్షణ లభిస్తోంది. ఆమె మాన ప్రాణాలకు నేను హామీ. ఇప్పుడు చెప్పు. నువ్వు హంతకుడివేనా?"

జగన్నాథం ఆశ్చర్యంగా అతనివంక చూసి, "మీ మాటలకు నేను మోసపోను. నా మనోబలాన్నీ, నిజాయితీని మీరు పరీక్షిస్తున్నారు. నేను మాటతప్పను. నేను హంతకుణ్నే!" అన్నారు.

అప్పలస్వామి పకపకా నవ్వి, "రఘునాథ్ ను పిలవమంటావా?" అన్నాడు.

జగన్నాథం మాట్లాడలేదు. అప్పలస్వామి వెళ్ళి రఘునాథ్ ను పిల్చుకువచ్చి, "మిస్టర్ రఘునాథ్! యితని భార్య రాణికి పోలీసురక్షణ లభించిందంటే యితను నమ్మడంలేదు. నేను హంతకుల తరఫునుంచి తనను పరీక్షించడానికి వచ్చిన మనిషిగా భావిస్తున్నాడు"— అన్నాడు.

"మిస్టర్ జగన్నాథం! ఇతను డిటెక్టివ్ అప్పలస్వామి.

ఈ కేసులో నువ్వు నిర్దోషివని భావిస్తోన్నాడు. నీ భార్యకు ప్రమాదాన్ని శంకించి నువ్వు నిజం చెప్పడము లేదని ఇతని అనుమానం. నీభార్య రాణికి ప్రభుత్వం పూర్తి రక్షణ ఏర్పాట్లు చేస్తుందని బాధ్యతగల ప్రభుత్వోద్యోగిగా నీకు నేను హామీ ఇస్తున్నాను. నిర్దోషులను రక్షించాలనీ, నిరపరాధులకు శిక్షపడకుండా కాపాడాలనీ పోలీసులుకూడా కోరుకుంటారని నువ్వు గ్రహించక పోవడం నాకు చాలా బాధగా వుంది. ఇప్పుడయినా నీకు తెలిసిన నిజం చెప్పు'' అన్నాడు ఇన్‌స్పెక్టర్ రఘునాథ్.

''నా రాణికి పకడ్బందీగా రక్షణ యేర్పాట్లు జరిగాయా?'' అన్నాడు జగన్నాథం.

''పోనీ ఆమె సమక్షంలోనే నీకు తెలిసిన నిజాన్ని చెబుతావా?'' అనడిగాడు అప్పలస్వామి.

''ఈ కేసులో నా పాత్ర యేమిటో చెబుతాను'' అన్నాడు జగన్నాథం.

''మిస్టర్ రఘునాథ్ రాణిని ఇక్కడకు తీసుకవచ్చే యేర్పాట్లు చేయండి'' అన్నాడు అప్పలస్వామి.

# 13

''నన్నేనా పిలిచారు?'' అన్నాడు జగన్నాథం ఆశ్చర్యంగా.

''అవును మిమ్మల్నే!'' అంది సావిత్రి.

''ఎందుకు?''

''నేను ఆడ-మీరు మగ-అందుకే!'' అంది సావిత్రి.

జగన్నాథం యిబ్బందిగా ముఖంపెట్టి ''నాకు పెళ్ళయింది'' అన్నాడు.

''నాకూ పెళ్ళయింది'' అంది సావిత్రి.

''మీ మాటలు నాకర్థంకావడంలేదు'' అన్నాడు

జగన్నాథం.

"నేను నా భర్తనుండి విడాకులు పొందాలనుకుంటు న్నాను. అందుకు మీ సాయం కావాలి?" అంది సావిత్రి.

"నేను లాయర్ని కాను" అన్నాడు జగన్నాథం.

"లాయరక్కర్లేదు. మగవాడైతే చాలు" అని నవ్వింది సావిత్రి. తర్వాత ఆమె తన పథకాన్ని వివరించి చెప్పింది. సావిత్రి. జగన్నాథాన్ని మరిగినట్లు ఆమె భర్త విశల్ రావు నమ్మే సన్నివేశాలలో జగన్నాథం పాల్గోవాలి. సహాజత్వం కోసం జగన్నాథం ఎంతదూరం వెళ్ళినా, ఆఖరికి తన మానాన్ని దోచుకున్నా యిష్టమేనని సావిత్రి చెప్పింది.

"విడాకులకోసం యింతకు తెగిస్తారా?" అన్నాడు జగన్నాథం.

"ఏంచేయను? నాభర్త నన్ను పశువుకన్న హీనంగా చూస్తున్నాడు. ఆయన్ను నేను భరించలేను. ఎలాగో అలా వదుల్చుకోవాలి. మీ గురించి నాకు తెలుసు. నేనెన్నుకున్న పదతిలో నాకు సహకరించడానికి చాలా మంది మగవాళ్ళు ముందుకు వస్తారని నాకు తెలుసు. నా అందం అటువంటిది. మీకు పెళ్ళి అయివుండకపోతే భర్తగా మిమ్మల్నే ఎన్నుకుని వుండేదాన్ని. మనసున్న మనిషిగా సహాకరించగలిగినది మీరొక్కరేనని నాకు అనిపించింది" అంది సావిత్రి.

భర్త ఆమెను యెలా హింసిస్తున్నాడో చాటుగా వుండి చూసే అవకాశం జగన్నాథానికిచ్చింది సావిత్రి. సావిత్రి ప్రోత్సహించగా మనసున్న మనిషిగా నేకాక, ఒక మగవాడిగా కూడా అతనామెతో పరిచయం పెంపొందించుకున్నాడు. వచ్చిన అవకాశాన్ని వదులు కునేటంత స్థాయికి అతని నైతికవిలువలు చేరుకున్నట్లు

లేదు.

ఒకరోజు విఠల్ రావు అతన్ని హెచ్చరించాడు "నీ సంగతి నాకు తెలిసింది. సావిత్రిని నేను వదులుకోలేను కాబట్టి క్షమించి ఏలుకోగలను. నువ్వుమాత్రం మరోసారి నా భార్యజోలికి వచ్చావో నీపని సరి!"

"నీ భార్య బరితెగించిన మనిషి. విడాకులివ్వడం మంచిది" అంటూ జగన్నాధం ఓ ఉచితసలహా పారేశాడు.

"నా సంగతి నీకు అనవసరం. నీ సంగతి చూసుకో" అని విఠల్ రావు వెళ్ళిపోయాడు.

అయితే కొద్దిరోజుల్లోనే ఇద్దరూ మళ్ళీ విఠల్ రావుకి దొరికిపోయారు. విఠల్ రావు అగ్గిమీద గుగ్గిలమయ్యాడు.

"నాకు జగన్నాధమంటే యిష్టం. నేనతన్ని వదలను. నా ప్రవర్తన మీకు నచ్చకపోతే విడాకులిచ్చేయండి" అంది సావిత్రి.

విఠల్ రావు భార్య మాటలకు విస్తుపోయాడు_"ఆఖరికి యిందవరకూ వచ్చిందన్నమాట వ్యవహారం. నా సంగతి నీకు తెలుసుగా. ప్రతీకారంగా ఈ జగన్నాధంగాడి పెళ్ళాంబ్రతుకు నవ్వులపాలు చేస్తాను. దాన్ని నడివీధుల్లో పిచ్చిదని చెప్పి నగ్నంగా నడిపిస్తాను" అంటూ అరిచాడు.

జగన్నాధం హడలిపోయాడు. అతను విఠల్ రావు మీద చేయి చేసుకోబోయి భంగపడ్డాడు.

"నా గురించి మీ భార్యకు అన్యాయం జరగడం సహించలేను" అంది సావిత్రి. ఆఖరు హెచ్చరికగా విఠల్ రావు "మళ్ళీ ఈ దరిదాపులకు వచ్చావో అన్నంత పనీ చేస్తాను" అన్నాడు.

జగన్నాధం వెళ్ళిపోయాడు. మళ్ళీ సావిత్రివైపు చూడకూడదనుకున్నాడు. కానీ ఆమె అతన్ని ఆహ్వానా

లతో మతిపోగొట్టింది. అలవాటుపడ్డ జగన్నాథం ప్రాణం ఊరుకోలేకపోయింది.

“నా భార్యను రెండువిధాల అన్యాయం చేసినట్లవుతుంది” అంటూ వాపోయాడు జగన్నాథం తన బలహీనతను నిందించుకుంటూ, సావిత్రిని దగ్గరగా తీసుకుంటూ.

“దగ్గర ఈ కత్తి వుంచుకోండి. ఆయనవస్తే పొడిచేయండి. గుట్టు చప్పుడు లేకుండా కప్పెట్టేద్దాం” అంది సావిత్రి.

ఆ క్షణంలో కలిగిన ఆవేశంలో అలాగే చేయాలనిపించింది జగన్నాథానికి. దురదృష్టవశాత్తూ విఠల్ రావు వాళ్ళిద్దరూ ఉండగా రంగప్రవేశం చేసి, “నా ఆఖరు హెచ్చరిక కూడా అయిపోయింది. ఇక మీకు బుద్ధిరాదు” అంటూ అరిచాడు.

జగన్నాథం భయపడ్డాడు కానీ కత్తి అందుకున్నాడు. విటల్ రావు మెరుపు వేగంతో జగన్నాథాన్ని ఎదుర్కొని అతని కత్తిని లాక్కోగలిగాడు. ఇప్పుడు కత్తి విటల్ రావు చేతిలో వుంది. జగన్నాథం ప్రాణభయంతో వణుకుతున్నాడు.

“ఎందుకూ పనికిరాని చేతకాని చవటవి. నీకీ హీరో బుద్ధులెలా వచ్చాయో తెలియడంలేదు_ తెలుసుకోకుండానే చంపేస్తున్నాను...” అన్నాడు విటల్ రావు.

జగన్నాథం సావిత్రి వంక దీనంగా చూశాడు. నీ మూలంగానే నాకీ చిక్కులొచ్చాయన్న భావం ఆ చూపుల్లో వుంది.

“తప్పంతా నాది. అతన్ని వదిలేయండి__” అంది సావిత్రి.

“వీడినీ వదలను, వీడి పెళ్ళాన్నీ వదలను” అన్నాడు

విటల్ రావు.

"నాకు నిజంగా బుద్ధివచ్చింది" అన్నాడు జగన్నాథం.

"వస్తే వచ్చి ఉండవచ్చు కానీ చాలా ఆలస్యంగా వచ్చింది" అన్నాడు విటల్ రావు.

సావిత్రి, జగన్నాథం అతన్ని చాలాసేపు బ్రతిమలాడారు.

ఆఖరుకు విఠల్ రావు ఇలాగన్నాడు. "తప్పు చేసినందుకు శిక్ష తప్పదు. నిన్ను స్వయంగా ఆహ్వానించిన తప్పుకు ఈ సావిత్రి నిన్ను స్వయంగా నేరస్థుణ్ణి చేసి పోలీసులకు అప్పగించాలి. నేను నీ చేతుల్లో హత్య చేయబడ్డట్టు ఈమె పోలీసులకు కల్పించి చెబుతుంది. కొంత కాలం నువ్వు జైల్లో హంతకుడి పేరుతో పడివుండు. తర్వాత నేను బయటకు వచ్చి నిన్ను రక్షిస్తాను."

జగన్నాథానికిది నచ్చలేదు కానీ రాణి క్షేమం కోరి సావిత్రి వెంటనే ఒప్పేసుకుంది.

విఠల్ రావ్ మాయమయ్యాడు. జగన్నాథం హంతకుడయ్యాడు. తనకు తెలిసిన కథ బయటపెడితే రాణికి ప్రమాదమున్నదన్న భయంతో, జగన్నాథం తను నిర్దోషినని చెప్పడం మినహా యింకేమీ చేయలేకపోయాడు.

రాణి అప్పులస్వామిని పరిశోధనలోకి దింపడంతో కొన్ని కొత్త చిక్కులు వచ్చాయి. సావిత్రి జైల్లో ఉన్న జగన్నాథాన్ని కలుసుకుని రాణి చేసిన పొరపాటు వివరించి, "ఆమె ఇప్పుడు చాలా ప్రమాద పరిస్థితుల్లో ఉంది. నువ్వు నేరం ఒప్పుకుంటే తప్ప విటల్ రావు బయటపడే పరిస్థితులు రావు" అంది.

"విటల్ రావు బయటపడేలోగా నన్ను ఉరితీస్తే?"

అన్నాడు జగన్నాథం.

"అలా ఎన్నటికీ జరుగదు..." అంది సావిత్రి.

నిరాశా నిస్పృహల మధ్య వ్రేలాడుతున్న జగన్నాథం ప్రస్తుతం తనున్న పరిస్థితుల్లో కనీసం రాణిని కాపాడడం తన కర్తవ్యమని భావించి, సావిత్రి చెప్పిన ప్రకారం చేశాడు.

# 14

"ఈ కథ విని నవ్వాలో, ఏడ్వాలో తెలియడం లేదు" అంది రాణి.

"ఏం?" అన్నాడు రఘునాథ్.

"వివాహమయ్యిండీ పరస్త్రీతో సంపర్కం పెట్టుకుని కోరి ఆపదలు తెచ్చుకున్నాడు నా భర్త. ఆ కారణం గానే నాకూ ప్రమాదం వచ్చింది. నన్ను ప్రమాదం నుంచి రక్షించడంకోసం తన ప్రాణాలుకూడా త్యాగం చేస్తున్నాడు భర్త. నామీది ప్రేమ ఆయన్ను పరస్త్రీ వ్యామోహం నుండి తప్పించలేకపోయినందుకు బాధ పడనా, నామీది ప్రేమతో తన ప్రాణాల్నే త్యాగం చేస్తున్నందుకు సంతోషించనా?"

"పరస్త్రీ వ్యామోహం తప్పే. నా కష్టే అందుకు కారణం—" అన్నాడు జగన్నాథం.

"జగన్నాథం చెప్పిన కథతో ఈ కేసు పువ్వులా విడిపోయింది" అన్నాడు అప్పలస్వామి.

"నా కొందరలా వుంది" అన్నాడు రఘునాథ్ వినుగ్గా.

"అలా కంగారుపడకండి మహాశయా" అంటూ అప్పలస్వామి శివరావు హత్యకేసు వివరాలన్నీ చెప్పి, "విటల్ రావును మీ డిపార్టుమెంటు వీలైనంత తొందరగా పట్టుకోవాలి" అన్నాడు.

"జగన్నాథం కట్టుకథను నమ్మమంటారు" అన్నాడు

రఘునాథ్.

"జగన్నాథంలో కనీసం ఒక్క నిజముంది. మీరను కున్న రోజున విటల్ రావు చావలేదు. ఆ తర్వాత కొద్ది రోజులకు ఇంకో హత్య చేశాడు. అందుకు తిరుగులేని సాక్ష్యముంది..."

రఘునాథ్ ఇంకా ఆలోచనలో వున్నాడు. అప్పల స్వామి మళ్ళీ అందుకుని, "విటల్ రావు సామాన్యుడు కాడు. అశనూ, సావిత్రీ కలిసి చాలా పెద్ద పథకమే వేసి జగన్నాధాన్నిందులో ఇరికించారు. విటల్ రావు దేశంలో భారీ ఎత్తున స్మగ్లింగ్ సాగిస్తున్న ఓ ముఠాకు నాయకుడు. తెలివిగా పథకాలు వేసి అమాయకులను వారికి తెలియ కుండానే తన స్మగ్లింగ్ వ్యవహారాలకు వాడుకుంటు న్నాడు. తనపై ప్రభుత్వానికి అనుమానం వచ్చిందన్న విషయం తెలియగానే హత్యపేరుతో అండర్ గ్రౌండ్ కు వెళ్ళిపోయాడు. తను సాధించవలసిన కార్యాలను త్వరగా ముగించుకుని మారుపేరుతో విదేశాలకు వెళ్ళిపోవాలను కున్నాడతను. ఆ సందర్భంలో శివరావు పోలీసులకు స్మగ్లింగ్ వ్యవహారాన్ని గురించిన సమాచారం అంద జేయాలనుకున్నాడు. శివరావు తనకు తెలియకుండానే స్మగ్లింగ్ లో సాయపడుతూ అనుకోకుండా ఆ విషయం గురించినట్లున్నాడు. శివరావు ఉద్దేశ్యం తెలియగానే విటల్ రావు అతన్ని స్వయంగా మట్టుబెట్టాడు. ఆ విషయం అనుకోకుండా చిత్రీకరించబడింది. దాని సాయంతో రహస్యంగా జరిగిన ఒక హత్య ప్లస్ ఇంత కథ బయట పడ్డాయి" అన్నాడు.

"నేను నిజంగా విడుదలవుతానంటారా?" అన్నాడు జగన్నాథం.

"నిస్సందేహంగా. విటల్ రావును పట్టుకున్న వాళ్ళకు మంచి బహుమతి వుంది. అయితే అందులో వాటా మీకు రాదు." అన్నాడు అప్పలస్వామి.

*　　　*　　　*

"యు ఆర్ రియల్లీ బ్రిలియంట్" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"ఒక పెద్ద స్మగ్లింగ్ ముఠాను పట్టి ఇవ్వడానికి కారణభూతులైన మీ ఫిల్ముకు ప్రభుత్వం కనీసం లక్ష రూపాయలను బహుమతిగా ఇస్తుందనుకుంటాను—" అన్నాడు అప్పలస్వామి—సుబ్రహ్మణ్యం తన్ను అభినందిస్తూ అన్న మాటలను విననట్లు నటిస్తూ.

"నా ఎక్స్‌పరిమెంటుతో కొత్తరకం కథ తయారు చేసి మంచి ఫిల్ము తీసి—అటు పేరూ, ఇటు డబ్బుకూడా సంపాదించాలనుకున్నాను. కానీ ఏ కథా తయారవకుండానే నా నాలుగు రీళ్ళ ఫిల్మ్ లక్షరూపాయలు లాభం తెప్పించేలాగుంది" అన్నాడు ఆనంద్.

"బహుశా అందుకు నేనే కారణమనుకుంటాను—" అన్నాడు అప్పలస్వామి.

"హత్య చేయనివాడు హంతకుడు. హత్య చేసినవాడు హతుడు. చాలా తమాషాగా ఉంది ఆనంద్ గారూ-మీరో క్రైమ్ పిక్చర్ తీయకూడదూ?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"వద్దండీ—మళ్ళీ నాలుగురీళ్ళ పిక్చరే తీద్దామనుకుంటున్నాను. అయితే నాకింతో అచ్చివచ్చిన నాల్గో రీలు ఎక్కడ ఎప్పుడు ఎలా తీయాలో బాగా ఆలోచించాలి" అన్నాడు ఆనంద్ నవ్వుతూ.

—: ఐపోయింది: —

# దుర్మార్గం దాగదు!

'సికిందర్'

డిటెక్టివ్ లాల్ ఆ రోజు వుదయం పదిగంటలకి తీరిగ్గా కూచోని పెన్సిలు చెక్కుతూండగా, అతడి పార్ట్‌నర్ జాన్ ఫీజు లెగ్గొట్టిన క్లయింట్స్ జాబితా తయారు చేస్తున్నాడు.

ఇంతలో స్వింగ్ డోర్ తెరుచుకోగా, రివ్వుమని గాలి దూసుకువచ్చింది. ఆ తర్వాత ఒక ఆకారం లోనికి నడిచి వచ్చింది.

ఆమెకు పాతికేళ్ళుంటాయి. ఉన్నత కుటుంబానికి చెందిన స్త్రీలా వుంది. ముఖంలో ప్రశాంతత, కళ్ళలో దైన్యం, విగ్రహంలో గాంభీర్యం ఉట్టిపడుతున్నాయి— డిటెక్టివ్ జాన్‌కి ఆమెలో ఆకర్షించింది గులాబీరేకు పెదవులైనా, ఆమె వివాహిత అయినందుకు నిరాశ చెందాడు.

ఆమె చేతులు జోడించి నమస్కరించి, లాల్ ఎదురుగా వచ్చి కూచుంది.

లాల్ ముందుకు వంగి, "ఏం జరిగింది?" అనడిగాడు.

అతనిలా డైరెక్టుగా అడగడం ఆమెని కలవరపర్చింది.

"నా భర్త కన్పించడం లేదు!" చెప్పిందామె.

"ప్లీజ్ నా కేసు తీసుకోండి—నిన్న రాత్రినించీ కన్పించని నా భర్తని గాలించండి! ఫీజెంత కావాలి?"

డిటెక్టివ్‌లు తికమకగా చూసుకున్నారు.

"రోజుకి ఏభైరూపాలు. ఖర్చులు మావి. కేసు తేలాక బిల్ వేరే ఇచ్చుకోవాలి" అన్నాడు జాన్.

"మంచిది" ఆమె పర్సుతీసి కొన్ని వందరూపాయల కాయితాలు అందించింది, "అడ్వాన్సు అయిదొందలు. త్వరగా గాలించి ఆయనెక్కడ వున్నాడో తెలుసుకోండి. వివరాలు కావాలంటే చెప్తాను."

లాల్ ఆమెని సూటిగా చూసి అనుమానంగా అడిగాడు, "మీరు గాలించమంటోంది మీ భర్తనేనా?"

నవ్విందామె, "లేకపోతే గుండుసూది అనుకుంటున్నారా?"

"అలాగే వుంది మీ ధోరణి. మీ భర్తగురించి చాలా తేలిగ్గా మాట్లాడుతున్నారు—ఆయన కన్పించకపోవడం మీకేమీ కంగారుగా లేదా?"

"ఎందుకులేదు?" చిరాగ్గా అందామె "కంగారుగా లేకపోతే, మీ దగ్గరకు ఎందుకు వస్తాను."

డిటెక్టివ్‌లు ఒకర్నొకరు చూసుకున్నారు. తర్వాత లాల్ అడిగాడు:

"ఆయన ఫోటో వుందా?"

పర్సులోంచి ఫోటో తీసిచ్చిందామె. ఆ ఫోటోలో మనిషిని చూసి ఆశ్చర్యపోయాడు లాల్. అతని ఆశ్చర్యాన్ని చూసి ఫోటో లాక్కున్నాడు జాన్.

ఫోటోలో వున్నవ్యక్తికి యాభైఏళ్ళుంటాయి. యాభై

ఏళ్ళ మనిషి పాతికేళ్ళ యువతికి యెలా భర్త అయ్యాడు? రెండవ పెళ్ళా?

"ఆయన ఎప్పటినుంచి కన్పించడంలేదు?" లాల్ అడిగాడు.

"నిన్న రాత్రి నించి."

"ఎక్కడికెళ్ళారని మీ అనుమానం?"

"నాకు తెలిసినంతవరకు ఆయన ఎక్కడెక్కడికి వెళ్తాడో అక్కడక్కడ గాలించాను—ఎక్కడా లేడు. ఎక్కడ వున్నాడో తెలీదు."

"ఆయన బిజినెస్ ఏమిటి?"

"చాలా వున్నాయి: అబిడ్స్‌లో డిపార్ట్‌మెంటల్ స్టోర్స్, సరూర్ నగర్‌లో ద్రాక్షతోట—కోళ్ళఫారం, ఏ. సి. గార్డ్స్‌లో లాడ్జింగ్...లాడ్జింగ్ యింకా నిర్మాణంలో వుంది."

"ఆయన పేరు?"

"నందనపావు."

"మీ పేరు?"

"మాల."

"పూర్తి పేరు వైజయంతీ మాలా?" అడిగాడు జాన్.

చురచుర చూసిందామె, "కాదు! ఒకరితో నన్ను పోల్చడం సహించను!"

"మీ ఇల్లెక్కడ?" లాల్ అడిగాడు.

"హిమయత్ నగర్‌లో లిబర్టీ వెనక."

"అడ్రసు, ఫోన్ నెంబర్ ఇవ్వండి."

వ్రాసిచ్చింది.

"ఆల్‌రైట్, ఇక కేసు స్వరూపం తెలుసుకోవాలి. మీ భర్త కన్పించడం లేదని మీకెప్పుడు తెలిసింది?"

"ఈ ప్రశ్నకి రెండుసార్లు జవాబిచ్చాను."

"మరోసారి ఇవ్వండి."

"నిన్న రాత్రి."

"ఎన్ని గంటలకి?"

"సుమారు ఒంటి గంటకి."

"ఎలా?"

"నిద్రపోతున్నాను - మెలకువ వచ్చింది - పక్కన ఆయన లేడు-అప్పుడు తెలిసింది."

"మీకు మెలకువ ఎందుకొచ్చింది? ఏదేనా చప్పుడు విన్నారా?"

"రాత్రి ఒక నిర్ణీత సమయంలో నాకు మెలుకువ వస్తుంది."

"ఏ సమయంలో?"

"ఒంటిగంట ప్రాంతాల."

"కారణమేమిటి? దాహం వేస్తుందా? పీడకల వస్తుందా? లేక___"

"అలాటిదేమీ కాదు. అప్రయత్నంగా వస్తుంది."

"అప్పుడేం చేస్తారు?"

"ఏమీ చెయ్యను. కాస్సేపటికి తిరిగి నిద్ర వచ్చేస్తుంది."

"నిన్న రాత్రి ఏం చేశారు?"

"మెలుకువ వచ్చి చూస్తే ఆయన లేడు. బాత్‌రూంకెళ్ళారేమో అనుకున్నాను. ఎంత సేపటికీ తిరిగి రాక పోవడంతో యిల్లంతా గాలించాను. ఎక్కడా లేడు."

"ఆయనకి నిద్రలో నడిచే అలవాటుందా?"

"లేదు."

"వెల్, ఆయన యింట్లో లేడని మీరేం చేశారు?"

"ఎక్కడికో వెళ్ళివుంటాడనుకున్నాను. రాత్రంతా

జాగారం చేశాను. తెల్లారినా రాలేదు..."

"ఇంతకుముందు ఆయనలా వెళ్ళారా?"

"మా పెళ్ళయిన నాలుగేళ్ళలో యిలా జరగలేదు."

"మీతో ఆయనకి పెళ్ళెలా అయింది?"

"ఆయన స్టోర్స్‌లో పనిచేసేదాన్ని. అప్పుడాయన భార్య చనిపోయింది-నన్ను పెళ్ళి చేసుకోమని కోరాడు. నేను అనాథని. ఆయన భార్య అయ్యే అదృష్టం నాలాటి వాళ్ళకెందరికి వుంటుంది? వెంటనే ఒప్పుకున్నాను."

"ఆయన స్వభావం ఎలాటిది?"

"శాంతస్వభావం. నలుగురికి సహాయం చేసే స్వభావం. శత్రువుని కూడ స్నేహితుడిలా చూసే స్వభావం."

"మీ దాంపత్యం ఎలావుంది?"

ఆమె ముఖం ఎర్రబడింది. "మిస్టర్ లాల్! మీరనవసరంగా నా వ్యక్తిగత విషయాల్లో జోక్యం చేసుకుంటున్నారు!" అరిచిందామె.

లాల్ తలపంకించి జాన్‌ని చూశాడు.

జాన్ నవ్వి అన్నాడు: "ఆల్ రైట్ మేడమ్! మీకు భర్త ముఖ్యంకాకపోతే వ్యక్తిగత విషయాలు చెప్పకండి. అయితే నేనొక నిజం చెప్తాను: మీ మాటల ధోరణిబట్టిచూస్తే మీకు భర్తకంటే డబ్బు ముఖ్యమన్పిస్తోంది. అంతేనా?"

"రెండవభార్య మీద ఎవరికి సదభిప్రాయం వుంటుందీ లోకంలో?"

"ఉండదు. అందుకే మీ ధోరణి మార్చుకోండి. చూడండి, మీరు మా ప్రశ్నలకి మనసువిప్పి జవాబులిస్తే తప్ప యేమీ చెయ్యలేం."

"నేను డబ్బుకోసం పెళ్ళిచేసుకున్నానంటే సహించలేకపోతున్నాను!"

"వదిలేయండి. డబ్బు ఎవరికి ముఖ్యంకాదు? మాకు డబ్బు అనవసరమనుకుంటే యీ ఏజన్సీ పెట్టేవాళ్ళమా?"

నవ్విందామె. "నా భర్తవిషయం ఆలోచించండి."

"ప్రముఖవ్యక్తులు అదృశ్యమవడానికి అనేక కారణాలుంటాయి: కిడ్నాప్, బ్లాక్ మెయిల్, రహస్య ప్రేమ కలాపాలు, అత్యవసర ప్రయాణాలు–సమావేశాలు... నలుగురి దృష్టినాకర్షించాలన్న ఉద్దేశ్యంతో అజ్ఞాతవాసం" జాన్ అన్నాడు.

"అంటే?" గాభరాగా అడిగిందామె.

నవ్వాడు జాన్: "మీ భర్త తనకి పబ్లిసిటీ కావాలనుకున్నారనుకోండి, అప్పుడు రహస్యంగా యెక్కడో దాక్కుంటే మీరు కంగారుపడి పోలీసుల దగ్గరికెళ్తారు. పోలీసులు గాలింపు ప్రారంభిస్తారు–అది వేరే విషయం–ఇక, దేశవ్యాప్తంగా పత్రికలు మీ భర్త అదృశ్యవార్త ప్రచురించి ప్రజల్లో సంచలనం రేకెత్తిస్తాయి. బ్రహ్మాండమైన పబ్లిసిటీ!"

"ఆ తర్వాత?"

"ఇంతలో ఆయన చల్లగా బయటికొస్తారు. అందర్నీ ఆశ్చర్యపరుస్తారు. ఏవేవో కథలు కల్పించి గొప్పగా తన సాహసం వర్ణిస్తారు. ఆ కథలు లోకం నమ్మినా నమ్మకపోయినా, అభినందనలు—ఆశీస్సులు టపాటపా వచ్చి పడుతుంటాయి. అంతే! హఠాత్తుగా ఆయన దేశంలో నోటెట్ పర్సన్ అయి కూచుంటాడు!"

"ఓహ్! ఆయనలా చెయ్యడు!"

"మీకెలా తెలుసు?" అడిగాడు జాన్, "మా వూహా పరిధి మీకంటే విశాలమైనది. ఒక సమస్యని పరిష్కరించడానికి ఎన్నో కోణాలను దృష్టిలో వుంచుకుని ఆలోచిస్తాం. ఆ కోణాల్లో ఎన్నో మలుపులు, ఆ మలుపుల్లో

ఎన్నో అడ్డంకులూ వుంటాయి. మేం మలుపుల్ని మా కను గుణంగా మార్చుకుంటూ, అడ్డంకుల్ని తొలగించుకుంటూ, గమ్యస్థానం చేరుకుంటాం. జెండా ఎగరేస్తాం. దట్సాల్, మిసెస్ రావ్–ఇక మీ భర్తగురించి చెప్పండి, ఆయన అదృశ్యంగా కాకముందు ప్రవర్తన ఎలా వుండేది?"

దీర్ఘంగా నిట్టూర్చింది మాల.

"అన్ని పరిస్థితుల్లోనూ ఆయన ప్రవర్తన ఒకే విధంగా వుంటుంది. ఆయన హావాభావాల్ని, ఆలోచనల్ని పసి గట్టలేం. ఏ విషయంలో కూడా ఆయనలో ఎలాంటి 'క్లూ' దొరకదు."

"నిన్న రాత్రి గురించి చెప్పండి: ఆయనెలా ప్రవర్తించారు?"

మాలతి అంది, "రాత్రి ఎనిమిదిగంటల కనుకుంటాను– బయటపన్లు ముగించుకుని వచ్చాడు. భోజనంచేసి తొమ్మిది గంటలకే నిద్రపోయాడు. నాకాశ్చర్యం వేసింది. ఆయ నెప్పుడూ ఆ సమయానికి నిద్రపోడు. పగలంతా చాలా బిజీగా వుంటాడు కాబట్టి మనశ్శాంతికోసం రాత్రి పుస్తకాలు చదువుతాడు పదకొండు గంటలవరకు. ఇది క్రమం తప్పని దినచర్య. కానీ నిన్నరాత్రి తొమ్మిదికే ఎందుకు నిద్రపోయాడో అర్థంగావడంలేదు."

"మీరెప్పుడు నిద్రపోయారు?"

"పదిగంటలకి–అలవాటు ప్రకారం."

"ఆయన మీతో ఏం మాట్లాడారు?"

"ఏమీ మాట్లాడలేదు."

"మాట్లాడుకోరా?"

"నిన్నరాత్రి మాట్లాడుకోలేదు."

"ఎందుకు?"

వినుగ్గా అందామె, "ఆయన ఆందోళనగా వున్నప్పుడు

పలకరించను.''

''ఆయన ఆందోళనలో భాగం పంచుకోడం భార్యగా మీ కర్తవ్యం కాదా?'' లాల్ అన్నాడు.

''ప్లీజ్ షటప్, మిస్టర్ లాల్! నేను జాన్‌తోనే మాట్లాడతాను!''

జాన్ అడిగాడు, ''ఆయన ఆందోళనగా యెందు కున్నారు?''

''తెలీదు. నేనడగలేదు, ఆయన చెప్పలేదు.''

''ఐసీ!'' జాన్ ఏదో ఆలోచించాడు, ''అయితే ఆయన కట్టుబట్టలతో అదృశ్యమయ్యారా?''

''అంటే?''

''ఆయన యే బట్టలతో నిద్రపోయారు?''

''లుంగీ, బనీయన్.''

''ఇప్పుడు చెప్పండి-ఆయన లుంగీ, బనియన్‌తో అదృశ్యమయ్యారా?''

''ఓహ్! కాదు!'' గాభరాగా అందామె.

''గాభరా పడకండి, ప్రశాంతంగా చెప్పండి.''

''మిస్టర్ జాన్! ఆయన బట్టలు మార్చుని వెళ్ళారు!''

''మీకెలా తెలుసు?''

''రాత్రి చూశాను-ప్యాంట్, షర్ట్ లేవు. లుంగీ బెడ్ మీద వుంది!''

''ఎలాటి దుస్తులు?''

''నల్లప్యాంట్, తెల్లషర్టు.''

పర్సులోంచి కర్చీఫ్ తీసి చెమట తుడుచుకుందామె.

''అలాంటివెన్ని జతలున్నాయి?''

''రెండు.''

''మొత్తం ఎన్నిజతలున్నాయి?''

''జాన్! ఏమిటిది?''

"ప్రశ్న, జవాబు చెప్పండి...

"మీరింత లోతుగా, ఇన్ని ప్రశ్న లడుగుతారనుకో లేదు! ఆయనకి మొత్తం పదకొండు జతలున్నాయి."

"సరిగ్గా చెప్తున్నారా?"

"కచ్చితంగా చెప్తున్నాను. ఆయనకి పదకొండు జతలున్నాయి."

"అవిగాక ఉడుపులెన్ని వున్నాయి?"

ఆమె ఆటోలున లేచినిలబడి "నాన్సెన్స్! వెధవ ప్రశ్నలు! వెధవ డిటెక్టివ్‌లు!"

జాన్ షాక్ తిని లాల్‌ని చూశాడు.

లాల్ కల్పించుకుని అన్నాడు: "శాంతించండి. మీరు పోలీసుల దగ్గరికి వెళ్ళవలసింది - మా దగ్గరికి వచ్చారు. వాళ్ళు మాకంటే 'బాగా' ప్రశ్నిస్తారు! చెప్పండి, మిమ్మల్ని వాళ్ళ దగ్గరికి పంపివ్వనా?"

లాల్ కసిగా టెలిఫోన్ అందుకోగా ఆమె ఛటుక్కున లాక్కుంది.

"క్షమించండి! నాకు ఆవేశం ఎక్కువ!"

"ఆవేశం అనర్థాలకి—"

"ప్రశ్నలడగండి!"

"నేను వుడుపుల సంగతి ఆడిగాను" అన్నాడు జాన్.

"నా ఖర్మ! చాకలిపద్దు అప్పజెప్పినట్టే వుంది!" కసిరిందామె, "తొమ్మిది బనియన్‌లు, పదిహేను అండర్ వియర్లు, ఏడు లుంగీలు—నోట్ చేసుకోండి, మహా ప్రభూ!"

జాన్ వ్రాసుకున్నాడు. "అన్నట్టు బట్టలు చాకలికి వేస్తారా?"

"ఏం? మీరు ఉతుకుతారా? నాన్సెన్స్ జాన్! నాకు విసుగుపుడుతోంది!"

"ప్రశ్నకు జవాబు చెప్పండి!" ఉరిమాడు జాన్.

"బట్టలు పనిమనిషి ఉతుకుతుంది."

"అంటే ఆయన బట్టలు ఇల్లుదాటి ఎక్కడికీ వెళ్ళవు. అంతేనా?"

"అవును—ఆయన వొంటిమీద వుంటే తప్ప."

"ఇప్పుడు చెప్పండి! రాత్రి మీరు చూసినప్పుడు ఒక జత లేదు కాబట్టి యింట్లో మిగతా పది జత లుండాలి. వున్నాయా?"

ఆమె కలవరంగా చూసింది. "యేమిటి మీ ఉద్దేశ్యం?..."

జాన్ అడ్డంగా తలూపాడు. "పదండి, మీ ఇంటి కెళదాం."

లాల్ అడ్డుతగిలాడు. "యేమిటి జాన్, నీ గొడవ?"

"మాల యింటరాగేషన్‌లో నాకో పాయింట్ దొరికింది."

"ఏమిటది?"

జాన్, మాలవేపు తిరిగాడు. "మరో ప్రశ్న, మీ కెన్ని కార్లున్నాయి?"

"ఒకటి."

"మీరిప్పుడు స్వంత కార్లో వచ్చారా?"

"అవును."

"అయితే మీ భర్త కారులో వెళ్ళలేదన్నమాట" జాన్ లాల్ వేపు తిరిగాడు, "ఆల్ రైట్, బాస్. నా గొడవేమిటో ఇప్పుడు చెప్తాను. మిస్టర్ రావ్ కారులో వెళ్ళలేదు కాట్టి, ఫలానాచోటుకి వెళ్తున్నట్లు భార్యకి చెప్పలేదు కాబట్టి, ఆయన్ని ఎవరేనా బలవంతంగా తీసి కెళ్ళి వుండాలి. అలా గనుక జరిగితే ఆయన వొంటిమీద ఒక జత తప్ప మిగతా దుస్తులన్నీ ఇంట్లోనే వుంటాయి.

అలా కాక ఆయన బుద్ధిపూర్వకంగా ఎక్కడికైనా వెళ్ళివుంటే—అది త్వరలో తిరిగివచ్చే నమ్మకం లేకుండా—కూడా కొన్ని జతలు తీసికెళ్ళారు. ఇప్పుడు నేను మాలతో ఇంటికెళ్ళి, ఈ రెండింటిలో ఏది జరిగిందో తెల్సుకోవాలి.”

“గుడ్ అయిడియా,” లాల్ కళ్ళు మెరిశాయి. “ప్రొసీడ్!”

మాల ఇబ్బందిగా, అసహనంగా చూసింది.

ఆమె నుదురు చెమట పట్టింది.

“అంతే కాదు,” మళ్ళీ అన్నాడు జాన్, “ఇలాంటి కేసుల్లో నాకు ఉత్తరాలు ఆసక్తి కలిగిస్తాయి. మాలతో వెళ్ళి ఆయన కొచ్చిన ఉత్తరాల్లో ఆయన ఆచూకీ చూఛాయగానైనా సూచించే క్లూ యేదైనా దొరుకుతుందేమో చూస్తాను.”

## 2

జాన్, మాల కారు దిగి ఇంట్లోకి నడిచారు.

జాన్‌ని డ్రాయింగ్ రూంలో కూచోబెట్టి అడిగింది మాల: “కాఫీ తాగుతారా?”

జాన్ అడ్డంగా తలూపాడు, “కాఫీ వద్దు, డికాక్షన్ కావాలి.”

ఆమె నవ్వి, టేబిలు సొరుగులోంచి ఉత్తరాలకట్ట తీసి జాన్‌కి అందించింది. “మీరు డిటెక్షన్ చేస్తుండండి, నేను డికాక్షన్ చేస్తాను.”

ఆమె వెనక్కి తిరిగి వెళుతుండగా, జాన్ ఛటుక్కున లేచి నిలబడి, “ముందు ఆయన బట్టలు చూపించండి” అన్నాడు.

ఆమె వెనక్కి తిరిగి చూసింది, యెర్రబడ్డ ముఖంతో.

“బట్ట లెక్కడికి పోతాయి? ముందు ఉత్తరాలు

చూడండి!"

జాన్ అడ్డంగా తలూపి గబగబ ఆమె దగ్గరికి నడిచాడు, "బెడ్ రూం ఎక్కడ?"

"ఏమిటీ హడావుడి! నా ఇంటికి వచ్చినవాళ్ళు ప్రశాంతంగా వుండాలి!" అర్చిందామె.

నవ్వాడు జాన్, "మేం ప్రశాంతంగా వుంటే కొంప అంటుకుంటాయి."

ఆమె జాన్ని చూసింది, నిప్పులాంటి కళ్ళతో, మింగేసేలా.

"సరే—పదండి!" కసిరింది మరుక్షణం.

జాన్ ఆమెవెంట బెడ్ రూంలోకి నడిచాడు. బెడ్ రూంలో ఒక మూల ఆరడుగుల ఎత్తు కొయ్యబీరువా వుంది. మాల తెరిచి చూపించింది. బీరువాలో హేంగర్స్కి వరుసగా వేలాడుతున్నాయి, నందనరావు దుస్తులు. అయితే, ఆశ్చర్యమేమిటంటే అవి మొత్తం పదకొండు జతలున్నాయి. కానీ, అండర్ వియర్స్లో మాత్రం ఒకటి తక్కువ వుంది.

నందనరావు దుస్తులన్నీ ఇంట్లోనే వున్నాయి—ఒక్క అండర్ వియర్ తప్ప.

జాన్ మాలని చూశాడు, "వెల్, మాడమ్ ఆఫీసులో మీరేం చెప్పారు? ఒక జత తక్కువ వుందని—అంతేనా?"

తలూపిందామె.

"మరిక్కడ అన్ని జతలూ వున్నాయేమిటి?"

ఆమె ముఖం ఎర్రబడింది. "ఏమో జాన్! నాకేమీ అర్థంగావడం లేదు!"

"ఏమిటర్థంగావడంలేదు? రాత్రి మీరు చూసినప్పుడు తెల్ల షర్టు, నల్ల ప్యాంటు లేవు. ఇప్పుడున్నాయి. అంటే

రావుగారు వచ్చేశారన్నమాట!"

మాల కంగారుగా అంది, "ఏమిటి మీరనేది? ఆయన వచ్చేశారా! అయితే ఎక్కడ వున్నారు?"

ఒక్క క్షణం ఆలోచించాడు జాన్. "అండర్ వియర్ తప్ప అన్నీ ఇక్కడే వున్నాయి–బాత్ రూంలో వుండవచ్చు... పదండి చూద్దాం."

మాల గాభరాలా, జాన్ ఉషారుగా బాత్ రూందగ్గరికెళ్ళారు.

లోన చప్పుడు లేదు.

జాన్ తలుపు తట్టాడు.

"మిస్టర్ రావ్! స్నానం చేస్తున్నారా?"

సమాధానం లేదు.

జాన్ చిన్నగా తలుపు నెట్టాడు. తెరుచుకుంది. లోపల రావ్ లేడు, సరికదా నేల తడిగా లేదు.

నిట్టూర్చి వెనక్కి తిరిగాడు జాన్. "లావెట్రీలో చూద్దాం!"

లావెట్రీలో కూడా రావ్ లేడు.

ఇద్దరూ తిరిగి బెడ్ రూంలో కొచ్చారు.

"మాలా, మీరు నిజం ఎందుకు చెప్పడం లేదు?" అడిగాడు జాన్ సీరియస్ గా.

"నేనేం అబద్ధం చెప్పాను?"

"మీ భర్త దుస్తుల గురించి. రాత్రి చూసినప్పుడు ఒక జత తక్కువ వుందని చెప్పారు. ఇప్పుడన్ని జతలు వున్నాయి. ఇదెలా సాధ్యం? మీరు సరిగా చూశారా? ...ఆయనకి పదకొండు జత లున్నాయని కచ్చితంగా తెలుసా?"

"ఆయనకి పదకొండు జతలున్నాయి__రాత్రి చూసినప్పుడు ఒక జత లేదు" అందామె భారంగా. ఆమె ముఖం

పాలిపోయి వుంది.

"విచిత్రంగా వుంది!" అన్నాడు జాన్ ఉత్తరాలందుకుంటూ, "సరే—మీరు డికాక్షన్ చెయ్యండి. ముందు చల్లటి మంచినీళ్ళు పట్రండి—"

"సారీ జాన్! ఉదయంనుంచీ ఫ్రిజ్ ఆన్ చెయ్యలేదు!"

జాన్ ఆమెని సూటిగా చూశాడు. "ఫరవాలేదు. టాప్ నీళ్ళు పట్రండి!"

ఆమె తటాలున బయటికెళ్ళింది.

జాన్ అలసటగా ఒక్కో ఉత్తరం చూడసాగాడు. వాటిలో బిజినెస్ ఉత్తరాలేమీ లేవు. అన్నీ బంధుమిత్రులు వ్రాసినవి. వాటిలోని విషయాలు ఆసక్తి కలిగించలేదు జాన్‌కి.

ముందుకి వంగి ఉత్తరాలు టీపాయ్‌మీద పెడుతుండగా అతని దృష్టి బెడ్ కింద పడింది.

కొన్ని క్షణాలు రెప్ప వెయ్యకుండా చూస్తూండిపోయాడు.

బెడ్ కింద చిన్న దూదివుండ పడివుంది.

ఇంతలో మాల వచ్చింది ట్రేతో. జాన్ లేరుకుని లేచి, బెడ్ దగ్గిరకెళ్ళి కిందనుంచి దూదివుండ తీశాడు. మాల దాన్ని తికమకగా చూసింది. జాన్ దాన్ని వాసన చూశాడు.

"ఏమిటది?" అడిగింది మాల.

"దూది—క్లోరోఫాంలో తడిపింది."

ఆమె కలవరంగా చూసింది.

"క్లోరోఫాం స్పృహపోగొట్టడానికి ఉపయోగిస్తారు" అన్నాడు జాన్.

ఆమె ఉలికిపడింది. "అంటే—?"

"రాత్రి ఇక్కడికి ఎవరో వచ్చారు. మీ భర్తని తెలివితప్పించి తీసికెళ్ళిపోయారు."

కెవ్వున అరిచింది మాల.

జాన్ గబగబ బెడ్ ని చిందరవందర చేశాడు.

తలగడకింద ఒక కాయితంముక్క దొరికింది. దాని మీద స్పష్టమైన అక్షరాలున్నాయి.

"మీరు డబ్బు యివ్వరని మాకు తెలుసు. మమ్మల్ని తక్కువ అంచనా వెయ్యకండి, డబ్బు యెలా రాబట్టుకోవాలో మాకు తెలుసు—"

జాన్ ఈ వాక్యాల్ని పైకి చదివాడు. మరోసారి అరిచి సోఫాలో కూలబడింది మాల.

రెండు చేతుల్లో ముఖం దాచుకుని యేడుపు ప్రారంభించింది.

# 3

జాన్ చకచక మెట్లెక్కి ఆఫీసులో కొచ్చాడు.

"డిసీజ్ ఎ డామ్ స్ట్రేంజ్ ఎఫైర్ యార్!"

లాల్ తలెత్తి జాన్ ని చూశాడు, "ఏం జరిగింది?"

"అంతా గందరగోళంగా వుంది!" అలసటగా అన్నాడు జాన్.

"కమాన్, కూచొని కనుక్కున్నది కక్కు!"

జాన్ కూచొని చెప్పాడు:

"నందనరావుకున్న పదకొండు జతల బట్టలూ ఇంటిలోనే వున్నాయి. ఆయన చెప్పులు, బూట్లు, వాచీ, లుంగీలు, బనియన్ లు...అన్నీ ఇంట్లోనే వున్నాయి— ఒక్క అండర్ వియర్ తప్ప. బహుశా ఆ అండర్ వేర్ ఆయన వంటిమీద వుండొచ్చు.

"ఇక, బెడ్ కింద ఈ దూది; తలగడకింద యీ కాయితం దొరికాయి. వీటిని బట్టిచూస్తే రాత్రి రావ్ ని

ఎవరో ఎత్తుకుపోయారని తెలుస్తోంది. డబ్బుకోసం ఆయనను ఎవరో బ్లాక్ మెయిల్ చేస్తున్నారు. అయితే ఇందులో నాకు మాల పాత్ర అర్థంగావడంలేదు.''

''ఏమిటామె గురించి?''

''రాత్రి అగంతకులెవరో ఇంటికి వచ్చినట్లు తెలుస్తోనే వుంది. పక్కనే పడుకున్న ఆమె భర్తని ఎత్తుకుపోతున్నా ఆమెకు మెలకువ రాలేదు?''

''ఆమెకుకూడా క్లోరోఫాం వాసన చూపించి వుండవచ్చు.''

''నో, ఆమెకి ఒంటిగంటకి మెలకువ వచ్చిందని చెప్పింది.''

''బహుశ ఆమె అప్పటికి స్పృహలోకి వచ్చి వుండవచ్చు.''

''అంటే—ఎంతసేపు స్పృహ తప్పిందంటావు?''

''అది వాసన తీవ్రతమీద ఆధారపడి వుంటుంది.''

''సరే, ఆమెనికూడ స్పృహ తప్పించారనుకుందాం'' అన్నాడు జాన్, ''ఒంటిగంటకు ఆమెకి మెలుకువ వచ్చింది. లేచిచూస్తే భర్తలేదు. కొంతసేపు వేచిచూసి ఆయన దుస్తుల్ని చూసింది—ఒకజత లేదు. వెల్, మరిప్పుడెందుకున్నాయి? ఎలావచ్చాయి? ఆమె పొరబడిందా?''

లాల్ చాలసేపు మౌనంగా ఆలోచించి అడిగాడు:

''ఇంట్లో ఆమె ప్రవర్తన ఎలావుంది?''

''విచిత్రమైన ప్రవర్తన! ఆమెతో విసిగిపోయాను! ప్రతిక్షణం దేనికో భయపడుతూ, దేనికోసమో జాగ్రత్తపడుతూ ప్రవర్తించింది—''

''అంటే, తనేదేనా పొరపాటు చేసినట్టు ప్రవర్తించిందా?''

''అంతే—సరిగ్గా అంతే. కానీ లాల్, యేమిటా

పొరపాట్లు?" అడిగాడు జాన్.

లాల్ నవ్వాడు: "ఆమె ప్రవర్తన ఆఫీసులోనే గమ్మత్తుగా వుంది! భర్త ఆమెకు గుండుసూదితో సమానము—ఆమె కావలసింది భర్త కాదు, అతని డబ్బు. నువ్వు దుస్తులు గురించి ప్రశ్నించినప్పుడు ఆమె ముఖం రంగులు మారడం నేను గమనించాను. బహుశ ఆమె లోతుగా ఆలోచించి ప్లాను సిద్ధం చేసుకో లేదనుకొంటాను."

"వాట్! లాల్, ఏమిటి నువ్వనేది?"

"మేసన్‌ని మేల్కొలుపు! మాల వ్యవహారం స్పష్టంగా తెలుస్తుంది."

"మేసన్ ఇప్పుడు లేవడు. నీకేం తట్టిందో చెప్పు!"

లాల్ సిగరెట్ వెల్గించి అన్నాడు:

"మాల ఏ విషయంలోనూ భర్తని గౌరవించదు. అతన్ని మర్యాదగా సంబోధించదు. బహుశ వాళ్ళిద్దరి మధ్య మనస్పర్థలు వుండవచ్చు. ఏదేనా తగాదా వుండవచ్చు. మాలని చూస్తే పేచీకోరులా వుంది. వారిద్దరిమధ్యం తగాదా విడాకులకి దారితీసి వుండవచ్చు...రావ్ ఆమెకి విడాకులివ్వాలని నిశ్చయించుకుని వుంటే ఆమె యేం చేస్తుంది?"

"ఏం చేస్తుంది?"

"విడాకులు తీసుకుంటుంది" అన్నాడు లాల్, "దాని వల్ల ఆమెకేవిటి లాభం? భరణంకింద కొంత డబ్బు వస్తుంది. డబ్బు ఆమెకి ముఖ్యం. డబ్బు వస్తుందంటే ఆశకు అంతు ఎక్కడ వుంటుంది? భరణంకింద వచ్చే డబ్బు ఆమెకు తృప్తి కలిగించక పోవచ్చు. కాబట్టి విడాకుల తర్వాత ఆమె ఆశించేడబ్బు సంపాదించుకోవాలంటే మార్గమేమటి?"

"భర్తని మర్డర్ చేస్తే చాలు. విడాకులూ, భరణం సమస్యలుండవు. యావదాస్తి వస్తుంది" అన్నాడు జాన్.

"కానీ ఆ పని చెయ్యదు" లాల్ అన్నాడు.

"ఎందుకు చెయ్యదు?"

"ఆమె తెలివిగలది. ఎంత తెలివివున్నా హత్యచేసి తప్పించుకోలేమని ఆమెకి తెలుసు. అందువల్ల హత్య చెయ్యదు. హత్యచేస్తే ఐశ్వర్యం అనుభవించడంగాక, యావజ్జీవితం జేలుశిక్ష అనుభవించే పరిస్థితి ఏర్పడవచ్చు. కాబట్టి ఆమె ఆశకి కొన్ని హద్దులు ఏర్పరచుకుంది. ఆమె కోరేది యావదాస్తి కాదు. ఆస్తిలో కొంత భాగం."

"అదెలా లభిస్తుంది?"

"ఫేక్ కిడ్నాప్ వల్ల" అన్నాడు లాల్, "భర్తను కిడ్నాప్ చేసి ఎక్కడో బంధిస్తుంది. ఈ పని తను చేసినట్టు మొగుడుకి తెలియకుండా జాగ్రత్త పడుతుంది. బంధించిన చోట భర్త నగ్నంగావుంటే, అతని పరువు ప్రతిష్టల దృష్ట్యా అరిచి గోడవచేసి తప్పించుకోనే ప్రయత్నం చెయ్యడు."

"అవును. ఆ తర్వాత?"

"మాల తను కోరేది మరోవ్యక్తి సాయం లేకుండా సాధించుకోలేదు. అందువల్ల ఈ బిజినెస్‌లో ఆమెకి ఎవరోవ్యక్తి సహాయపడుతున్నాడు.

"ఆ మనిషి నిన్నరాత్రి నందనరావు ఇంటికివచ్చాడు. అతనిదగ్గర క్లోరోఫాం దూదివుంది. బహుశ అతను క్లోరోఫాం ఏ మందులషాపునుంచో, లాబ్ నుంచో సంపాదించి వుంటాడు. అతను వచ్చాక మాలతోకలసి రావ్‌ని స్పృహ తప్పించాడు. మాల అతని లుంగీ, బనియన్ తీసేసింది. లోన అండర్‌వియర్ వుంది. అతను తలగడ కింద ఆ కాయితం పెట్టాడు. ఆ తర్వాత ఇద్దరూ కలిసి

రావ్‌ని బయట కారులో చేర్చారు. అతను కారు తీసుకుని తమ స్థావరానికి వెళ్ళిపోయాడు. రావ్‌ని అక్కడ బంధించి తిరిగివచ్చాడు. కారును వదిలేసి వెళ్లిపోయాడు. అంతవరకు ప్లానులో మొదటిదశ ముగిసింది...

"ఇక రెండవదశ: ఉదయం మాల మన దగ్గరకు వచ్చింది. భర్త కనిపించడం లేదని రిపోర్టు యిచ్చింది. ఆమె ఉద్దేశ్యం తనభర్త కిడ్నాప్ చేయబడ్డాడని మన ద్వారా బయిట పడాలని. భర్తను గాలించడానికి మనం రంగంలోకి దిగుతాం కాబట్టి, మనపని సులువు చెయ్యడానికి తన ఇంట్లో బెడ్ కింద దూది, తలగడకింద కాయితము వుంచింది.

"కానీ, మనం రావ్ దుస్తుల విషయం అడుగుతామని ఆమె వూహించలేదు. నువ్వా విషయం అడిగినప్పుడు తను చేసిన పొరపాటు తెలిసి ముఖం ఎర్రబడింది. గాభరా పడింది. రావ్ మాయమయ్యాడు కాబట్టి, అతను దుస్తులలో వుండాలి కాబట్టి, ఒకజత తక్కువ వుందని చెప్పింది. ఇంటరాగేషన్‌లో దుస్తుల ప్రస్తావన వస్తుందని వూహించివుంటే, రాత్రి రావ్ జతల్లో ఒకటి మాయంచేసి వుండేది—"

"ఇప్పుడర్థమయింది!" అన్నాడు జాన్, "రావ్ దుస్తులు చూడాలని చెప్పినప్పుడు ఆమె నన్ను కాస్సేపు ఆపడానికి ప్రయత్నించింది. లోనికెళ్ళి ఆ జత వెంటనే మాయం చెయ్యాలనుకుందేమో!"

"దటీజ్ కరెక్ట్" అన్నాడు లాల్, "ఈకేసు పరిశోధించి ఆమె భర్త కిడ్నాప్ చేయబడ్డాడని మనం తెల్సుకుంటాం కాబట్టి ఈ వ్యవహారానికి మనం సాక్షులుగా వుంటాం. భర్త విడుదలయి వచ్చాక ఆమె కథనం నమ్మడానికి మనం ఉపయోగ పడతాం!"

"గుడ్ లాజిక్. ఇంకా చెప్పు."

"ఇప్పుడు రావ్ కిడ్నాప్ చేయబడ్డాడని మనం తెల్సుకున్నాం. ఆమె ప్లానులో రెండవదశ ముగిసింది.

"ఇక మూడవ దశ: కాసేపట్లో ఆమె భర్తను కిడ్నాప్ చేసిన మనుషుల నుంచి ఫోను వచ్చిందని చెప్తుంది. మనం కిడ్నాపర్స్‌ని పట్టుకోడానికి మాల ఒప్పుకోదు. ఆమె ప్లాను గల్లంతవుతుంది. భర్త ప్రాణాలు రక్షించడానికి డబ్బు చెల్లిస్తానని చెప్తుంది. కాబట్టి ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా మనం ఏమీ చెయ్యలేం. ఆమె తన అనుచరుడి హెచ్చరిక ప్రకారం డబ్బు తీసి కెళ్ళి అతనికి యిస్తుంది. అతను రావ్‌ని విడుదల చేస్తాడు. ఈ వ్యవహారం పోలీసులకి చెబితే ప్రాణాలు తీస్తానని బెదిరిస్తాడు. రావ్ విడుదలయి యింటికి వచ్చాక భార్య కథ నమ్మి, తనని రక్షించినందుకు అభినందిస్తే విడాకుల సమస్య వుండదు. అలా కాక, అతని ధోరణి మునుపటి లాగే వుంటే ఎప్పటికయినా విడాకులు తప్పవు... ఎలా జరిగినా మాలకి నష్టంవుండదు, కావలసినంత డబ్బు సంపాదించుకుంటుంది కాబట్టి."

"ఎంత మోసం! యెంత మోసం!"

"మోసం జరుగుతుంటే మనం గాజులు తొడుక్కుని కూచుంటామా?" అన్నాడు లాల్ సొరుగులోంచి గ్లోవ్స్ తీసి తొడుక్కుంటూ.

"అయితే ఏం చేద్దాం?" అడిగాడు జాన్.

లాల్ టేబులు మీదవున్న కాయితం అందుకొని జాన్‌ని చూసి, "నువ్వొక్క పొరపాటు చేశావు," అన్నాడు.

"ఏం చేశాను?"

"ఈ కాయితంమీద నీ వేలిముద్రలు పడ్డాయి."

"అవును. అయితే?"

"అవి కిడ్నాపర్స్ వేలిముద్రల్ని చెడిపేయవచ్చు" అన్నాడు లాల్, ఆ కాయితాన్ని జాగ్రత్తగా సొరుగులో పెడుతూ.

"దీనిమీద మాల, ఆమె అనుచరుడి వేలిముద్రలు వుండవచ్చు. అవి కేసులో ఉపయోగపడతాయి."

జాన్ మాట్లాడలేదు.

లాల్ వున్నట్టుండి ఫకాలున నవ్వాడు. జాన్ వులిక్కిపడి చూశాడు.

"ఫూల్స్! బిగ్గెస్ట్ ఫూల్స్ ఇన్ ది వరల్డ్!" అరుస్తున్నాడు లాల్, "రావ్ నిర్బంధంలోంచి తిరిగివచ్చాక మనం ఈ ఉత్తరం చూపిస్తే, తనకిలాంటిది అందలేదని అంటాడు! ఈ విషయం ఆలోచించకుండా మాల యీ ఉత్తరాన్ని సృష్టించింది. ఇది రావ్‌కి అందలేదన్న విషయము, దీనిమీద వేలిముద్రలూ ఆమె గుట్టును రట్టు చేస్తాయి! పూర్ మాలా, యూ హేవ్ కమిటెడ్ యువర్ సెల్ఫ్!"

## 4

రాత్రి ఎనిమిది గంటలకి ఫోను మోగింది.

దానికోసమే ఎదురు చూస్తున్నట్టు టక్కున రిసీవర్ ఎత్తాడు జాన్.

"జాన్! ఓహ్, జాన్!" అర్చింది అవతలి కంఠం.

జాన్ మౌత్‌పీస్ మీద చెయ్యివుంచి లాల్‌తో అన్నాడు: "మాల మాట్లాడుతోంది."

లాల్ తిలూపాడు. ,

"ఏం జరిగింది మిసెస్ మాలా" జాన్ అడిగాడు ఫోన్‌లో.

"మీ కలా చెప్పాలి జాన్?"

"నిదానంగా చెప్పండి. ఏం జరిగింది?"

"ఎవడో దుష్టుడు ఫోన్ చేశాడు. భయంకరంగా నవ్వి నా భర్తని బంధించానని చెప్పాడు!"

"అయితే ఏం చెయ్యాలిట?"

"ఓహ్ జాన్, నన్ను రక్షించండి!"

"మిమ్మల్ని కాదు. మీ భర్తని!"

"పదిలక్షలిస్తే వదిలేస్తాడట!"

"అలాగా? అయితే ఇచ్చేయండి!"

"కానీ_ఎలా?"

"కిడ్నాపర్ షరతులేమిటి?"

"రాత్రి పదిగంటలకు పదిలక్షలు తీసుకుని వొంటరిగా సెంట్రలు స్టేషనుకి రమ్మన్నాడు. వెంట ఎవర్నీ తీసుకు రాకూడదట! పోలీసులకి చెప్పకూడదట! ఇలా చేస్తేనే ఆయన క్షేమంగా దక్కుతాడట!"

"మీకు భర్త క్షేమం ముఖ్యం. అలాగే చెయ్యండి."

"కానీ_ఎలా? ఉన్నపళాన అంతడబ్బు యొక్కడి నుంచి తేవాలి?"

"అయితే గడువు పెంచమనండి."

"అడిగాను. వీల్లేదన్నాడు. సరిగా 10 గంటలకి డబ్బు అందాలన్నాడు. లేకపోతే...ఓహ్!"

"అయితే ఏం చెయ్యాలనుకుంటున్నారు?" అడిగాడు జాన్. అతని ముఖం ఎర్రబడింది. మాల తెలివి తేటలకి అతని మతిపోతోంది.

"రెండు గంటల్లో అంతడబ్బు కూడబెట్టడం సాధ్యం కాదు. వాళ్ళు నా భర్త ప్రాణాలు తీస్తారు. మీరు దయచేసి రక్షించండి!"

"ఎలా రక్షిస్తాం?"

"దయచేసి 10 గంటలకి సెంట్రలు స్టేషను కెళ్ళండి. వాడు నాకోసం ఎదురుచూసి నేను రాకపోతే తిరిగివెళ్ళి పోతాడు. వాడ్ని వెంబడించి స్థావరం కనుక్కోండి— నా భర్తని విడిపించండి."

"బాగానేవుంది. వాడ్ని మేమెట్లా గుర్తుపడతాం?"

అవతల నిశ్శబ్దం.

కాస్సేపయాక, "అయితే ఎలా?" అంది మాల.

జాన్ వేగంగా ఆలోచించి అన్నాడు: "మీ భర్త ప్రాణాల్ని ప్రతిఫలం ఇవ్వకుండా రక్షించాలంటే చాల రిస్కు తీసుకోవాలి. ఒక అయిడియా చెప్తాను: పది గంటలవరకు డబ్బుకోసం ప్రయత్నించండి. మీ భర్త పలుకుబడి నుపయోగించి డబ్బు సంపాదించడం మీకు కష్టమేమీకాదు. ఒకవేళ లాభంలేకపోతే ఖాళీబ్రీఫ్ కేసుతో స్టేషన్ కి రండి. మేం అక్కడ వుంటాం. కిడ్నాపర్ మిమ్మల్ని చూసి వస్తాడు. మీరు బ్రీఫ్ కేసు అందించండి. మేం మెరుపులావచ్చి అతనిపైన పడతాం!"

జాన్ చివరి మాటలు ఆమెను ఉత్సాహపరిచాయి.

"జాన్! యూ ఆర్ మార్వలెస్! వండర్ఫుల్! తప్పకుండా నా భర్తని రక్షిస్తారు!"

"థాంక్స్. నేను చెప్పినట్టు చెయ్యండి."

"అలాగే జాన్...అలాగే!"

లైను కట్ అయింది.

జాన్ రిసీవర్ విసిరికొట్టి తటాలున లేచినిలబడి అరిచాడు: "లాల్! నువ్వో ఫూల్ వి! మాలని మించిన ఫూల్ వి!"

"ఏం జరిగింది? నేనెందుకు ఫూల్ ని!" లాలన్నాడు తికమకగా.

"నీవ్యూహం తలకిందులయింది. రావ్ యిప్పుడు మర

ణించ బోతున్నాడు.''

''వాట్! ఎలా?''

జాన్ మాలతో జరిగిన సంభాషణ గబగబచెప్పి ఆ తర్వాత అన్నాడు:

''కిడ్నాపర్స్‌కి డబ్బు చెల్లించడానికి మాల సిద్ధంగా లేదు. ఒక వేళ రావ్ నిజంగా ఎవరో అగంతకుల చేత అపహరించబడివుంటే, డబ్బు చెల్లించకపోతే చంపేస్తారు. అలాకాకుండా, ఈ కిడ్నాప్ నువ్వు చెప్పినట్టు మాల సృష్టించిందయితే, ఆమె పథకంలో భాగంగా డబ్బు చెల్లించదు. అప్పుడేమవుతుంది? భర్తని తనే చంపి ఆ పని కిడ్నాపర్స్ చేశారంటుంది! లాల్, నువ్వూహించినట్టు ఆమెకు కావలసింది భర్త ఆస్తిలో కొంత భాగంకాదు—యావదాస్తి!''

లాల్ తటాలున లేచాడు.

''కమాన్, లెటజ్ గో! ఆమె భర్తని ఎలా చంపుతుందో చూద్దాం!''

## 5

పది నిమిషాల్లో డిటెక్టివ్‌లు లిబర్టీ వెనక నందనరావు యిల్లు చేరుకున్నారు.

ఇల్లు నిర్మానుష్యంగా, చీకటిగా వుంది.

ఇంటిముందు కారులేదు.

డిటెక్టివ్‌లు కారు దిగి లోనికి నడిచారు. హాలుతలుపు తెరిచి లోని కడుగులేస్తుండగా, మాల బెడ్‌రూంలోంచి గాభరాగా పరిగెత్తి వచ్చింది. ఆమె ముఖంలో నెత్తురు చుక్కలేదు. లాల్ దగ్గరికి వచ్చి చేతులు పట్టుకుని, ''ఓహ్ లాల్! ఎందుకొచ్చారు? కిడ్నాపర్స్ నిఘా వుంచుతారు!'' అనరిచింది.

లాల్ ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు.

"లాల్! మీరు వెళ్ళిపొండి! నా భర్త క్షేమంగా దక్కాలి! దుర్మార్గులకి యేమాత్రం అనుమానం వచ్చినా?..."

ఆమె యేమంటోందో లాల్ విన్పించుకోడంలేదు. ఆమె చేతుల స్పర్శ అతన్ని వింత అనుభవానికి లోను చేస్తోంది.

లాల్ చేతుల్లో వున్న మాల చేతులు చల్లగా వున్నాయ—మంచులా.

లాల్ ఆమె చేతుల్ని ఇంకా గట్టిగా పట్టుకోవడంతో ఆమె మాటలాపేసింది.

"మీ చేతులు—చాలా చల్లగా వున్నాయి..." అన్నాడు లాల్.

ఆమె ఛటుక్కున చేతులు తీసేసుకుంది.

"ఇప్పుడే చేతులు కడుక్కుని వస్తున్నాను."

"కాదు—మంచులో ఆడుకుని వస్తున్నారు" అని నవ్వాడు లాల్.

ఆమె ముఖం వివర్ణమైంది. "చెప్పండి, యెందుకొచ్చారు?"

"నిలబెట్టే మాట్లాడతారా?"

"ఓహ్, సారీ! కూచోండి."

"బెడ్ రూంలో కూచుందాం."

ఆమె అదిరిపడింది, "వద్దు!"

"ఎందుకు?"

"నే నిప్పుడే బట్టలు మార్చుకుని వస్తున్నాను—విడిచేసిన దుస్తులు అలాగే వున్నాయి. మీరు చూడకూడదు! లాల్, మీరు స్త్రీలని గౌరవంగా చూస్తారు కదూ?"

లాల్ తల తిప్పి జాన్ ని చూశాడు.

జాన్ అన్నాడు: "బయట మీ కారు లేదు. ఎక్కడ వుంది?"

ఆమె తడబడింది, "నా కారు... నా కారు... ఫ్రెండ్ తీసుకెళ్ళింది..."

"ఎక్కడ వుంటోంది?"

"సనత్ నగర్ లో."

"ఎప్పుడొస్తుంది?"

"గంటలో."

"ఆల్ రైట్, డబ్బు విషయం యేమైంది?"

"నేనంతటా ప్రయత్నించాను జాన్! స్వార్థపరులు! అవసరానికి సహాయపడరు! డబ్బు దొరికేలా లేదు! మీ సాయాన్ని కాపాడాలి!—"

"అందుకే వచ్చాం."

"ఇక్కడికా? యేమిటి మీరనేది?"

"లుక్, మాడమ్. మీ భర్తని ఎక్కడ బంధించారో మాకు తెలీదు. మీ వెంట వచ్చి కిడ్నాపర్స్‌ని పట్టుకోవడం చాలా ప్రమాదకరం. మీ మీద యేమాత్రం అనుమానం కలిగినా మీ భర్తని చంపేస్తారు. కాబట్టి మేమొక మార్గం ఆలోచించాం. మీకు ఫైనల్ వార్నింగ్ యిస్తూ యిప్పుడు ఫోన్ కాల్ రావచ్చు. ఆ కాల్‌ని ట్రేస్ చేసి మేం వాళ్ళని పట్టుకొంటాం. యేమంటారు?"

ఆమె చటుక్కున అంది, "ఆ అవకాశం జారిపోయింది జాన్! ఫైనల్ వార్నింగ్ పది నిమిషాలక్రితం వచ్చింది. డబ్బు సిద్ధం చేశానన్నాను."

డిటెక్టివ్‌లు మతిపోయి ఒకర్నొకరు చూసుకున్నారు.

మాల, లాల్ వేపు తిరిగింది, "లాల్, మీరిక స్టేషన్ దగ్గర మాటువెయ్యక తప్పదు, ప్లీజ్, వెళ్ళిపొండి! సమయం లేదు. నేను భోజనంచేసి రెడీ కావాలి!"

జాన్ నోరూరింది, "మాడమ్, ఒక కోరిక..." అన్నాడు.

"యేమిటి?"

"మేం హోటల్స్‌లో తినీతినీ విసిగిపోయాం. ఆడ వాళ్ళ చేతివంట తినాలని మా కెంతకాలంగానో వుంది- అభ్యంతరం లేకపోతే వడ్డిస్తారా?"

ఆమె కంగారుగా టైం చూసుకుంది.

"అయ్యో! తొమ్మిదవుతోంది! నా భర్త అపాయంలో వుంటే మనం తీరిగ్గా కూచొని తినడానికి టైం లేదు! మరోసారి మంచి పార్టీ ఇస్తాను—"

ఆమె మాట లాపేసింది.

బయట కారాగిన శబ్దం అయింది.

జాన్ నవ్వి, "మీ ఫ్రెండ్ వచ్చింది" అన్నాడు.

ఆమె ముఖంలో నెత్తురుచుక్క లేదు. బయట బూట్ల చప్పుడు వినిపిస్తోంది. కొన్ని క్షణాలయ్యాక ఒక యువకుడు తలుపు తెరుచుకుని వచ్చాడు.

డిటెక్టివ్‌లు మాలని చూశారు. ఆమె ముఖం చెమటతో తడిసి వుంది.

ఆ యువకుడు డిటెక్టివ్‌లను చూసి, "మీ రెవరు?" అన్నాడు.

"లాల్ అండ్ జాన్—పార్ట్‌నర్స్ ఇన్ డిటెక్షన్" అన్నాడు జాన్.

అతను నవ్వి చెయ్యి ముందుకు చాపాడు :

"మిస్టర్ సతీష్. మీరు సహాయపడుతున్నారని మాల చెప్పింది."

"మీ రెక్కడికి వెళ్ళి వస్తున్నారు?" అడిగాడు జాన్.

"డబ్బుకోసం తిరుగుతున్నాను. ఎక్కడా దొరకడం లేదు." అతని ముఖం అలసటగా వుంది.

డిటెక్టివ్‌లు ఒకర్నొకరు చూసుకున్నారు.

సతీష్, మాలతో అన్నాడు : "ఏం చేద్దాం. డబ్బు ఎక్కడా దొరకలేదు. ఇక మీ ఆయన్ని డిటెక్టివ్‌లే రక్షించాలి! రక్షించగలరో, లేదో దేవుడెరుగు! నాకు మాత్రం నమ్మకంలేదు...కిడ్నాప్ బిజినెస్ చాల డేంజరస్..."

"మాట్లాడుతుండండి, నేనిప్పుడే వస్తాను" అని తలుపు తెరుచుకుని బయటికెళ్ళాడు లాల్. మాల, సతీష్ ఒకర్నొకరు చూసుకున్నారు. వాళ్ళకళ్ళు క్రూరంగా మెరుస్తున్నాయి. ఆ తర్వాత సతీష్ జాన్‌కి సిగరెట్ ఆఫర్ చేసి, "మీ ఏజన్సీ ఈ సిటీలో ఢంకా మోగిస్తోందని విన్నాను. మిస్టర్ రావ్‌ని రక్షించ గలరా?" అని అడిగాడు.

జాన్ నవ్వాడు, "ఒకవేళ రక్షించకపోయినా, నేరస్థుల్ని పట్టుకోగలం."

"ఓహ్, మీ మాటలు నాకు ముల్లులా గుచ్చుకుంటున్నాయి. రావ్‌ని రక్షించగలమని నమ్మకంగా చెప్పలేరా?"

"అది పరిస్థితులపైన ఆధారపడి వుంటుంది."

తలుపు తెరుచుకుని లాల్ వచ్చాడు.

అతన్ని చూసి అందరూ నిశ్చబ్దమయి పోయారు.

"వెల్ మాలా. డబ్బుకోసం ఎక్కడెక్కడ ప్రయత్నించారు?" అడిగాడు లాల్.

"ఎందుకు?"

"నేనూ ప్రయత్నిస్తాను."

"మీరా? ఏమిటి మీర నేదీ?"

"ఇలాంటి పరిస్థితిలో మీవల్ల కాని పనులు మావల్ల అవుతాయి."

"సారీ_లాల్! డబ్బు ఎవరిదగ్గరా లేదు."

"నేను డిటెక్టివ్‌ని, తెలుసా? మిస్టర్ రావ్ ప్రాణాలు రక్షించడానికి డబ్బు అత్యవసరమని ఒప్పిస్తాను. కమాన్, ఇందాక ఎక్కడ ప్రయత్నించారు?"

"జమునారావు, సరితా బెనర్జీ, కృష్ణకుమారి, వీరేంద్ర జయిన్!' గబగబ అంటోంది మాల.

"వీరేంద్ర జెయిన్ నెంబర్ చెప్పండి" అన్నాడు లాల్.

మాల చెప్పింది.

లాల్ ఫోన్ అందుకుని నెంబర్ డయలుచేసి, మాలని అడిగాడు: "వీరేంద్ర జెయిన్‌ని ఎంతడిగారు?"

"అతను ఇవ్వగలిగినంత" కసిరింది మాల.

ఫోన్‌లో అవతలి కంఠం విన్పించింది. "వీరేంద్ర జెయిన్ స్పీకింగ్."

లాలన్నాడు, "హాల్లో, సర్. దిసీజ్ లాల్ కాలింగ్. ఎస్ డిటెక్టివ్. మిస్టర్ నందనరావు భార్య మిమ్మల్ని కలుసుకుందా?...డబ్బు విషయం_అవును_అత్యవసరం, అలాగా?...బాగా ఆలోచించి చెప్తున్నారా? దిసీజ్ ఎ సీరియస్ మాటర్. ఓకే. థాంక్యూ!"

లాల్ రిసీవర్ పెట్టేసి మాలని చూశాడు. ఆమె చేతులు నలుపుకుంటూ నిలబడింది.

"వెల్_సారీ మాడమ్, మీ భర్తని రక్షించలేం."

అదిరిపడింది మాల. "ఎందుకు?"

జాలిగా నవ్వాడు లాల్, "మరణించిన వారిని భగవంతుడుకూడా బ్రతికించలేడు!"

కెవ్వుమంది మాల.

"ఏమిటి? ఏమిటి మీరనేది? ఆయనకేమయింది?" సతీష్ అడిగాడు గాభరాగా.

"మరణించారు."

"ఎక్కడ? ఎలా?"

"ఇక్కడ - ఈ ఇంట్లో."

మాల మరోసారి 'కెవ్వు'మని అర్చింది.

లాల్ విసురుగా బెడ్ రూంలోకి దారితీశాడు. ఎంత విసురుగా దారితీశాడో అంత విసురుగా వెనక్కి తిరిగి రివాల్వర్ తీశాడు: "డ్రాపిట్! మాలా, కత్తి పడెయ్యండి!"

మాల ఆవేశంగా వగరుస్తూ కత్తి చేతిలో పట్టుకొని వుంది. జాన్ ఛటుక్కున రివాల్వర్ తీశాడు. సతీష్ చేతులెత్తి కదలకుండా నిలబడ్డాడు.

"డ్రాపిట్!" మళ్ళీ అర్చాడు లాల్.

ఇప్పుడు మాల ముఖం పాలిపోయింది. కత్తి చేతిలో నుంచి జారిపడింది. లాల్ దానిదగ్గరకు నడిచి కర్చీఫ్ చుట్టి అందుకున్నాడు. కత్తి చల్లగావుంది. దాన్ని జాన్ కిచ్చి, "వీళ్ళని కదలనివ్వకు!" అని తిరిగి బెడ్ రూంలోకి దారితీశాడు.

బెడ్ రూంలో ప్రవేశించి లాల్ ఒక్కచూపులో దాని స్థితిని గ్రహించాడు. బెడ్ మీద పసుపురంగు దుప్పటి పర్చివుంది. దానిపైన రక్తం మరకలు లేవు. గోడలు, నేల, కిటికీలు, తలుపులు, బీరువా, ఇతర వస్తువులు వేటిపైనా రక్తం మరకలు లేవు

ఆ తర్వాత అతను తెరచివున్న ఫ్రిజ్ దగ్గరకు నడిచాడు. ఫ్రిజ్ ఆఫ్ చేసి వుంది. అయినా లోన చల్లగా వుంది. అంటే కొంతసమయం క్రితంవరకు ఆన్ లో వుంది. ఫ్రిజ్ ఖాళీగావుంది. లోన పదార్థాలు ఏవీ లేవు. అయితే ఫ్రిజ్ అడుగున ఒక వుంగరం పడివుంది.

అతని ముఖంలో ఉత్సాహం చోటుచేసుకుంది. ఉంగ

రాన్ని అందుకుని బయటకి నడిచాడు.

అతన్ని అందరూ తదేకంగా, వూపిరి బిగబట్టి చూస్తున్నారు. లాల్ మాలని చూస్తూ అన్నాడు:

"మీ భర్తని దారుణంగా చంపారు."

"షటప్! మీకు పిచ్చిపట్టింది!" అర్చింది మాల.

లాల్ నవ్వాడు. "చాల తెలివిగా చంపారు. ఈ వాక్యం సబబుగా వుంటుంది. కానీ కొన్ని విషయాల్లో మీ తెలివి ప్రదర్శించలేక పోయారు. అదే మిమ్మల్ని పట్టించింది!"

"ప్లీజ్, గెటవుట్ లాల్!"

"పూర్తిగా చెప్పనివ్వండి: ఆ తర్వాత పోలీసుల్ని పిలిపించి వెళ్ళిపోతాం. భర్తపట్ల మీకు ప్రేమలేదు, గౌరవంలేదు. మీరు ప్రేమించేది ఆయన డబ్బు.

"డబ్బుకోసం పెళ్ళిచేసుకున్నారు. డబ్బుకోసం ఈ దుర్మార్గం చేసారు. ఈ దుర్మార్గంపై కిడ్నాపింగ్ ముసుగు తొడిగారు. మమ్మల్ని ఎన్నుకుని మీభర్త కిడ్నాప్ చేయబడినట్టు మేం తెలుసుకునేలా చేశారు. ఆ విధంగా ఈ హత్య కిడ్నాపర్స్‌పై మోపబడుతుం దనుకున్నారు. కాబట్టి మీరు క్షేమంగా వుండడమేగాక, మీ భర్త యావదాస్తి అనుభవించగల ననుకున్నారు. మమ్మల్నీ, పోలీసులనీ దద్దమ్మలు చెయ్యాలనుకున్నారు.

"సరే, మీభర్త కిడ్నాప్ చెయ్యబడలేదు. మీ ప్లానేమిటో చెప్తాను: మీ ఫ్రెండ్ మిస్టర్ సతీష్ రాత్రి మీ యింటికి వచ్చాడు — క్లోరోఫాం దూదితో. మీ రిద్దరూ కలిసి మీ భర్తని స్పృహతప్పించారు. ఆ తర్వాత ఆయన వొంటిపైన అండర్ వేర్‌తో ఫ్రిజ్‌లో చేర్చారు. ఫ్రిజ్ మూసి ఆన్ చేశారు. అలా చెయ్యడం వలన వూపిరి అందక, చల్లదనాన్ని తట్టుకోలేక చావు సంభవిస్తుంది

అయితే బెడ్‌రూంలో బెడ్ కింద దూదివుండ, తలగడ కింద బెదిరింపు కాయితం వుంచారు. ఇవి మా పరిశోధనలో బయటపడి మిస్టర్ రావ్ కిడ్నాప్ చేయబడినట్టు నిరూపిస్తాయి.

"ఉదయం మా దగ్గరకువచ్చి మీ భర్త కనిపించడం లేదని నాటకమాడారు. అప్పటికి మీ భర్త యిక్కడే ఫ్రిజ్‌లో మరణించి వున్నాడు–ఒంటిపైన కేవలం అండర్ వియర్‌తో. ఆయన్ని ఫ్రిజ్‌లో బంధించాక మీరొక విషయం మర్చిపోయారు. మీ భర్త కిడ్నాప్ చేయబడినట్టు మమ్మల్ని నమ్మించాలనుకున్నారు కాబట్టి, ఆయన దుస్తుల్లో ఒక జత మాయం చెయ్యాలన్న ఆలోచన మీకు తట్టలేదు. ఇది జాన్ ఇంటరాగేషన్‌లో మమ్మల్ని కలవరపర్చింది. జాన్‌తో యింటికివచ్చాక అతన్ని ఆపి ఆ జత అదృశ్యం చెయ్యడానికి ప్రయత్నించారు – కానీ విఫలమయ్యారు."

జాన్ ఉలిక్కిపడ్డాడు: "అంతేకాదు, నేను మంచినీళ్ళు అడిగినపుడు ఆమె ఫ్రిజ్ అన్ చెయ్యలేదని గట్టిగా అర్చింది!"

"దటీజ్ రైట్" అన్నాడు లాల్, "ఆమె అంతరాంతరాల్లో తాను హత్య చేసిందన్న భయం నాటుకుంది. ఆ భయమే ఆమెనలా అరిచేలా చేసింది. ఈ విషయం నువ్వు పసిగట్టివుంటే వెంటనే ఫ్రిజ్ తెరిచి శవాన్ని చూసివుండేవాడివి."

లాల్, మాలవేపు తిరిగి మళ్ళీ అన్నాడు:

"ఇక–ఇందాక మీరు మాకు ఫోన్‌చేసి కిడ్నాపర్ నుంచి బెదిరింపు వచ్చిందని చెప్పారు. మేము కిడ్నాపర్ కోరినట్టు చెయ్యమని చెప్పాం. అయితే మీరు భర్త క్షేమం ముఖ్యం కానట్టు మాట్లాడారు. అంత తక్కువ

వ్యవధిలో డబ్బు సిద్ధం చెయ్యడం సాధ్యం కాదన్నారు.

"అప్పుడే మీ వుద్దేశ్యం సాకారమయింది. అప్పటి వరకు మీరు భర్తని ఎక్కడో బంధించివుంచి, ఈ ఫేక్ కిడ్నాపింగ్ ద్వారా డబ్బు సంపాదిస్తున్నారనుకున్నాం గాని, మీభర్త ఫ్రిజ్ లో నిర్జీవంగా వున్నాడని వూహించలేదు.

"ఇక మీ మాటలవల్ల మిమ్మల్ని మరోవిధంగా అర్థం చేసుకున్నాం. డబ్బు సిద్ధం చెయ్యడం సాధ్యంకాదని మీరన్నారు కాబట్టి, మీ భర్తని ఎంపి, డబ్బు చెల్లించనందుకు ఆ హత్య కిడ్నాపర్స్ పై మోపుతారని వూహించాము. అందువల్ల మేం వెంటనే ఇక్కడికొచ్చాం— మీ బారినుండి మిస్టర్ రావ్ ని రక్షించడానికి...

"కానీ, నా కప్పుడు తెలిసింది. మీ భర్త మరణించి సుమారు ఇరవయిగంట లవుతోందని, ఆ మరణానికి కారకులు మీరని..."

"ఎలా?"

లాల్ అన్నాడు. "మేం ఇక్కడికొచ్చినప్పుడు మళ్లీ మీ ప్రవర్తన విచిత్రంగావుంది. బెడ్ రూంలోంచి గాభరాగావచ్చి నా చేతులు పట్టుకున్నారు. మీ చేతులు చల్లగా వున్నాయి మంచులా. నా కనుమానంవేసి బెడ్ రూంలో కెళ్దామని చెప్పాను. మీరు విడిచేసినదుస్తులు అలాగే వున్నాయని అభ్యంతరం చెప్పారు. ఇప్పుడు బెడ్ రూంలో చూస్తే అసలు మీ దుస్తులేలేవు. అబద్ధమాడారు. ఇక మీరు డబ్బుకోసం పలుచోట్ల ప్రయత్నించారనికూడా అబద్ధమాడారు. నేను వీరేంద్ర జైయిన్ తో మాట్లాడితే అతను మీరు కలవలేదని చెప్పాడు.

"ఆ తర్వాత కారు గురించికూడా మీరు అబద్ధము

చెప్పారు. మీ కారు ఫ్రెండు 'తీసికెళ్ళిందని' చెప్పారు. కానీ, ఫ్రెండు 'తీసికెళ్ళాడని' ఇప్పుడు తెలుస్తోంది. ఈ వ్యవహారంలో మీకు సహాయపడుతున్న మనిషి సతీష్ అని బోధపడింది."

మాల నిస్సహాయంగా సోఫాలో కూలబడింది. సతీష్ తలవంచుకుని నిలబడ్డాడు.

లాల్ మళ్ళీ అన్నాడు—

"సతీష్ రాకతో ఈ వ్యవహారం మరీ వింతగా తోచింది. అతను డబ్బుకోసం తిరిగి వస్తున్నాడన్నది అబద్ధం. వెంటనే నాకో అనుమానం వచ్చింది. మీ చేతులు చల్లగావున్నాయి? ఆ వెంటనే ఒక ఆలోచన వచ్చింది. బయటికివెళ్ళి మీ కారు చెక్ చేశాను. మీరు తాళాలతో డిక్కీ తెరిచి చూశాను. డిక్కీ అడుగుభాగం చల్లగా వుంది..."

మాల కంఠంనుంచి బలహీనమయిన కేక వెలువడింది.

"మీ చేతులూ, కారుడిక్కీ చల్లగా వున్నాయి కాబట్టి, నాకో భయంకరమైన విషయం బోధపడింది" అన్నాను లాల్, "మీరు భర్తని హత్యచేసి శవాన్ని కార్లో ఎక్కడికో మాయంచేశారు. కారు డిక్కీ, మీ చేతులూ చల్లగా ఎందుకున్నాయి? శవం చల్లగా వుంటం వల్ల. శవం చల్లగా ఎందుకువుంది? ఒక్కటే జవాబు: దాన్ని ఫ్రిజ్‌లో దాచడం వలన.

"నావూహ నిజమయింది! బెడ్‌రూంలో ఫ్రిజ్ తెరిచి వుంది. ఆఫ్‌చేసి కొద్దిసమయం అయింది. లోపల చల్లగా వుంది ఇంకా...అయితే, మిసెస్ మాలా, జాగ్రత్తగా వినండి: ఫ్రిజ్ అడుగుభాగాన నాకు మీ భర్త వుంగరం దొరికింది."

ఈసారి మాల ముఖం చేతుల్లో దాచుకుని ఆర్చింది.

"బహుశ ఈ ఉంగరం శవాన్ని చల్లబర్చడం వలన కండరాలు పలచబడి జారిపోయిందనుకుంటాను."

జేబులోంచి ఉంగరంతీసి చూపించాడు లాల్.

"ఇక, కత్తితో మీరు నాపైన దాడిచెయ్యాలనుకున్నారు." లాల్ ఇంకా కొనసాగించాడు. "ఆ కత్తితోనే మీరు శవాన్ని ఫ్రిజ్‌లోంచి తీశాక పొడిచారనుకుంటా. ఎందుకంటే, కిడ్నాపర్స్ కత్తితో చంపారని పోలీసులు భావించాలని. శవాన్ని ఒకరోజు ఫ్రిజ్‌లో చల్లబరిస్తే రక్తం గడ్డకడుతుంది. అందుకే మీరు పొడిచినప్పుడు శవంలోంచి రక్తం వెలువడలేదు–గదిలో ఎక్కడా రక్తం మరకలు ఏర్పడలేదు. కారు డిక్కీలోకూడా రక్తం మరకలు లేవు. పైగా శవం చల్లదనం కత్తిలో ప్రవేశించింది.

"శవంమీద గాయాలుచేశాక, సతీష్ మాయం చెయ్యడానికి శవాన్ని కారులో వేసుకొని వెళ్ళిపోయాడు. మీరు బెడ్‌రూం శుభ్రం చేస్తున్నారు. ఇంతలో మేం వచ్చాం. మీరు గాభరాపడి ఆ కత్తి బొడ్లో దోపుకొని బెడ్‌రూంలోంచి పరిగెత్తివచ్చారు."

మాల ఒకసారి తలయెత్తి లాల్నీ, జాన్‌నీ మాసి తల దించుకుంది. ఆమె ముఖంలో కళలేదు.

"మాలా, మీ ఇద్దరిపైన ఈ హత్య నిరూపించడానికి మా దగ్గర కావల్సినన్ని ఆధారాలున్నాయి. ఇక మీరు బుకాయించి ప్రయోజనంలేదు. మిస్టర్ సతీష్, మీరు శవాన్ని ఎక్కడ మాయంచేశారు?" అడిగాడు లాల్.

సతీష్ అడ్డంగా తలూపాడు, "చెప్పను!"

లాల్ నవ్వాడు: మీరు చెప్పకపోయినా తెలుస్తోంది. మీరు శవాన్ని నీటిలో పారేశారు. ఈ విషయం మీ ప్యాంటు అంచులు చెబుతున్నాయి, బూట్లుకూడా తడిసి వున్నాయి.

"ఇక పోలీసుల్ని పిలుద్దాం. జాన్, క్రయిం యిన్స్పెక్టర్ మిష్టర్ బాలక్రిష్టన్ కి ఫోన్ చేసి విషయం చెప్పు"

జాన్ తలూపి ఫోన్ దగ్గరకి నడిచాడు.

*　　　*　　　*

మర్నాడు ఉదయం హుస్సేన్ సాగర్ లో నందనరావు శవం తేలింది. శవం కొయ్యాబారి కాళ్ళు చేతులు ముడుచుకుని వున్నాయి. వీపులో రెండు కత్తిగాయాలున్నాయి. శవాన్ని పరీక్షించిన డాక్టరు శవాన్ని చల్లబర్చిన తర్వాత గాయాలు చేసినట్లు చెప్పాడు.

ఊపిరి అందకపోవడం, భరించలేని చల్లదనం వలన చావు సంభవించిందని చెప్పాడు.

—: అయిపోయింది :—

సీరియల్

# అడుగు ముందుకు వేస్తే భస్మమ్!




(ఆఱవ భాగము)

"మా మిత్రుడు పంపిన మంచి కానుక మీరు. మీకు ఘనంగా సత్కారం చేస్తాము. పారిపోయే ప్రయత్నం మాత్రం చేయకూడదు..." అన్నాడా ఆటవికుడు.

ఇద్దర్నీ ఒక గుడిసెలోకి తరలించారు. గుడిసెలో వీరికి సపర్యలు చేయడానికి ఇద్దరు ఆటవిక పడుచులు నియమించబడ్డారు. గుడిసె చుట్టూ పదిమంది బలాఢ్యులైన ఆటవిక యువకులు కాపలా వున్నారు.

గుడిసెలోని ఆటవిక యువతులు స్నేహపాత్రంగా వున్నారు. రామేశం వాళ్ళని చాలా ప్రశ్నలడిగి తెలుసుకున్నాడు.

"మా సపర్యలను మగవాళ్లనుకాక ఆడవాళ్లను పెట్టారేం?"

"అది అతిధులను మేము గౌరవించే పద్ధతి..."

"మేము మీకు అతిథులమా?"

"మా జాతికి చెందనివాళ్ళు మా గుడిసెల్లో ప్రాణాలతో ఉన్నంత కాలమూ అతిథులక్రిందే లెక్క!"

"మా గుడిసె చుట్టూ పటిష్టమైన కాపలా ఎందుకు?"

"మీరు పారిపోకుండా?"

"అయినా పారిపోతే..."

"అసాధ్యం. ఇక్కడినుంచి బయటపడ్డం మా వాళ్ళకు తప్ప ఎవరికీ సాధ్యంకాదు. ఇంతవరకూ మా అతిధులెవ్వరూ పారిపోలేదు..."

"మేమిక్కడ ఎన్నాళ్ళుంటాం?"

"ఈ రోజుతో కలిపి మూడు రోజులు..."

"ఆ తర్వాత మమ్మల్నేం చేస్తారు?"

"అది ఈవేళ చెప్పకూడదు. ఎల్లుండి చెబుతాము..."

"ఎందుకని?"

"మీకు దిగులు కలిగించే మాటలు ఇప్పట్నించీ చెప్పకూడదు..."

రామేశం ఉలిక్కిపడ్డాడు. అంటే ఆమె అభిప్రాయం ఏమిటి?

"దిగులు పడవలసిందేదో జరుగుతుందని తెలిసిందిగదా. అప్పుడే నాలో దిగులు బయల్దేరింది. ఎలాగూ దిగులుగా వున్నాను కాబట్టి ఫరవాలేదు. ఎల్లుండి తర్వాత మమ్మల్నేం చేస్తారు? ఏ దేవతకైనా బలి ఇస్తారా?" అనడిగాడు రామేశం.

"ఈ విషయంలో నన్నేమీ అడగొద్దు. నేనేమీ చెప్పను..." అందా ఆటవిక యువతి. "మీరు

అనవసరపుటాలోచనలు మాని సరదాగా కాలం గడ పండి..."

"సరదాగా అంటే..."

ఆమె నవ్వింది. "మీకు తెలియదా?"

"నేను ముసలివాణ్ణి. నా సరదాలు వేరు. నీ సరదాలు వేరు..."

"ముసలివాడికి పడుచుతనం తెప్పించకపోతే నా ఆతిథ్యం వృధా..." అందామె.

ఆమె మాటలు నిజమేనని మిగతా రెండు రోజులూ ఋజావుచేశాయి. హఠాత్తుగా రామేశం వయస్సు బాగా తగ్గిపోయినట్లనిపించింది. వయసు తగ్గడమేకాక అయనకు జీవితంమీద మోజుకూడా పుట్టసాగింది. టాకూర్‌తో ఆ విషయమే అంటే "మనమిప్పుడు చచ్చిపోయినా ఫరవాలేదు. ఎవరైనా చచ్చేక స్వర్గం చూస్తారు. మనం బ్రతికుండగానే స్వర్గాన్ని చూస్తున్నాం" అన్నాడు.

ఇద్దరికీ బ్రతుకుమీద పెద్దగా ఆశలేదు. కానీ తమకు భవిష్యత్తులో ఏమి రాసిపెట్టివుందో తెలుసుకోవాలని ఇద్దరికీ ఆత్రుతగా వుంది. తమకేదో అనుభం జరుగనున్న దని ఇద్దరూ ఊహిస్తున్నారు. అదేమిటో తెలియక మన నులో కలవరం కలుగుతోంది.

రెండు రోజులు గడిచినాక రామేశంతో గడుపు తున్న ఆటవిక యువతి "ఇది మన ఆఖరు రాత్రి" అంది.

"ఇప్పుడు చెప్పు-రేపు నేనేమవుతాను?" అన్నాడు రామేశం.

"అప్పుడే చెప్పను. రాత్రి చెబుతాను..." అంది ఆటవిక యువతి.

అయితే ఆమె ఇతర విశేషాలు చాలా చెప్పింది రామే శానికి. అతిథులకు గూడెంలోని ఆడపిల్లలనప్పగించడం

ఆ జాతి ఆచారం. అయితే దానికీ ఒక పద్ధతి వుంది. గూడెంలోని ఇళ్ళన్నిటికీ నంబర్లుంటాయి. నంబరువారీగా ఒకరి తర్వాత ఒకరుగా అతిధ్యానికి ఉపయోగపడాలి. సాధారణంగా పెళ్ళికాని పిల్లలే అతిధులకు అప్పగించ బడతారు. ఇంట్లో పెళ్ళికాని పిల్లలు లేనప్పుడు మాత్రం పెళ్ళయినవాళ్ళనుకూడా పంపుతారు.

ఒక్క అతిధుల విషయం మినహాయిస్తే అక్కడి స్త్రీలు నియమబద్ధమైన జీవితం గడుపుతున్నట్టే లెక్క. రామేశంతో గడుపుతున్న యువతికింకా పెళ్ళికాలేదు కానీ అనుభవముంది. రెండు సంవత్సరాలక్రితం ఆమె అతిథి మర్యాదకు వినియోగించబడింది. అదే ఆమెకు ప్రథ మానుభవం. ప్రథమానుభవానికి ముందు ఆమె కుల గురువు వద్ద కొంత శిక్షణ పొందుతుంది. అది సెక్సుకు సంబంధించిన శిక్షణ.

"రెండు సంవత్సరాలలోనే నువ్వు మళ్ళీ అతిథి మర్యాదకు వినియోగించబడ్డావంటే అతిధులు చాలా తరచుగా వస్తూంటారని అనుకోవాలి" అన్నాడు రామేశం.

"అదేంకాదు. అతిధి మర్యాదకు ముప్పై ఏళ్ళలోపు వారిని నియోగించరు..." అంది.

"అతిథి మర్యాద విషయంలో మీవాళ్ళు నాకు చాలా నచ్చారు. కుల గురువు మీకు శృంగార శిక్షణ ఇస్తా డన్నావు—మరి కులగురువు కూతురి కెవరిస్తారు?" అన్నాడు రామేశం.

ఆటవిక యువతి ఆ ప్రశ్నకు విరగబడి నవ్వింది—"భలే సందేహాలొస్తూంటాయి మీ నాగరకులకి. కుల గురువు కూతురి విషయం నాయకుడు చూసుకుంటాడు."

"నీ తండ్రి నాయకుడయ్యే అవకాశ ముండదా?"

"ఎందుకు?"

"నువ్వు నన్ను రక్షిస్తావని!"

"అలా రక్షించను. ప్రాణం పోయినా మా పద్ధతులు విడనాడం. నా తండ్రి నాయకుడు కాకపోయినా నాయకుడికి కుడి భుజం. ఆయనకు చాలా రహస్యాలు తెలుసు. వాటిలో కొన్ని నాకూ చెబుతూంటాడు..." అంది ఆటవిక యువతి.

"రహస్యాలంటే ఎలాంటివి?"

"ఊహుఁ నేను చెప్పను."

ఆ రాత్రి రామేశం ఆమెకు మళ్ళీ గుర్తు చేసాడు తన ప్రశ్న విషయం.

"చెబుతున్నాను విను...కానీ కంగారు పడకు..." అందామె—"నీకు మృత్యులోయ తెలుసా!"

"తెలియదు. అదెక్కడుంది?" రామేశం కంగారుగా అడిగాడు.

"అయితే రేపు తెలుస్తుంది..." అందామె.

"వివరంగా చెప్పు..." అన్నాడు రామేశం.

"మిమ్మల్ని మీ స్నేహితుణ్ని రేపు మృత్యులోయకు పంపిస్తారు..."

"మృత్యులోయ ఎక్కడుంది?"

"గూడేనికి దగ్గరలోనే వుంది... అందులోకి వెళ్ళినవారు మరి బ్రతికి రాలేరు..."

"ఎందుచేత?" అన్నాడు రామేశం.

"లోయంటే మరీ పెద్దదికాదు. నుయ్యికంటె కాస్త పెద్దదిగా వుంటుంది కానీ చాలాలోతువుంటుంది. గోడలు నున్నగా వుంటాయి. అందులో పడ్డవాడు మళ్ళీ పైకి రావడం కష్టం. మూడు రోజులకు సరిపడ్డ ఆహారమిచ్చి మిమ్మల్నందులోకి దింపుతారు. ఆ తర్వాత మీ సంగతి

ఎవరూ పట్టించుకోరు. తిండి వున్నప్పటికీ బ్రతకలేనంత అసహ్యంగా అక్కడ వుంటుందని చెప్పుకుంటారు..." అందామె.

రామేశం గుండెలు గుబగుబలాడాయి—"ఎందుకు మమ్మల్ని ఆ లోయలోకి దింపాలనుకుంటున్నారు?"

"మేము పూజించే దేవతకు రక్తపాతం కిట్టదు. సహజంగా మరణించిన వాళ్ళనే ఆవిడ స్వీకరిస్తుంది. అందుకే ఈ మృత్యులోయను ఎప్పుడో కొన్ని వందల సంవత్సరాల క్రితం మా పూర్వీకులు సృష్టించారట. ఈ విధంగా ఏటా ఓ పదిమంది మనుషులైనా సమర్పించగలిగితే మా గూడెం సుఖంగా వుంటుంది."

తన జీవితానికి అంతం సమీపించిందని రామేశం గ్రహించాడు. అదీ సుఖమైన అంతంకాదు. అంతవరకూ పోయిన ముగ్గురూ అదృష్టవంతులు. క్షణాలమీద ప్రాణాలు పోయాయి. ఇప్పుడు తనూ, టాగూర్ దుర్గంధపూరితమైన వాతావరణంలో తిండి తిప్పలు లేక అలమటించి పోవాలి. అలా అలమటిస్తూ ప్రాణాలు కోల్పోవాలి. అత్యంత భయంకరమైన చావు అది!

"మేము ఒక అపూర్వ నిధి ప్రాంతంనుంచి ఇక్కడకు పంపబడ్డాము. అక్కడున్న వాళ్ళు నాగరికులు. వాళ్ళకు మీకూ ఏమిటి సంబంధం?" అనడిగాడు రామేశం.

"వాళ్ళ నిధికి మేము రక్షకులం. మా ద్వారా ఆ నిధిని చేరితే ఏ ఆపదా వుండదు."

రామేశం ఆశ్చర్యపడ్డాడు—"మీరా నిధికి రక్షకులా? నాగరకుల కుపయోగపడుతున్న ఆ ప్రాంతానికి మీరెప్పుడు ఎలా రక్షకులయ్యారు?"

"ఒకరోజులో పోతున్న నీకీ రహస్యాలు కాస్త చెప్పడంలో నాకు కష్టంలేదు. ఇది చాలా తక్కువ మందికి

తెలిసిన విషయం. ఇక్కణ్నించి బయల్దేరి నాగరక ప్రాంతం చేరితే మొట్టమొదట వచ్చేది గంగాపురం గ్రామం. ఆ గ్రామానికి పదిమంది పెద్దలున్నారు. వారిలో కొందరు ముఖ్యులకూ మా జాతికీ కొన్ని ఒప్పందాలు న్నాయి. వారు మా దగ్గరకు పంపిన సందేశాన్నిబట్టి మేము నడుచుకుంటాము. నిధిలో పనిచేయడానికి కొత్త మనుషులు అనవసరమైనప్పుడు గంగాపురం గ్రామపెద్దలు ఆ మనుషుల్ని మా దగ్గరకు పంపుతారు. మేము వారిని క్షేమంగా నిధివద్దకు చేరుస్తాము. అలా కాకుండా తమంతట తాముగా ఆ నిధిని చేరబోయిన వారికి మీకు పట్టిన గతే పడుతుంది...'' అందా ఆటవిక యువతి.

రామేశానికి కథ చాలావరకూ అర్థమయ్యింది. ఎటొచ్చీ అర్థం చేసుకుని ప్రయోజనంలేదు. తమ జీవితాలకు అంత్య కాలం సమీపించింది.

ఏది ఏమైతేనేం__ రామేశం భయపడుతున్న ఆ క్షణం రానే వచ్చింది. ఆయన టాకూర్‌కు తమ పరిస్థితి అంతా వివరించి చెప్పాడు. టాకూర్ ఆటవిక యువతితో ఆనం దాన్ననుభవించాడు కానీ అతడికి ఆమె భాష రాదు.

రామేశం చెప్పిందంతా విని__''పిరికి వాడికి పది రకాల చావులు కానీ ధైర్యవంతుడి దొక్కటేచావు. చావు గురించి ఆలోచించవద్దు. ఏం జరిగినా అనుభవించక తప్పదు. అదృష్టం ఇన్నాళ్ళు బ్రతికించింది. ఇక ముందేం చేస్తుందో చూద్దాం__'' అన్నాడు టాకూర్.

పెద్ద ఆర్భాటమేదీ లేకుండానే రామేశాన్ని, టాకూర్‌నూ మృత్యులోయవద్దకు తరలించారు. రామేశం ఆ ప్రాంతాన్ని పరిశీలించాడు. అదో పెద్ద గొయ్యిలావున్నది కానీ అడుగు కనిపించడంలేదు.

ఆ పక్కగా ఒక పెద్ద బుట్ట. ఆ బుట్టలో ఆహార పదా

రాలు, ఇద్దరు మనుషులు కూర్చోవడానికి చోటు. పైన ఒక కొక్కెం. ఆ బుట్ట పక్కగా పొడవైన తాడుచుట్ట పడివుంది. మృత్యులోయకు అడ్డంగా పడివున్న కర్ర మీదుగా ఆ త్రాటికి బుట్టను కట్టి తమను మృత్యులోయ లోకి దింపుతారని రామేశమూ, టాకూరూ ఊహించారు.

వాళ్ళతోపాటు అక్కడ ఆటవిక నాయకుడూ, కుల గురువూ, అతిథులిద్దరికీ ఆనందాన్నిచ్చిన ఆటవిక యువ తులూ మాత్రం వున్నారు.

కుల గురువు ఏవో మంత్రాలుచ్ఛరిస్తున్నాడు. అది సంస్కృతంకాదు. బహుశా ఏదో ఆటవిక భాష అయ్యుం టుంది.

కాస్సేపయ్యాక అక్కడకు చాలామంది వచ్చారు.

ఆటవిక నాయకుడు చప్పట్లు కొట్టాడు. వెంటనే కొంతమంది యువకులూ, యువతులూ పరుగు పరుగున వచ్చి రామేశాన్నీ, టాకూర్‌నూ చుట్టుముట్టారు. కొంత సేపు ఆటవిక నృత్య ప్రదర్శన జరిగింది. అంతా ఆనం దంతో చప్పట్లు కొడుతున్నారు కానీ రామేశం, టాకూర్ క్షణాలు లెక్కపెట్టు కుంటున్నారు. వాళ్ళ ముఖాల్లో కత్తివాటుకు నెత్తురు చుక్క లేదు.

నృత్య ప్రదర్శన అయ్యేక ఆటవిక నాయకుడు రామే శాన్నీ, టాకూర్‌నూ బుట్ట దగ్గరకు నడిపించుకు వెళ్ళి— అందులో నిలబడమన్నాడు. ఇద్దరూ ఒక పర్యాయం చుట్టూ చూశారు. ఆయుధాలు ధరించి పదిమంది బలా ఢ్యులు తమకు చుట్టూ అర్ధ చంద్రాకారంలో వున్నారు. తమ జీవితానికది చరమకాలమేనని ఇద్దరూ అనుకున్నారు.

"ఇప్పుడు మీకు మత్తు కలిగించే పానీయాన్నిస్తాము. అది సేవించాలి. అందుకు ముందు ఆఖరిసారిగా అన్ని మత్తులకూ మించిన ఆడదాని ముద్దు కూడా రుచిచూడ

వచ్చు. ఇదీ మా ఆచారం'' అన్నాడు ఆటవిక నాయ
కుడు.

అంతా కాస్త దూరంగా వెళ్ళారు. ఆటవిక యువతు
లిద్దరూ రామేశాన్నీ, టాకూర్‌నూ సమీపించారు. జీవి
తంలో మళ్ళీ ఇటువంటి అవకాశం రాదని గ్రహించి,
అంతటి నిరుత్సాహ పరిస్థితుల్లోనూ వారిద్దరూ ఆ యువ
తుల్ని గాఢంగా చుంబించారు.

''నువ్వు చాలా అదృష్టవంతుడివి...'' అందా ఆటవిక
యువతి రామేశంతో ''ఈ రోజు అపూర్వమైన
దినం.''

''ప్రాణాలు పోతున్న నాకింకా అదృష్టమేమిటి?''
అన్నాడు రామేశం.

''అదృష్టమేమరి! మృత్యులోకంనుంచి బయట ప్రపం
చానికొక ద్వారం వుంది. అది బండరాతితో మూయబడి
వుంటుంది. ఎంతటి బలాఢ్యులూ దానిని కదిలించలేరు. ఆ
రాతిని కదిలించడానికి మా గూడెంలోంచి ఏర్పాటుంది.
సంవత్సరానికొకసారి ఆ రాతిని కదిలిస్తారు. మృత్యు
లోయలో చనిపోయిన మనుషుల ఆత్మలు మళ్ళీ మా
గూడేనికి వచ్చి పీడించకుండా బయటి ప్రపంచంలోకి
పోవడంకోసం ఈ ఏర్పాటు చేశారు.''

''చాలా బాగుంది. ఏడాదికొకసారి తప్పితే ఆత్మలు
కదలేవా?''

''అదే మా విశ్వాసం. చచ్చిన రెండేళ్ళ వరకూ
ఆత్మ చలనం లేకుండా పడివుంటుంది. ఆ తర్వాత అది
కదలడానికి ప్రయత్నించి దరిదాపుల్లో ఏ మార్గముంటే
దానిద్వారా బయటకు పోవడానికి ప్రయత్నిస్తుంది. ఆ
ప్రకారం ఈ రోజు రాత్రి ఆ ద్వారాన్ని తెరవబోతు
న్నారు. ఈ విషయం నాకిప్పుడే తెలిసింది, ఇంతవరకూ

ద్వారం తెరిచే రోజునే మనుషులను మృత్యు లోయలోకి దింపడం ఇదే ప్రథమం—బహుశా ఇది మీ అదృష్టమనుకుంటాను..." అందామె.

రామేశం కళ్ళు మెరిసాయి. అంతలోనే ఆయనకో అనుమానం వచ్చింది. "ఈ విషయం నాయకుడికి గుర్తులేదేమో! ఆ ద్వారాన్ని తెరవడమో, మమ్మల్ని లోయలోకి పంపడమో వాయిదా వేస్తాడనుకుంటాను..."

"అలా ఎన్నటికీ జరుగదు. మా గూడేనికి వచ్చిన నాగరీకుల్ని మూడు రోజులకుమించి ఉంచుకోము. అలాగే మృత్యులోయ ద్వారం తెరుచుకోవడం విషయంలో కూడా కచ్చితమైన నియమం పాటిస్తాము. ఈ రోజే మృత్యులోయ ద్వారం తెరిచే రోజని నాకు గుర్తులేదు. గుర్తురాగానే మీరు నిజంగా చాలా అదృష్టవంతులనిపించింది. అందుకే ఈ విషయం చెబుతున్నాను..." అందామె.

ఆ యువతులిద్దరూ అక్కణ్ణించి కదిలారు. రామేశం టాకూర్‌కు కొత్త విషయం చెప్పాడు. టాకూర్ ముఖంలో కూడా ఆనందం కనబడింది.

ఈలోగా ఆటవిక నాయకుడు వారిద్దర్నీ సమీపించాడు. ఇద్దరికీ మత్తు పానీయాలందించబడ్డాయి. అవి సేవించి ఇద్దరూ బుట్టలో కూలబడిపోయారు. మళ్ళీ వాళ్ళిద్దరికి మెలకువ వచ్చేసరికి మృత్యు లోయలో వున్నారు. ఇద్దరూ పరస్పరం భుజాలు తట్టుకుని లేచి నిలబడ్డారు.

అక్కడ మరీ అంత చీకటిగా లేదు. ఎక్కణ్ణించి వస్తోందో ఎలా వస్తోందో కానీ సాయంకాలపు ఎండలా వుంది. ఆ ప్రాంతమంతా దుర్గంధం. భరించలేనంత వాసన. ఇద్దరూ ముక్కులు మూసుకున్నారు కానీ ఎంత

సేపని అలా వుండగలరు? క్రమంగా అలవాటు పడక తప్పలేదు.

"ఈ దుర్వాసన ఎంతో సేపు భరించలేము. ఇందులో ఎంతో సేపు బ్రతకలేము" అన్నాడు టాగూర్. ఆ వాసన వల్ల కలిగిన అసహ్యాం అతడి కళ్ళలో ప్రతిఫలిస్తోంది.

"ఈ బుట్టను వాళ్ళు కట్టిన తాడు వుండాలిగదా! దాని సాయంతో మళ్ళీ పైకి వెళ్ళగలమేమో చూద్దాం..." అన్నాడు రామేశం.

అయితే ఇద్దరూ ఎంత చూసినా తాడుకాదు సరిగదా బుట్టను తగిలించిన కొక్కెంగూడా లేదు. ఇద్దరూ ఉస్సూరంటూ నిట్టూర్చారు.

"బహుశా అన్ని బుట్టలకూ ఆ తాడును, కొక్కాన్నీ వాడుతూంటారేమో! బుట్ట నేలను తగలగానే విదిలించి మళ్ళీ పైకి లాగేసుకోవడం వాళ్ళకు తెలిసివుంటుంది" అన్నాడు టాగూర్. అంతే అయుండాలని రామేశం కూడా అనుకున్నాడు.

ఇద్దరూ కాసేపు మృత్యులోయను సర్వే చేశారు.

మృత్యు లోయ అని పిలవబడే ఆ ప్రదేశం ఓ రెండు వాలీబాల్ కోర్టులంత ఆవరణలో వుంది. గుండ్రంగా నుయ్యిలా వుంది. ఎంతో లోతుగా వున్నప్పటికీ నేల చెమ్మగాలేదు. బాగా పరీక్షించగా అదంతా రాతితో తాపడం చేసినట్లు వారికి తోచింది. దానినిబట్టి ఈ లోయను ప్రత్యేకంగా నిర్మించినట్టు వారిద్దరూ భావించారు.

మృత్యులోయ చుట్టూకూడా పటిష్టమైన శిలలున్నాయి. బయటకు పోవడానికి ఎక్కడా సూదిమొన మోసేటంత సందుకూడా లేదు. అయితే వెలుతురు ఎక్కణ్నించి వస్తోందో ఎలా వస్తోందో తెలుసుకోవడం కష్టం.

మృత్యులోయనిండా మానవ కపాలాలు, అస్థిపంజరాలు, ఎముకలు గుట్టలు గుట్టలుగా ఉన్నాయి. ఎన్నో సంవత్సరాలుగా అక్కడ జరుగుతున్న ఘోర మరణాలకవి ఉదాహరణాలుగా కనబడుతున్నాయి. అప్పుడప్పుడే కుళ్ళి కృశించిపోతున్న మూడు శవాలనుకూడా వాళ్ళు చూశారు.

ఆ శవాల ముఖాలు చూద్దామన్నా గుర్తు తెలియకుండా మహా భయంకరంగా వున్నాయి. వాటిలో ఒకటి స్త్రీశవం! ఆ శవాన్ని చూస్తూనే ఇద్దరూ ఉలిక్కి పడ్డారు. ఆడవాళ్ళనుకూడా నిర్దాక్షిణ్యంగా ఈ మృత్యులోయకు బలిచేస్తున్న ఈ ఆటవిక జాతి గురించి ఏమనుకోవాలి?

టాకూర్ ఆలోచనలు వేరే వున్నాయి. "మనిషి బాహ్యరూపం ఇంత భయంకరంగాకూడా ఉంటుందని ఇప్పుడే తెలిసింది. అదృష్టం కరుణించకపోతే మనంకూడా కొన్నాళ్ళకిలాగే తయారౌతాము..."

రామేశం విషాదంగా నవ్వాడు. అక్కడున్న దుర్వాసన ఆయన భరించలేకుండా వున్నాడు. ఆహారం వున్నప్పటికీ ఆ లోయలో ఒకరోజుకు మించి జీవించడం కష్టమని చెప్పిన ఆటవిక యువతి మాటల్లోని నిజం ఆయనకిప్పుడు గోచరించింది.

"నాగరకతకు మధ్యలో జీవిస్తున్న ఈ అనాగరకతను రూపుమాపాలి. అందుకు మనం బ్రతికి బయటపడ్డాక ఏదో ఒకటి చేయాలి..." అన్నాడు టాకూర్.

"అనాగరకత నాగరకతకు మధ్యగా ఎప్పుడూ వుంటూ వస్తోంది. ఈ అరణ్యంలోనే కాక పట్నాలలో, నగరాలలో కూడా వుంటోంది. మనమేమీ చేయలేము. నా ఆలోచన అంతా ఆ అపూర్వ నిధి గురించే! దాన్ని

కనుగొన్న దుర్మార్గుల కారణంగానే మనకీ కష్టాలన్నీ వచ్చాయి. వాళ్ళ అంతు చూడాలి. ఆ నిధిని ప్రభుత్వ పరం చేయాలి...'' అన్నాడు రామేశం.

టాకూర్ బదులివ్వలేదు. ఇద్దరూ ఆశగా ఎప్పుడో తెరుచుకోబోయే ఆ బండరాయి కోసం చూస్తున్నారు. అదెక్కడ వుందో, ఎప్పుడు, ఎలా తెరుచుకుంటుందో_ తెరుచుకుంటే ఆ ద్వారం తమ నెక్కడకు చేరుస్తుందో తమకోసం ఇంకా ఏమేమి కష్టాలు దాగుని వున్నాయో నని వా రాలోచిస్తున్నారు. ఆలోచిస్తూనే మృత్యులోయ అంతా తిరుగుతూ ఏమేమో శోధిస్తున్నారు. అలా తిరుగుతూండగా రామేశం గట్టిగా అరిచాడు_''టాకూర్_ ఇది చూడు ..''

టాకూర్ పరుగున రామేశాన్ని చేరాడు. రామేశం చేతిలో ప్రకాశవంతమైన రాయి ఒకటి వుంది. అది ధగధగా మెరుస్తోంది. దాని పరిమాణం కుంకుడు గింజంత వుంది.

''ఈ పక్కన రెండు రాళ్ళ మధ్య దీన్ని చూశాను. ఇది అపూర్వమైన రాయి అనుకుంటాను. దీని ఖరీదు బహుశా కోట్లలో వుండవచ్చు...'' అన్నాడు రామేశం.

అటువంటి రాళ్ళు ఇంకా దొరుకుతాయేమోనని టాకూర్ కూడా వెతికాడు. అలా వెతగ్గా ఇద్దరికీ కూడా చాలా రాళ్ళు దొరికాయి.

''వీటిని మనం కూడా తీసుకుపోదాం__'' అన్నాడు టాకూర్.

రామేశం ఏదో ఆలోచిస్తూ__''వీటిని జాగ్రత్తగా మూట కడదాం. కానీ ఈ మృత్యులోయ వజ్రాల గనిగా, మణుల నిలయంగా, రత్నకోశంగా నాకు అనిపించడం లేదు. ఈ రాళ్ళిక్కడకు ఎందుకు వచ్చాయి? ఎలా

వచ్చాయి? ఇవి గనుల్లోని రాళ్ళలా కాక సానపట్టబడిన వాటిలా వున్నాయి. కాబట్టి ఎవరో వీటిని ప్రత్యేకంగా ఇక్కడ వుంచారని అనుకోవాలి. అయితే ఎందుకు? ఏం ప్రయోజనం ఆశించి?'' అన్నాడు.

హాఠాత్తుగా టాకూర్ కళ్ళలో భయం కనబడింది. ''ఇవి మనకు రాళ్ళ సందున దొరికాయి. కొన్ని దివ్య సర్పాలకు పడగమీద మణి వుంటుందని అంటారు. అటువంటి దివ్య సర్పాలేమైనా ఇక్కడ నివశిస్తున్నాయేమో!''

ఈ ఆలోచనకు రామేశంకూడా భయపడ్డాడు, అయితే అక్కడ పాములుండడానికి అవకాశం కనపడ్డంలేదు. నేలంతా రాతితో తాపడం చేసినట్లు వుంది. చుట్టూ కూడా అలాగే వుంది.—''ఒకవేళ ఆ రాతి ద్వారం తెరుచుకునేది ఈ పాములకోసం కాదు గదా! కొన్ని సర్పాలు ఏడాది కొక పర్యాయం వచ్చి తమ మణిని ధరించి మళ్ళీ తిరిగి వదిలి వెడతాయని చెప్పుకుంటారు-'' అన్నాడు రామేశం.

ఈ ఆలోచనతో ఇద్దరూ వణికిపోయారు. అదే నిజమైతే వారికింక విముక్తి లేదు. ఇద్దరికీ ఒకే క్షణంలో చావు తప్పదు.

మళ్ళీ టాకూర్ అన్నాడు. ''ఇది కేవలం మన ఊహ. పాములవల్ల చావాల్సివస్తే ఎలాగూ తప్పదు. ఊహాలతో మనను మనం చంపుకోవద్దు. ముందీ రాళ్ళను మూటగా కడదాం.''

బుట్టలో తిను బండారాలమీద వుంచిన ఒక గుడ్డతీసి ఇద్దరూ ఆ రాళ్ళను లెక్కపెట్టి మూటగా కట్టారు. మొత్తం ఇరవైమూడు రాళ్ళున్నాయి. వాళ్ళు మూట కట్టడం పూర్తి కాగానే మృత్యులోయలో ఇదివరకటి కాంతి తగ్గిపోయింది. ఇప్పుడక్కడ కనుచీకటి పడు

తున్నట్లుగా వుంది. ఈ మార్పుకు వాళ్ళిద్దరూ ఆశ్చర్య పడ్డారు.

"ఈ రాళ్ళ ప్రయోజనం అర్థమయింది..." అన్నాడు రామేశం.

టాగూర్‌కూ అర్థమయింది. మృత్యులోయకు వెలుతురు ప్రసాదిస్తున్నవా రాళ్ళేనని ఇద్దరూ గ్రహించారు. వెంటనే ఇద్దరూ మూటవిప్పారు. మళ్ళీ లోయ కాంతితో నిండింది.

"బయటపడే అవకాశంవస్తే అప్పుడు మన మీ మూటలను కూడా తీసుకుపోదాం—" అన్నాడు టాగూర్.

"అలా చేయవద్దు—" అన్నాడు రామేశం—"ఈనాడు మనం బయట పడవచ్చు కానీ ఈ మృత్యులోయకు ఇంకా ఎంతమంది బలి కావలసివుందో? ముందు ముందు ఇక్కడికి రానున్న వారికి మన కారణంగా మరిన్ని అనర్థాలు జరిగితే మనకు ఈ ఆటవికులకూ పెద్ద తేడా ఏమీ వుండదు. ఏ ప్రయోజనాన్నాశించి ఈ రాళ్ళిక్కడ వుంచబడ్డాయో ఆ ప్రయోజనానికే ఈ రాళ్ళను ఉంచేద్దాం!"

టాగూర్ మొదట అంగీకరించలేదు కానీ తర్వాత రామేశం మానవతా వాదం అతన్ని లొంగదీసింది—"గుర్తుగా ఒక్కటంటే ఒక్కటి తీసుకు వెడతాం—" అన్నాడతను ఆఖరికి.

"మనకా మణిమీద ఆశ ఎందుకు? ఇక్కణ్నించి బయటపడ్డాక బయట ప్రపంచానికి చూపుదామనే గదా! అలా చూడగల అవకాశం మనకు వస్తే మనం చేతులు ముడుచుకు కూర్చోము గదా! ఈ మృత్యులోయ అంతం చూస్తాం.

"ఇప్పుడు ఒక్క మణికూడా మనం తాకవద్దు. ఆ ఆలోచనే మనకు వద్దు. మన మీ మణులతో బయటపడి

మధ్య మార్గంలో మరణించామనుకో. మనకు మణి దక్కదు. మృత్యులోయలో అంధకారానికి దోహదం చేసిన వారిమవుతాము. ఒక్క మణికూడా తీసుకు పోకుండా వుండడం మానవాళికి ప్రస్తుతానికి మనం చేయగల ఉడతా భక్తిసాయం..." అన్నాడు రామేశం.

"నా ఆలోచన అంతదూరం పోలేదు మరణించే టప్పుడు కూడా మానవాళికి సాయపడాలని చూస్తున్న మీ దృష్టికి జోహార్లు. అందుకల్లనే మిమ్మల్నింతవరకూ దేవుడు కాపాడాడనుకుంటాను. మీ కారణంగా నేను కూడా ఇక్కణ్నించి తప్పించుకునే అవకాశముండగలదన్న ఆశ ఇప్పుడిప్పుడే నాకు కలుగుతోంది" అన్నాడు టాకూర్.

తర్వాత ఇద్దరూ ఆ రాళ్ళను అక్కడ మళ్ళీ యథా స్థానంలో పెట్టేశారు.

క్షణాలు యుగాల్లా గడుస్తున్నప్పటికీ వారి అదృష్టం బాగానే వుంది. వారా లోయలో ప్రవేశించిన చాలా సేపటికి ఒక మూలగా మృత్యులోయ గోడలో చలనం ప్రారంభమైంది. వారు చూస్తుండగా ఒక పెద్ద రాయి అడ్డంగా తిరిగి బయటకు వెళ్ళడానికి మార్గం ఏర్పడింది.

రామేశం, టాకూర్ ఆలస్యం చేయలేదు. వారు గబ గబా తమ ఆహార పదార్థాల మూటలను తీసుకుని ఆరాతికి రెండు పక్కలనుంచీ ఇద్దరూ—అక్కడ ఏర్పడిన మార్గంలో ప్రవేశించారు. ఆ మార్గం చీకటిగా వుంది.

"ఒకేఒక్క మణిని తీసుకువస్తే ఈ చీకటిలో బ్యాటరీ లైటులా ఉపయోగపడతుందేమో" అన్నాడు టాకూర్.

"ఈ చీకటి మనకు శాశ్వతం కాదు. ఎలాగో బయట పడగలం" అన్నాడు రామేశం.

ఇద్దరూ చీకట్లో తడుముకుంటూ ముందడుగు వేస్తు

న్నారు. ఏ క్షణంలోనైనా పాము బుసకొడుతుందేమోనని ఇద్దరూ భయపడుతున్నారు. కొంతమార్గం ప్రయాణం చేసేసరికి వారికి కొంత వెలుతురు కనబడింది.

"బహుశా మన కష్టాలు గట్టెక్కాయనుకుంటాను. భూభాగం మీదకు వెడతాము అదృష్టంకొద్దీ ఇంతవరకూ ఏ సర్పాలూ మనకు ఎదురుకాలేదు" అన్నాడు టాకూర్.

వారు ముందడుగు వేస్తున్నకొద్దీ వెలుతురు హెచ్చుకాసాగింది. ఇద్దరూ నడకవేగం హెచ్చించారు. క్రమంగా ఆ సొరంగమార్గం వారినిభూమిమీదకు చేర్చింది. ఇద్దరూ కళ్లు నులుముకుని ఆత్రుతగా చుట్టూ చూశారు.

అదీ అరణ్యమే! తాము నడచిన దూరాన్ని అంచనా వేసుకుంటే రామేశానికి అనిపించినదేమిటంటే ఆటవికుల గూడేనికి సమీపంలోనే తాముండి వుండాలి.

"ఇప్పుడేం చేయాలి?" అన్నాడు టాకూర్.

రామేశం యేదో చెప్పబోయి ఆగిపోయాడు. భయంతో ఆయనకళ్ళు ఉబికాయి.

చెట్లచాటునుంచి అయిదుగురు ఆటవికులు వచ్చి వాళ్ళిద్దర్నీ చుట్టుముట్టారు.

"మృత్యులోయనుంచి తప్పించుకువచ్చారా? మీ అంత అదృష్టవంతుల్ని మేమెక్కడా చూడలేదు" అన్నాడు వాళ్ళలో ఒకడు.

"మీకేమీ భయంలేదు. మిమ్మల్ని క్షేమంగా మీరు కోరినప్రాంతం చేరుస్తాం." అన్నాడింకో ఆటవికుడు.

"ఎటొచ్చీ మీ అదృష్టానికింకో పరీక్ష వుంది" అన్నాడు మరో ఆటవికుడు.

"ఏమిటది?" అన్నాడు రామేశం నీరసంగా. పరీక్ష మీద పరీక్షలు జరిగాయింతవరకూ. అయిదుగురికి యిద్దరు మిగిలారు—ఎంతో మానసిక వేదననుభవించారు. ఇంక

పరీక్షలను తట్టుకునే ఓపిక కూడా లేదు.

"మిమ్మల్నిద్దర్నీ సోదా చేస్తాం. మృత్యులోయలో అపూర్వమైన మణులున్నాయి. లోయను వెల్తురునివ్వడం కోసం మావాళ్లా రాళ్ళనక్కడ వుంచారు. అయితే అందులోంచి బయటపడ్డవాళ్ళకు వాటిమీద ఆశవుండవచ్చు. అందుకని వాటిని అపహరించాలనుకోవచ్చు. అలాంటి ఆశపోతులను మేము క్షమించము. మా దేవత వాళ్లకు నిర్ణయించినది మరణశిక్ష ఒక్కటే. మీ ఇద్దరిలో ఎవరివద్ద ఆ మణి వుంటే ఆ మనిషిగుండెల్లో అయిదు బల్లేలొక్కసారి దిగబడతాయి. అలా మణిలేని పక్షంలో మీరు కోరిన సురక్షిత ప్రాంతానికి మిమ్మల్ని చేరుస్తాం" అన్నాడు ఒక ఆటవికుడు.

ఆ మాటలు విని, అర్థం టాకూర్ కి చెప్పి రామేశం తృప్తిగా నిట్టూర్చాడు. ఇన్నాళ్ళకు ఒక మానవతావాదం తనను రక్షిస్తోందన్న మాట! "ముందు నన్ను సోదా చెయ్యండి" అంటూ ఆయన ముందుకు వెళ్ళాడు.

రామేశాన్ని వాళ్ళు సోదాచేస్తూంటే టాకూర్ గుండెలు భయంతో విలవిల్లాడిపోతున్నాయి. అప్రయత్నంగా అతడిచేతులు జేబులోకి వెళ్ళబోయాయి. ఆటవికులతన్ని శ్రద్ధగా గమనిస్తున్నారు. ఇద్దరు చటుక్కున ముందరకు వచ్చి అతడి రెండుచేతులూ బలంగా పట్టుకున్నారు.

"ప్లీజ్ నన్ను వదలిపెట్టండి" అన్నాడు టాకూర్ హిందీలో.

రామేశాన్ని సోదాచేయడం పూర్తయింది. "నువ్వు నిజంగా అదృష్టవంతుడివి" అన్నాడు ఆయన్ను సోదా చేసిన ఆటవికుడు.

ఇద్దరు ఆటవికులు టాకూర్ ను సమీపించారు.

టాకూర్ రామేశాన్నుద్దేశించి "నా అంత్యకాలం సమీపించింది. నీ మాట చెవిన పెట్టక ఒకేఒక్క మణి నా జేబులో దాచాను. నా కొడుకు చిరునామా గుర్తుందికదా. తప్పకుండా వెళ్ళి వాడిని కలుసుకుని ఈ కథంతా చెప్పు. నా చావుకు ప్రతీకారం తీర్చేదాకా నా ఆత్మ శాంతించదని వాడికి చెప్పు" అన్నాడు. అతడి కళ్లలో కొట్టొచ్చినట్లు కనబడుతోంది ప్రాణభీతి.

రామేశం జాలిగా చూశాడు టాకూర్ వంక.

"ఇన్ని కష్టాలు గడిచిగట్టెక్కేక ఈ విధంగా ప్రాణాలు పోగొట్టుకుంటున్నందుకు నాకు చాలా బాధగా వుంది. ఏం చేసేది? దేవుడు నన్ను చిన్నచూపు చూశాడు" అన్నాడు టాకూర్ మళ్ళీ.

ఆటవికులతణ్ణి సోదా చేయడం ప్రారంభించారు. అతడు మణి వుంచిన జేబుతప్ప మిగతా సోదా పూర్తి అయింది. మణివుంచిన జేబులోకి ఆటవికుడి చేతులు వెడుతూంటే తన జీవితం ముగిసినట్లే భావించి కనులు మూసుకున్నాడు టాకూర్. ఉరికంబం ఎక్కిన నేరస్థుడి భావాలు అతడి మెదడులో చోటుచేసుకోసాగాయి.

"నువ్వూ అదృష్టవంతుడివే!" అన్న మాట విని ఆశ్చర్యంగా కళ్ళు తెరిచాడు టాకూర్.

ఆటవిక లతడివంక ఆప్యాయంగా చూస్తూ "ఎందుకలా కంగారుపడ్డావు? నీ దగ్గర కూడా మణి లేదు. మీ ఇద్దరూ ఎక్కడికి వెళ్లాలనుకుంటున్నారో చెప్పండి. వదిలి పెడతాం" అన్నాడు.

అది కలో, వైష్ణవమాయయో అర్థంకాలేదు. తన చేతుల్తో తను జేబులో మణిని వేశాడు. తన అదృష్టంకొద్దీ జేబుకు చిల్లివుండి అదెక్కడో పడిపోయివుండాలి. ఏది ఏమైతేనేం_తన ప్రాణాలు రక్షించబడ్డాయి. అంతటి

సంతోషం టాగూర్ జీవితంలో ఎన్నడూ పొందివుండడు.

“గంగాపురం” అన్నాడు రామేశం.

ఆటవికుడి ముఖంలో కంగారు కనబడింది “గంగాపుర వాసులకు మీరు శత్రువులు. వారు మాకు మిత్రులు కాబట్టి మీరు మాకు శత్రువులు. వారి శత్రువులను మేము ప్రాణాలతో వదిలిపెట్టడం జరగదు. మీది అరుదైన అదృష్టం. మిమ్మల్ని వదిలిపెట్టడమన్నది మేము స్వతంత్రించి చేస్తున్నపని. మిమ్మల్ని మేమిలా వదిలిపెట్టినట్లు గంగాపుర వాసులకు తెలిస్తే వారికీ మాకూ గొడవలు వస్తాయి. అది మా కిష్టంలేదు. కాబట్టి ఇంకేదైనా ప్రాంతం చెప్పండి.’.

“అయితే రాజమండ్రికి దారి చెప్పండి. మేంపోతాం” అన్నాడు రామేశం.

“మా గూడేనికి దారి గంగాపురంలోని కొందరు ముఖ్యులకు తప్ప మరెవ్వరికీ తెలియదు. ఇతరులకు తెలియడం మాకూ ఇష్టంలేదు. మీరు రాజమండ్రి వెళ్ళాలనుకుంటే మాకేమీ అభ్యంతరంలేదు. మిమ్మల్ని స్పృహ తప్పించి ఓ బుట్టలో వేసుకుని మా సాధనాలతో రాజమండ్రి చేరుస్తాము” అన్నాడు ఆటవికుడు.

వాళ్ళిద్దరూ అంగీకారాన్ని తెలియపర్చగానే ఆటవికులు ఇద్దరికీ స్పృహ తప్పించారు. స్పృహ వచ్చేసరికి ఇద్దరూ రాజమండ్రీ రైల్వేస్టేషన్లో వున్నారు.

“ఎలా వచ్చేం ఇక్కడికి?” అన్నాడు రామేశం.

“ఎలాగో అలా వచ్చాం! మనమిద్దరం ప్రాణాలతో బయటపడి నాగరకుల మధ్యకు రావడం ఓ పెద్ద విశేషం.” అన్నాడు టాగూర్. అతను రామేశాన్ని గట్టిగా కౌగలించుకున్నాడు. రామేశం నెమ్మదిగా కౌగిలి విడిపించుకుని, “ఏమిటిది టాగూర్” అన్నాడు.

"అటవికులు నన్ను సోదా చేస్తున్నప్పుడే నా ప్రాణాలు పోయాయనుకున్నాను. నీ మాట విననందుకు ఎంత పశ్చాత్తాపం కలిగిందో చెప్పలేను. చేజేతులా చావుకోరి తెచ్చుకున్నానని నన్ను నేనే నిందించుకున్నాను. నేను చేసిన తప్పు చేయకుండా నీ ప్రాణాలు నువ్వు రక్షించుకో గలిగినందుకు నీమీద నాకు అసూయకూడా కలిగింది..." అన్నాడు టాగూర్.

రామేశం నవ్వి-"ఆ రాళ్ళు తీయకపోవడం మన ప్రాణాలను కాపాడుతుందని నాకు తెలియదు. నాకూ జీవితంలో ఇదొక అపూర్వానుభవం. నీ దృష్టి ఆ రాళ్ళమీద పడిందనీ ఎలాగైనా వాటిల్లో ఒక దాన్నైనా పొందాలను కుంటున్నావనీ నీ ముఖం చూసి నేను గ్రహించాను. వెయ్యి కళ్ళతో నిన్ను కనిపెడుతున్న నేను ఒక మణిని నీ జేబులోకి జార విడవడం గమనించాను. నామీద అనుమానం లేని నువ్వు నేను నీ జేబులోని మణిని తస్కరించి మళ్ళీ యధాస్థానంలో ఉంచేయడాన్ని గమనించలేక పోయావు." అన్నాడు.

"ఏమిటీ?" అన్నాడు టాగూర్. అతడి ముఖంలో ఆనందాశ్చర్యాలు ఒక్కసారిగా చోటు చేసుకున్నాయి.

"అవును. అదే జరిగింది. అప్పట్లో నా మనసుకు తోచిన పని నేను చేశాను కానీ నీ ప్రాణాలు రక్షిస్తున్నానని నాకూ తెలియదు. అయినా ప్రాణాలు పోతాయని తెలిసుంటే నువ్వా ఆ పని చేసుండేవాడివి కాదు గదా!" అన్నాడు రామేశం.

"రామేశం నువ్వు నా ప్రాణదాతవు!" అంటూ ఆయన రెండు చేతులూ పట్టుకున్నాడు టాగూర్. అంతకు మించి ఏమనడానికీ అతడి నోట మాట రాలేదు. అతని కళ్ళలోంచి అశ్రు బిందువులు ధారగా వర్షిస్తున్నాయి.

తను చేసిన ఒకే ఒక్క పొరపాటు తన ప్రాణాలు తీయవలసింది. కానీ ఆ పొరపాటును రామేశం సవరించాడు.

"నేను కాదు నీ ప్రాణదాతను. నేనే గనుక నీ ప్రాణదాతనైతే నాతో మనతో బయల్దేరిన మిగతా ముగ్గురి ప్రాణాలనూ కూడా రక్షించాలని వుంది. ఆ పని చేయలేకపోయాను...." అన్నాడు రామేశం. ఆయన కళ్ళలోని బాధను స్పష్టంగా చదవగలిగాడు టాకూర్. జరిగిన భయంకర అనుభవం లాకటాకటిగా గుర్తుకు వస్తుంటే అతను వణికి పోయాడు.

"ఇప్పుడు నాలో పగ, ద్వేషం నశించాయి. జరిగినది జరిగి పోయింది. నీ నుంచి నేను నేర్చుకున్న మానవతావాదాన్ని గుర్తుంచుకుని నా శేష జీవితాన్ని గడిపేస్తాను" అన్నాడు టాకూర్.

"అది సరికాదు." అన్నాడు రామేశం. "భగవంతుడు మనకు ప్రాణాదానం చేశాడు. అంటే ఆయన మననుంచి ఏదో ఆశిస్తున్నాడు. ఆ అపూర్వ నిధిని ప్రభుత్వానికి అప్పగించడానికీ, ఆ మూతా దురాగతాల నరికట్టడానికీ, ఆ ఆటవికుల మృత్యులోయను పూడ్చడానికీ మనం నడుం కట్టుకోవాలి."

"అందువల్ల మనం సాధించగలిగినదేముంది? నువ్వన్నట్లు ఈ నాగరక ప్రపంచంలోనే ఎన్నో అనాగరక పద్ధతులున్నాయి. వాటిని మనం ఏమీ చేయలేకపోతున్నాం. ఇలాంటి విషయాల్లో మనం పూర్తిగా నిస్సహాయులం." అన్నాడు టాకూర్.

"అది కాదు టాకూర్. నిధిని వశపరుచుకున్న ముఠా మన అయిదుగురితోనూ ఆడుకున్న పద్ధతి చూశాం గదా! వాళ్ళు మహా దుర్మార్గులు. అలాంటి దుర్మార్గుల చేతికి

అంతటి ధనం లభిస్తే వాళ్ళు మరింత కిరాతకాలకు పాల్ప
డతారు. మరెందరో ఆ కిరాతకాలకు బలి అవుతారు.
ఆ కిరాతకాల నరికట్టడం మన బాధ్యత. ఇందుకు ఏదో
ఉపాయం చూడాలి.'' అన్నాడు రామేశం.

''జరిగిన సంఘటనలతో నా మెదడు తుప్పుపట్టి
పోయింది. నీవు చెప్పినట్లు చేయడమే నా ఆశయం,
కర్తవ్యం. పదిమంది కుపయోగపడే పనులు ఏమి చేయ
డానికైనా నేను సిద్ధమే–ఆదేశించు...'' అన్నాడు
టాకూర్.

''ఈ విషయంలో మనకు పోలీసులు సాయం లభిస్తుం
దనుకోను. ముందుగా వాళ్ళు మన మాటల్ని నమ్మాలి.
నమ్మకపోతే మనం చాలా ఇబ్బందుల్లో పడతాం. టాక్సీ
వాలా, జోహారీ, జోగారావుల గురించి మనమే సమా
ధానం ఇచ్చుకోవలసి వస్తుంది. ఆ దుండగులు మనం
తప్పించుకున్నట్లు పసిగడితే డబ్బుతో సాక్ష్యాల్ని కొనేసి
మనను నేరస్థులుగా కోర్టులో నిలబెట్టగలరు. అందువల్ల
మనం వారిని వారి పద్ధతుల్లోనే ఎదుర్కోవాలి. అందుకు
మనకు సింహంలాంటి మనిషి కావాలి...'' అన్నాడు
రామేశం.

* * *

''ఇదీ జరిగింది. అప్పట్నించీ నేనూ, టాకూర్ కూడా
ఆ ప్రయత్నంలోనే వున్నాము...'' అన్నాడు రామేశం
తాత, మనవడితో.

''తాతయ్యా!'' అన్నాడు మనవడు. అతని ముఖంలో
కోపం, ఉద్రేకం, ఆశ్చర్యం వున్నాయి. ''నీకిలాంటి అను
భవం జరిగినట్లు నాకెందుకు చెప్పలేదు? ఏడాదినుంచి నీలో
ఏదో దిగులు గూడుకట్టుకుని వున్నదని గమనిస్తూనే
వున్నాను కానీ దాని వెనుక వున్న కారణమిది అని నాకు

నువ్వు చెప్పలేదు"

"ఒరేయ్ రామం." అన్నాడు రామేశం, "మీ నాన్న నీకు ముద్దుగా నా పేరుపెట్టాడు. చిన్నప్పట్నించీ అల్లారు ముద్దుగా పెరిగావు కష్టమంటే ఏమిటో తెలియకుండా నిన్ను నేను పెంచాను. చిన్నితనంలోనే నీకు తల్లీతండ్రీ దూరమైతే ఈ చేతుల్తో పెంచి పెద్దవాణ్ని చేశాను. నిన్ను నేను అతి సుకుమారంగా పెంచాను తప్పితే మరో విధంగా తయారు చేయలేదు. జీవితంలో ఆటువంటి అనుభవం తటస్థ పడుతుందని నాకు ముందుగానే తెలిసి వుంటే_నిన్ను మరోకలా పెంచి వుండేవాడి నేమో!"

రామం ఏమీ మాట్లాడకుండా తాత వంకే చూస్తున్నాడు.

రామేశం నిట్టూర్చి_"గోమాత కడుపున పులిపిల్ల పుట్టదు. భగవంతుడు ముందుగానే కొన్ని నిర్ణయాలు చేస్తాడు. పులిపిల్ల కానంత మాత్రాన ఆవుకు పుట్టిన లేగదూడ జీవితం వ్యర్థం కాదు కదా! ఈ సృష్టిలోని ప్రతి జీవికి ఒక పరమార్థం వుండనే వుంది. మన జీవన విధానం వేరు. మనం దొంగల నెదుర్కోవడానికీ, యుద్ధాలు చేయడానికీ పుట్టలేదు." అన్నాడు.

"ఇందులో పరమార్థమేంలేదు_ఇదంతా నీ స్వార్థం_" అన్నాడు రామం_"నీ మనవడు కాకుండా మరో ప్రాణినీ విషయానికి బలిపెట్టాలని నీ ఆలోచన."

"ఏమాత్రమూ కాదు. సింహంలాంటి ఒక మనిషి దొరికితే, తోడుగా నిన్నూ పంపిస్తాను. మీరిద్దరూ కలిసి వెళ్ళి అన్నీ సాధించుకు వస్తారు..." అన్నాడు రామేశం.

తన తాతయ్య మనసులోని ఆలోచన లేమిటో రామానికి అర్థం కాలేదు. తాతయ్య చెప్పిన కథలో ఇంకా కొన్ని ప్రశ్నలుకూడా వుండిపోయాయి.

"మరి టాగూర్ ఏమయ్యాడు తాతయ్యా!" అన్నాడు రామం.

"ఉన్నాడు. కొంత కాలంలో ఇక్కడికి వస్తాడు. తన కొడుకుతో అతనిక్కడికి రావచ్చును. అందు గురించి తన కొడుక్కు అతడు చాలా శిక్షణకూడా ఇప్పిస్తున్నాడు..." అన్నాడు రామేశం ఏదో ఆలోచిస్తూ. "అంతవరకూ నువ్వు మాత్రం ఏ విషయంలోనూ తొందర పడకూడదు. ఈ విషయాన్ని నువ్వు రహస్యంగా వుంచాలి.

"అలాగే తాతయ్యా" అన్నాడు రామం. అలాగని పక్కకు చూసిన అతను వులిక్కిపడ్డాడు. తమ ముందుకు నడిచివస్తూన్న మనిషిని అతను చూడడం అందుకు కారణం.

"నా పేరు గురువులు" అన్నాడా మనిషి.

రామేశం, రామం కూడా గురువులు వంక ఆశ్చర్యంగా చూస్తున్నారు. చూడ్డానికి పీనుగులా వున్నాడు గురువులు. మనిషి కళ్ళలో ఎక్కడా అదురు, బెదురూ లేదు. నడకలో హుందా వుంది.

"గురువులు పేరు విన్నాను" అన్నాడు రామేశం.

"అందుకే ఆ పేరు చెప్పాను. ఇప్పుడు నా పేరు చాలామందికి తెలుసు. కాసేపుంటే ఆకాశవాణిలో హెచ్చరికలు కూడా రావచ్చు. నేను జైల్నుంచి పారిపోయి వస్తున్నాను" అన్నాడు గురువులు.

రామం ఉలిక్కిపడ్డాడు. గురువులు గురించి అతడికీ ఇప్పుడు గుర్తుకు వచ్చింది. పేపర్లలో వాడి గురించి చాలా వివరాలు చదివాడతను. గురువులు నరరూప రాక్షసుడనీ, అదృష్టంకొద్దీ పోలీసులకు దొరికాడనీ, తప్పించుకోకుండా పటిష్టమైన పోలీసు కాపలా ఏర్పాటు చేయబడిందనీ

అతను వార్తల్లో చదివాడు.

ఆ గురువులు ఇప్పుడు తన కళ్ళముందు నిలబడి వున్నాడు. మనిషిలో ఏ కోశానా భయంలేదు. తను జైలు నుంచి పారిపోయి వచ్చానని నిర్భయంగా చెబుతున్నాడు.

"ఏం కావాలి నీకు?" అన్నాడు రామేశం.

"నువ్వు నీ మనవడికి చెబుతున్న కథంతా విన్నాను" అన్నాడు గురువులు.

"అంతా...అంతా...విన్నావా?" అన్నాడు రామేశం తడబడుతూ.

"అవును. అంతా విన్నాను. నీ కథ నన్నాకర్షించింది. నువ్వు కోరే సింహం ఎప్పుడు దొరుకుతుందో నాకు తెలియదు. నన్ను నేను పొగుడుకోవడం నాకిష్టముండదు. ఆ అపూర్వనిధికోసం నేను నా ప్రాణాలైనా ధార పోయాలనుకుంటున్నాను. నేను గంగాపురానికి బయ ల్దేరతాను. నీ మనవణ్ణి నాతో పంపుతావా?" అన్నాడు గురువులు.

"నేను కోరే సింహం నీకులాంటి నేరస్థుడు కాదు. దేశభక్తి గలవాడు. పవిత్రతను పాటించేవాడు. స్వార్థం లేనివాడు" అన్నాడు రామేశం.

గురువులు పకపకా నవ్వాడు. "అలాంటి మనిషి ఒక్కడంటే ఒక్కడున్నాడని నువ్వు బుజావుచేస్తే నీ కళ్ళముందే పొడుచుకు చస్తాన్నేను. నేను నేరస్థుణ్నే కానీ సమాజం నా మీద ఆ ముద్ర వేయడంవల్ల నేను నేరస్థున్నయ్యాను. సమాజం నిండా నాకు బోటి నేరస్థులు చాలామందున్నారు.

దేశమంటే నాకూ ఇష్టమే! నేనెప్పుడూ దేశద్రోహానికి తలపడలేదు. పవిత్రత అంటావా, చాలామందికంటే ఎక్కువే ఉంది నాకు. ఏడాదిపాటు హత్యలు చేయ

కుండా ఉన్నప్పుడే నన్ను ముట్టుకోవాలని ఓ ఆడపిల్ల అంటే దాన్ని తాకనైనా తాకలేదు. స్వార్థం సంగతి చెప్పుకోవాలంటే నేనూ అందరిలాంటివాణ్ణే! పూర్తిగా నేనూ నాకోసం బ్రతకడంలేదు.''

రామేశం చిత్రంగా చూసి, ''నా ఇంట్లోకి యెలా వచ్చావ్?'' అన్నాడు గురువులి నొక ప్రశ్న వేస్తున్నట్లుగా—

''శ్రీకృష్ణపరమాత్మ పంపాడు!'' అన్నాడు గురువులు.

''శ్రీకృష్ణపరమాత్మ ఎవరు?'' అన్నాడు రామం ఆశ్చర్యంగా.

''నాకు తెలుసులే'' అన్నాడు రామేశం— ''అయితే శ్రీకృష్ణపరమాత్మ నిన్నిక్కడకు పంపాడన్నమాట. ఆయన ఆదేశం మీదనే నేనిరోజు ఈ సమయంలో నా మనవడికి జరిగిన కథ చెప్పాను. బహుశా నువ్వు వినాలని ఆయన సంకల్పం కాబోలు. ఆయన లీలలు విచిత్రాలు!''

రామం అర్థంకాక తెల్లబోయి గురువులు వంకనూ, రామేశం వంకనూ చూస్తున్నాడు. అంతా గారడీలా ఉందతనికి.

గురువులుకూడా ఆశ్చర్యంగా, ''అయితే నావల్ల ఆయన కోరే పని ఇదేనన్నమాట!'' అన్నాడు.

''ఈ పనికి ఆయన నిన్నెన్నుకోవడం ఆశ్చర్యంగా ఉంది'' అన్నాడు రామేశం.

''శ్రీకృష్ణపరమాత్మ మనిషేనా తాతయ్యా?'' అన్నాడు రామం.

''మనిషే కానీ పరమాత్మ అంతటివాడు'' అన్నాడు రామేశం.

''ఇప్పుడు నేనేం చేయాలి?'' అన్నాడు గురువులు.

''శ్రీకృష్ణపరమాత్మ ఇక్కడకు ఈరోజు మధ్యాహ్నం

వస్తాడు. అంతవరకూ నువ్వు విశ్రమించవచ్చు" అన్నాడు రామేశం.

శ్రీకృష్ణపరమాత్మను చూడాలని రామానికూడా కుతూహలంగా వుంది. రామేశం మాత్రం మనవడితో, "బహుశా నీ ప్రయాణానికి సమయం ఆసన్నమయిందను కుంటాను. చక్రబెట్టుకోవలసిన రాచకార్యాలేమైనా వుంటే మధ్యాహ్నంలోగా చక్కబెట్టుకున్నారా..." అన్నాడు. మనవడి రాచకార్యాలేమిటో అయనకూ తెలుసు.

* * *

రామం బియ్యే ప్యాసయ్యాడు. ఊళ్ళో ఓ పుస్తకాల షాపుంది. అది బాగా రన్ అవుతూంది. దాని వ్యవహారాలు చూడ్డానికి మేనేజర్ ఉన్నాడు. ఆ మేనేజరు మంచి నమ్మకస్థుడు.

అందువల్ల రామం కాస్త పైలాపచ్చీసుగా తిరుగుతూంటాడు. చిన్నప్పట్నించీ గారంగా పెరగడం వల్ల అతడికి కష్టాలగురించి అట్టే తెలియదు. సినిమాలు యెక్కువగా చూస్తుంటాడు. అవి చూసినప్పుడల్లా తనుకూడా వాటిలోని హీరోల్లా ఏమైనా సాధించాలని అనుకుంటూంటాడు.

రామానికో ప్రియురాలుంది. ఆమె పేరు లలిత. బియ్యే ఫస్టియర్ చదువుతోంది.

వాళ్ళిద్దరూ కలిసి తిరుగుతున్నట్లు రెండు కుటుంబాల వారికీ తెలుసు. రెండు కుటుంబాలకూ దూరపు బంధుత్వముంది. ఈడూ జోడుకూడా బాగానే వుంది. అందువల్ల వీరి పరిచయం పెద్దలకు మరీ అంత కంటగింపుగా లేదు. ఎటొచ్చీ పెళ్ళి మాటలు ఇంకా రాలేదు. (సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/-లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 7/-లకే మా ఏజెంట్ ద్వారాగాని, వి. పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరుగనవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

7. నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు, ఏడాది పైకము రు. 80/-లు ముందుగా పంపితే వారికి కాపీలు 'రికార్డెడ్ డెలివరీ'లో పంపగలము.



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును. —ఎడిటర్]

## రవ్వల నెక్లెస్

ఒక లక్షాధికారి యింట్లో పెండ్లి అవుతోంది. ఇంతలో హాలులో లైట్లు అన్నీ ఆరిపోయి, మళ్ళీ వెలిగేయి. ఆ కాస్త సమయంలో పెళ్ళి పీటలమీద కూర్చున్న పెండ్లి కుమార్తె మెడలోని రవ్వల నెక్లెస్ యెవరో కొట్టేసారు. ఆ పెండ్లికి వచ్చిన ది గ్రేట్ డిటెక్టివ్ 'ఆలోచనరావు'ను దొంగ యెవరో పట్టుకోమన్నాడు లక్షాధికారి.

ఆలోచనరావు కాసేపు ఆలోచించి, పెండ్లికి వచ్చిన వారందరిని బాగా పరిశీలించాడు. బ్లాక్ పేంటుమీద వైట్ షర్ట్ టక్ చేసుకున్న 25 ఏళ్ళ వయస్సువున్న అతనిని చేయిపట్టుకుని "మిష్టర్ నీవు కొట్టేసిన రవ్వల నెక్లెస్ బయటకు తీయి" అన్నాడు.

తాను నెక్లెస్ తీయలేదని బుకాయించబోయేడు ఆ యువకుడు. కాని ది గ్రేట్ డిటెక్టివ్ ఆలోచనరావు అతని ప్యాంటు జేబునుండి నెక్లెస్ తీసాడు. హాలులోవున్న జనం అందరు అతని తెలివికి ఆశ్చర్యపడ్డారు.

లక్షాధికారి "మీరు అతనే నెక్లెస్ తీసినట్లు ఎలా తెలుసుకున్నారు?" అని అడిగేడు.

"దొంగను చాల సులభంగా కనుగున్నాను. పెండ్లి కుమార్తె వంటిమీద పసుపు వుందికదా! అతను కరెంట్ పోయినప్పుడు నెక్లెస్‌తీసి ప్యాంటుజేబులోనికివేసుకున్నాడు. నేను యిక్కడికి వచ్చిన వారందరిని బాగా గమనించాను

వారిలో యితనికి తప్ప మిగతా వారందరి బట్టలకు పసుపు మరకలు కనబడలేదు. ఆ పసుపు మరకలే ఇతనిని పట్టి యిచ్చాయి" అన్నాడు ది గ్రేట్ డిటెక్టివ్ ఆలోచనరావు.

అందరు అతని తెలివికి ప్రతిభకు జోహార్లు అర్పించారు. నెక్లెస్ లేసినతను విక్కా ముఖం వేసాడు పాపం!

—'కిశోర్', కాకినాడ.

## క్రమం తప్పనిది??

కలక్ట్రేట్‌లో కాళీ వచ్చిన గుమస్తా పోస్టుకోసం, ఎంప్లాయిమెంటు ద్వారా పంపబడ్డ పదిహేనుమంది అభ్యర్థులలో బాబూరావు ఒకడు.

పధ్నాలుగుమంది అయిపోగానే, ప్యూన్ పొలికేకతో బాబూరావు లోనికి నడిచాడు. ఇంటర్వ్యూ ఆఫీసరు కూర్చోమనగానే కుర్చీలో కూర్చున్నాడు.

"మీ పేరు?"

"సర్టిఫికెట్ ప్రకారం బాబూరావ్. మా అమ్మ మాత్రం నన్నుముద్దుగా బాబూ అంటుంది.మా నాన్నగారైతే రావ్‌జీ అంటారు. స్నేహితులైతే మాత్రం బాబ్జీ అంటారు."

"తాజ్‌మహల్ ఎక్కడుంది?"

"ఇండియాలో"

"జీవితంలో మీకు బాగా ఆశ్చర్యాన్ని కలిగించే విషయం ఏమిటి?"

"నాకు రెండు సంవత్సరాలుగా క్రమం తప్పకుండా పౌర్ణమి, అమావశ్యలలో ఉదయానే వచ్చేది నేడింకా రాకపోవడం."

"ఏమిటది?"

"పిచ్చి"

"! ? !"

—ఎల్. సత్యం, కొత్తూరు.

